**వందే వేదాంత కర్పూర చామీకర కరణ్డకమ్ ।**

**రామానుజార్య మార్యాణాం చూడామణి మహర్నిశమ్ ॥**

భగవద్రామానుజులు అనుగ్రహించిన గద్యలు మూడు అవి శరణాగతి గద్యము, వైకుంఠ గద్య, శ్రీరంగ గద్య. ఈ మూడింటిలోనిదైన శరణాగతి గద్యను గూర్చి సంక్షేపముగా తెలుసుకొనే ప్రయత్నమే ఇది.

తైత్తరీయ ఉపనిషత్తులో **సత్యం తపోదమశ్శమో దానం ధర్మ ప్రజననమగ్నయో ఽగ్నిహోత్రం యజ్ఞోమానసమ్** అని సత్యం మొదలైనవి ఒకదాని కన్న ఒకటి ఉత్కృష్టమైనవి చెప్తూ అన్నింటికన్న మించినదిగా శరణాగతిని తెలియజేస్తూ **తస్మా న్యాసమేషాం తపసామతిరిక్తమాహుః** అన్నారు.

ఈశావాస్యోపనిషత్తు భగవంతుని దృష్టిలో చాల గొప్పది నమస్కారమని భూయిష్టాంతే నమ ఉక్తిం విధేమ నిష్కర్షగా చెప్పింది. ఈ నమస్కారమే శరణాగతికి బాహ్యలక్షణం.

శరణము అనగా ఉపాయము. ఆగతి అనగా మనసులో దృఢముగా నిలచుట వాడే ఉపాయము అను భావము దృఢముగా నిలచుటకు శరణాగతి అని పేరు. అనగా మనను మనం రక్షించుకోలేమనే వాస్తవాన్ని ఎరిగి, ఇతరులెవరూ రక్షకులు కారనే నమ్మక కలిగి, భగవానుడే రక్షకుడనీ, ఆయనే పొందదగిన వాడనీ, పొందించే సాధన మాయనే అనీ గాఢమైన విశ్వాసము కలిగి ఉండి, భగవత్పాదారవింద సన్నిధిని మన భారాన్ని ఉంచడమే శరణాగతి. ఈ శరణాగతికి ఆరు లక్షణాలు ఉండాలని పెద్దల నిర్ణయము.

**అనకూల్యస్య సంకల్పః ప్రాతికూల్యస్య వర్జనమ్ రక్షిష్యతీతి విశ్వాసః**

**గోప్తృత్వ వరణం తథా ఆత్మ నిక్షేప కార్పణ్యే షడ్విధా శరణాగతిః**

భగవంతుడే అనుకూలుడనే భావము కలగడం, భగవదితర విషయములు వదిలివేయడం, భగవానుడు తప్పక రక్షిస్తాడని నమ్మిక కలిగి ఉండడం, త్రివిధ కరణములతో నీవే రక్షకుడవని తెలియజేయడం, తమ ఆత్మను సమర్పించుకోవడం దైన్యం కలిగి ఉండడం అనే ఈ ఆరు శరణాగతికి లక్షణాలు.

మోక్షసాధనమేది? జ్ఞానమా? కర్మా? భక్తా? లేక వాటి సముచ్చయమా? అనే సందేహాన్ని నివారిస్తూ భక్తిరూపాపన్న ఉపాసనాత్మక జ్ఞానమే మోక్షసాధనమని అదే ప్రపత్తి అని ఈ గద్య రూపంగా భగవద్రామానుజులు మనకు అందించారు. మనం శరణాగతి చేయగలమా? యజ్ఞాలు యాగాలు ఎలాగు చేయలేం, శరణాగతిని కూడ చేయలేమోమో అని భయం కలుగుతుంది. ఈ

శరణాగతికి మానసికమైన నమ్మికే పునాది. చంచల మనస్కులైన మనకు అది కుదరదేమో అనేది సందేహమే. కాని చేసిన శరణాగతి కూడా ఫలిస్తుంది అని తెలుస్తోంది. రాక్షస స్త్రీల కొరకై త్రిజట సీతమ్మ సన్నిధిని చేసిన శరణాగతి ఫలించింది. వాయుసూనుని బారి పడకుండా జానకి వారిని కాపాడింది. ఇదే విధంగా రాక్షస స్త్రీల వంటి మనందరి తరపునా భగవద్రామానుజులు చేసిన శరణాగతి ఈ శరణాగతి గద్య. తప్పు చేసినప్పుడు ఏ మాత్రం సంకోచము లేకుండా చేయడం, ఫలితమనుభవించాలంటే భయపడిపోవడం అనే లక్షణాలు మనకీ రాక్షస స్త్రీలకీ సమానమే.

పంగుని (ఫాల్గుణ మాసము) ఉత్తరా నక్షత్రంలో కూడిన శుభదివసాన రంగనాయకితో కలసి వేంచేసి ఉన్న రంగనాధుని సన్నిధిని భగవద్రామానుజులు చేసిన శరణాగతి ఇది.

భగవద్రామానుజులకు కూడ సంసారభీతి అనువర్తించిందట. సంసారమంటే భార్య, బిడ్డలు, ఇల్లు, వాకిలి కాదు. జన్మ పరంపరావలయం. దాని నుండి విడివడాలని కోరిక కలిగి భగవద్రామానుజులు వారి ఆచార్యులైన శ్రీపెరియనంబిగారి సూచన మేరకు శ్రీరంగనాధుని సన్నిధిలో సంసార నివృత్తి పూర్వక కైంకర్యము సిద్ధించుట కొఱకు ఈ శరణాగతి గద్యను అనుసంధానము చేసారు.

రామానుజులు శ్రీభాష్యంలో చెప్పినది భక్తి. ఇక్కడ చెప్తున్నది ప్రపత్తి లేక శరణాగతి. మరి వీరికి ఏదిష్టం? తాము ఒకటి చేసి ఇతరులకు మరొకటి చెప్పేరా అనేది సందేహము. భక్తునకేనా, ప్రపన్నునకైనా ఉండవలసింది భక్తే, భక్తంటే తైలధారవదవిచ్ఛిన్న స్మృతి సంతతి నూనె ధారవలె మధ్య విచ్ఛేదం లేకుండా ఒకే విషయము మీదకు సాగే తలంపులు వరుసే భక్తి. ఈ భక్తికి ముందు ఉండవలసిన సోపానాలు కర్మ, జ్ఞానము. ప్రపత్తికైతే భగవదనుగ్రహము, అక్కడ కర్మ, జ్ఞానములు చేసే పని భగవదనుగ్రహమే చేస్తుందని నమ్మి ఉండడమే దీని ప్రత్యేకత. మొదటిది సాధన భక్తి. రెండవది సాధ్య భక్తి.

మన ప్రయత్నం లేకపోతే ఉత్కృష్ట ఫలం లభిందేమో అనే అనుమానం మనసున ఆవరిస్తుందేమో అని శ్రీభాష్యంలో సాధన భక్తిని తెలియజేసేరు. పరిపక్వ మనస్కులైన వారికి గాఢమైన నమ్మిక కలవారికి ఉపయోగపడేలా శరణాగతి గద్యను అనుగ్రహించేరు.

మోక్షేచ్ఛ గలవారు తెలుసుకొనవలసిన రహస్యాలు మూడు. అందులో మొదటిది నారాయణుడు

వరుసకు ఉపదేశించిన అష్టాక్షరీ మహామంత్రం శ్రీవైకుంఠంలో శ్రీమన్నారాయణుడు లక్ష్మీదేవికి ఉపదేశించిన అష్టాక్షరీ మహా మంత్రం. శ్రీవైకుంఠంలో శ్రీమన్నారాయణుడు లక్ష్మీదేవికి ఉపదేశించిన ద్వయ మంత్రం రెండవది. కృష్ణ పరమాత్మ అర్జునకు ఉపదేశించిన చరమశ్లోకం మూడవది.

ద్వయ మంత్రములో మనం తెలుసుకోవలసిన విషయాలివి. లక్ష్మీ విశిష్టుడైన నారాయణుని శ్రీపాదములనే ఉపాయంగా పఠించాలి. వానినే ఉపాయంగా స్వీకరించుచున్నానని ఆ దంపతుల సన్నిధిని విన్నవించాలి.ఆ లక్ష్మీ నారాయణ మిధునమునకు చేయు సేవ నా ఆనందం కొఱకో లేక నా ప్రయోజనం కొఱకో అనుకుంటే అది భగవదనుభవ ప్రతిబంధకమవుతుంది. అటువంటి ప్రతిబంధకాలు తొలగాలని నమః అంటూ ప్రార్థన చేయాలి. ఈ విధంగా ద్వయ మంత్రం చెప్పిన విషయాలన్నీ శరణాగతి గద్య వివరించింది.

శరణాగతి చేయాలంటే ముందుగా ఉపేయమైన భగవానుని మీద రుచి కలగాలి. భగవానుడే ఉపాయం అనే నమ్మిక కుదరాలి. ఇవి కలగాలని ముందుగా భగవద్రామానుజులు లక్ష్మీదేవి శ్రీ పాదాల వద్ద శరణు వేడారు. మనం చేసే సేవ లక్ష్మీ విశిష్టుడైన నారాయణునికే చేయాలి. కాని నారాయణుడే ఫల ప్రదాత కదా! లక్ష్మీదేవిని మొట్ట మొదట ప్రార్థించడం ఎందుకు అని సందేహం కలగవచ్చు.

విష్ణుధర్మంలో సకల ఫల ప్రదోహి విష్ణుః అని సమస్త ఫలములను ఇచ్చువాడు విష్ణువు అని చెప్పబడింది. మరి లక్ష్మీదేవిని ఎందుకు శరణు వేడడం? దీనికి సమాధానము మన పెద్దలిలా చేప్పేరు.

**సుహృదం సర్వభూతానాం** అన్ని భూతములకూ సుహృత్తును నేనే అని తానే చెప్పుకున్న భగవానునికి కూడ మన దోషాధిక్యాన్ని బట్టి ఒక్కొక్కప్పుడు కోపం వస్తుందట. నీటిలో నిప్పు పుట్టినట్లు స్వామి కారుణ్య హృదయంలో క్రోధజ్వాల అంకురిస్తుందట.అటువంటప్పుడు కూడ అమ్మ లక్ష్మీదేవిలో వాత్సల్యం తరగదు. తల్లికదా! మన మీదున్న ప్రేమ, స్త్రీ సహజమైన క్షమ, పెల్లుబికి ఆయన కోపాన్ని తగ్గించే ప్రయత్నం చేస్తూ ఉంటుంది. అందువలన లక్ష్మీదేవిని ముందుగా ప్రార్థించడమనేది సంప్రదాయంగా సాగుతోంది.

లక్ష్మణ స్వామి మనకీ మార్గాన్నుపదేశించాడు. రామచంద్రుడు వనవాసగమనానికి సిద్ధమయ్యాడు. సీతమ్మను తన వెంట రావడానికి అంగీకరించాడు. ఇక లక్ష్మణుడు కూడ వనవాస గమనానికి అనుజ్ఞ అడగాలి. ఈ సన్నివేశంలో

**స(భ్రాతుశ్చరణౌ గాఢం నిపీడ్య రఘునందనః ।**

**సీతాముపాచాఽఽ తి యశా రాఘవంచ మహా(వ్రతమ్ ॥**

లక్ష్మణుడు రామచం(దుని పాదాలను గట్టిగా పట్టుకొని సీతమ్మకు ముందుగా విన్నవించి రామునితో కూడ తన కోరికను తెలియజేసాడు. ఈ శ్లోకములో లక్ష్మణుడు మనకు మార్గాన్ని ఉపదేశించాడు. గాఢం నిపీడ్య అన్నప్పుడు గట్టిగా పట్టుకోవడమంటే మనసులో విశ్వాస పూర్వకంగా నమ్మి ఉండడం అని అర్థమట. పట్టుకున్నవి స్వామి పాదాలు. ముందుగా పలుకుతున్నది అమ్మ సీతమ్మతో. అది ఆ(శయణ పద్ధతి. పట్టుకోవలసినవి స్వామి పాదాలే మనము పొందవలసినవీ పొందించేవీ స్వామి పాదాలే కాని ముందుగా విన్నవించవలసింది అమ్మ సన్నిధినే. ఇలా ఆ(శయిస్తే ఫలితము అనుకూలంగా ఉంటుంది. అలా చేసేడు కనుకనే లక్ష్మణుడు మహాయశుడు అన్నారు. దీని వలన ఇద్దరి సన్నిధినీ శరణాగతి చేయాలి కాని ముందుగా అమ్మ సన్నిధినే విన్నవించుకోవాలని తెలుస్తున్నది. దీనినే ఆదర్శంగా తీసుకొని భగవ(ద్రామానుజులు శరణాగతి గద్యలో ముందుగా అమ్మ సన్నిధిని శరణాగతి చేస్తున్నారు.

మన పూర్వాచార్యుల (గ్రంథాలన్నీ మూడు విషయాల్ని తెలియజేయడానికే ఆవిర్భవించాయి అవి తత్త్వహిత పురుషార్థములు మనం పొందవలసిన తత్త్వమేది? మనకు మేలు కలిగించేదేది? ఫలమేది? వీటిని వివరించడమే ఉత్తమ (గ్రంథ లక్షణం. శరణాగతి గద్య కూడ ఈ మూడు విషయాల్ని తెలియజేస్తున్నది. ఇందులో భగవంతుని సత్యకామ, సత్య సంకల్ప .... మొదలైన పదాలతో సంబోధిస్తూ భగవత్తత్వాన్ని తెలియజేసారు.

తత్పాదారవిందయుగలం శరణమహం (ప్రపద్యే మొదలైన శరణ వరణ (ప్రతిపాదక వాక్యాలతో హితమును తెలియజేసారు.

నిత్యకింకరో భవాని అనునట్టి (ప్రార్థనా (ప్రకాశక వాక్యముల ద్వారా పురుషార్థములను తెలియజేసినారు. ఈ విధముగా ద్వయమం(త వివరణగా తత్త్వహిత పురుషార్థోపదేశంగా తాప(త్రయాతురులమైన మనందరి కొఱకు భగవ((ద్రామానుజులు చేసిన శరణాగతిని తెలుసుకొనే (ప్రయత్నం చేస్తూ ముందుకు సాగుదాం.





# శరణాగతి గద్యమ్

**ఓమ్॥ భగవన్నారాయణాభిమతానురూప స్వరూప రూప గుణ విభవైశ్వర్య శీలాద్యనవదికాతిశయా సంఖ్యేయ కల్యాణ గుణగణాం పద్మవనాలయాం, భగవతీం, శ్రియం దేవీం, నిత్యాన పాయినీం నిరవద్యాం, దేవదేవదివ్య మహిషీం అఖిలజగన్మాతరం, అస్మన్మాతరం, అశరణ్య శరణ్యాం అనన్య శరణశ్శరణమహం ప్రపద్యే**

భగవన్నారాయణునకు ఇష్టమైనదియు, తగినదియు, కల్యాణ గుణములు కలదియు శ్రీ అను దివ్య నామము కలదియు, ఏనాడును భగవంతుని వీడి ఉండనిది పరమాత్మకు దివ్య మహిషియైనదైన లక్ష్మీదేవిని వేరొక ఆశ్రయము లేని నేను శరణు వేడుచున్నాను అని భగవద్రామానుజులు ఈ చూర్ణికలో ప్రార్థించేరు.

ఇందు మొదటగా భగవన్నారాయణ అని ప్రారంభించేరు. భగవన్ శబ్దానికి అనేకమైన అర్థాల్ని విష్ణు పురాణం వివరించింది.

శుద్ధే మహావిభూత్యాఖ్యే పరే బ్రహ్మణి శబ్ద్యతే
మైత్రేయ భగవచ్ఛబ్ద స్సర్వ కారణ కారణే

భగవచ్ఛబ్దం మనం కారణమనుకునే సర్వపదార్థాలకూ కారణమైన వానిని, పరిశుద్ధుని మహావిభూతి అనే పేరు కలవానిని, అంతటా వ్యాపించు యుండు వానిని తెలియజేస్తున్నది.

సంభర్తేతి తథా భర్తా భకారో ర్థ ద్వయాన్వితః ।
నేతా గమయితా స్రష్టా గకారార్థస్తథామునే ॥

భగవన్ శబ్దంలో భకారానికి రెండర్థాలు 1) పోషణము చేసేవాడు 2) ఆధారమైన వాడు అలాగ గ' కరానికి రక్షించేవాడు, లయ కారకుడు, సృష్టించేవాడు అని అర్థాలు. (ఈ శక్తులన్నీ కలవాడు భగవంతుడు) ప్రకృతి పురుష కాలాలను కార్యోత్పత్తికి యోగ్యంగా ఎవడు చేస్తాడో అతడే సంభర్త.

భర్త అంటే స్వామి, నియామకుడు అని అర్థం

ఐశ్వర్యస్య సమగ్రస్య ధర్మస్య యశసశ్రియః ।
జ్ఞాన వైరాగ్యయోశ్చైవ షణ్ణాంభగ ఇతీరణా ॥

సంపూర్ణైశ్వర్యము, ధర్మము, యశస్సు, శ్రీ, జ్ఞానము మరియు వైరాగ్యము అనే ఆరు లక్షణములు కలిగియున్నవాడు భగవంతుడు.





ఉత్పత్తిం ప్రళయంచైవ భూతానామాగతిం గతిం ।

వేత్తి విద్యామవిద్యాం చ సవాచ్యో భగవానితి ॥

సమస్త ప్రాణుల యొక్క ఉత్పత్తి ప్రళయములు, భూతములు యొక్క వచ్చుట, వెళ్ళుట, విద్యను అవిద్యను తెలిసిన వానిని భగవానుడు అని చెప్పుదురు.

జ్ఞానశక్తి బలైశ్వర్య వీర్య తేజాంస్యశేషతః ।

భగవచ్ఛబ్దవాచ్యాని వినా హేయైర్గుణాదిభిః ॥

జ్ఞానము, శక్తి, బలము, ఐశ్వర్యము, వీర్యము, తేజస్సు మొదలగు సద్గుణములు కలవాడు. హేయగుణములు లేనివాడు భగవానుడు అని తెలియజేస్తోంది విష్ణుపురాణం.

ఇట్టి లక్షణ లక్షితుడు భగవంతుడు అని చెప్పి వెంటనే నారాయణ అని చేప్పేరు. భగవాన్ అనగానే ఇన్ని గొప్పదనాలు తెలియడం వల్ల నారాయణుడనే తెలుస్తూనే ఉండగా మళ్ళీ నారాయణ శబ్ద ప్రయోగం ఎందుకు అని సందేహము. దీనికి సమాధానం కూడ విష్ణు పురాణంలోనే కనిపిస్తుంది.

తత్ర పూజ్య పదార్థోక్తి పరిభాషా సమన్వితః ।

శబ్దోఽయం నోపచారేణ త్వన్యత్ర హ్యుపచారతః ॥

పూజ్య పదార్థాలను, గుణాలను, సూచించడానికి లక్షణగా ఈ భగవచ్ఛబ్దం ప్రయోగింపబడుతుంది. ముఖ్యంగా పరమాత్మనే భగవచ్ఛబ్దం భోదిస్తుంది. ఏవో కొన్ని మంచి గుణాలున్న వారిని కూడ గౌణంగా భగవన్ అని సంబోధిస్తారు. అందువల్ల భగవన్ అన్న శబ్దాన్ని మాత్రమే ప్రయోగిస్తే వేరేవరినైనా స్ఫురింపచేస్తుందేమో అని నారాయణ శబ్దాన్ని వాడారు. ఆ నారాయణ శబ్దం వేరెవరిని తెలియచేయక వాసుదేవుని మాత్రమే తెలియచేస్తుంది. మహోపనిషత్తు సృష్టికి పూర్వము నారాయణుడొక్కడే ఉన్నాడంటూ –

**ఏకోహ వై నారాయణ ఆసీత్** అని తెలియజేసింది.

కారణతత్త్వమే భగవానుడు కనుక ఇక్కడ భగవన్ శబ్దం నారాయణునికే చెందుతుంది కనుక భగవచ్ఛబ్దం. తరువాత నారాయణ శబ్ద ప్రయోగం అవసరమే.

ద్వాదశాక్షరి ఓం నమో భగవతే వాసుదేవాయ అనే మంత్రంలో భగవచ్ఛబ్దం అష్టాక్షరీ ఓం నమో నారాయణాయ లో నారాయణ శబ్దం మనకు రెండు విషయాల్ని తెలియజేస్తున్నాయి. భగవానుడు సమస్త కళ్యాణగుణాకరుడు. హేయగుణ ప్రత్యనీకుడు (చెడు గుణములు ఎదిరి)

అనే విషయాన్ని భగవచ్ఛబ్దం చెప్తోంది. ఉభయ విభూతులూ తనివిగా కలవాడు అనే విషయాన్ని నారాయణ శబ్దం చెప్తోంది. పరమపదాన్ని నిత్యవిభూతి అనీ మిగిలిన భాగమంతటినీ కలిపి లీలా విభూతి అని వ్యవహరిస్తారు. ఈ రెండు కూడ భగవంతుని చేత ధరింపబడేవి, నియమింపబడేవి అని నారాయణ శబ్దం చెప్తోంది. ఈ విధంగా భగవన్నారాయణ అనడం వల్ల సమస్త కళ్యాణ గుణ పరిపూర్ణుడు, సమస్తైశ్వర్య సంపన్నుడు అని తెలియజేయబడుతోంది. అటువంటి నారాయణునికి –

**అభిమతానురూపః** ఇష్టమైనవి, తగినవి, లక్ష్మీదేవికి చెందిన కొన్ని లక్షణాలను చెప్తూ అవన్నీ నారాయణునికి ఇష్టమైనవి, తగినవి అని చెప్తున్నారు. లోకంలో మనం స్త్రీ పురుష సంబంధం చూస్తుంటాం. తనకే విధంగానూ సరిపోని స్త్రీపై పురుషునికి ఇష్టం ఏర్పడవచ్చు. తనకు అన్ని విధాలా తగిన యువతిపై అయిష్టత ఉండవచ్చు. అలా కాకుండా ఇక్కడ లక్ష్మీదేవికున్న అన్ని గుణాలు స్వామికీ ఇష్టమైనవి, తగినవి.

ఇక పైన లక్ష్మీదేవితో ఉన్నటువంటి లక్షణాలు ఆ భగవానునికి అభిమతమైనవేవో, అనురూపమైన వేవో తెలియజేస్తున్నారు.

**స్వరూపః** మిగిలిన వారికంటే తమను ప్రత్యేకంగా చూపించే ఒక అసాధారణ ధర్మాన్ని స్వరూపమంటారు. భగవానునకు అభిమతమై ఉండుటే లక్ష్మీదేవి యొక్క స్వరూపం. రామావతార కాలములో జరిగిన సంఘటనలను బట్టి సీతాదేవి స్వరూపము రామచంద్రునకు ధారకమని రామచంద్రుని స్వరూపము సీతాదేవికి ధారకమని తెలుస్తున్నది.

రామరావణ యుద్ధ సమయములో ఇంద్రజిత్తు మాయాసీతను తీసుకొనివచ్చి రాముని ఎదుట వధించాడు. అలాగా మాయారాముని శిరస్సు సీతను చూపబడింది.

ఆ పరిస్థితుల్లో ఇద్దరు చనిపోవలసిందే. కాని వాస్తవంగా వారు బ్రతికే ఉన్నారు కనుకు సీతారాములిరువరూ మరణించలేదు. అంటే వారి ఉనికే వీరి ఉనికికి ఆధారం కాని వారు లేరు అన్న జ్ఞానం కాదని తెలుస్తున్నది.

లక్ష్మీదేవి యొక్క స్వరూపం ఆయనకు ధారకమనడం సమంజసం కాదేమో అనిపిస్తుంది. ఒకరి ఉనికి మీద ఆధారపిన ఉనికికాదు కద భగవానునిది. అతడు స్వతంత్రుడు. కాని వానికి ఇష్టమైన ఆమెపై ఆధారపడి ఉ ండడంలో ఆశ్చర్యం లేదు కదా! ఆమె స్వామికి అభిమత కనుకనే ఆయన స్వరూపము ఆమె ఆధీనమని చెప్పదగి ఉంటుంది. ఆమె స్వరూపము భగవదధీనమై ఉంటుంది. అది ఆమె యొక్క స్వరూపము. ఈ విధంగా ఈ దివ్య దంపతుల స్వరూపము ఒకరిది ఆధారపడి ఉ న్నదని తెలుపుతూ విష్ణుపురాణం

నిత్యై వైషా జగన్మాతా విష్ణోః శ్రీరనపాయినీ
యధా సర్వగతో విష్ణుస్తధైవేయమ్ ద్విజోత్తమ

ఆమె నిత్యానపాయిని. ఎప్పుడూ విడివడి ఉండనిది. విష్ణువు ఎట్లు సర్వ వ్యాపకుడో ఆమె కూడ అట్లే.

స్వవైశ్య రూప్యేణ సదానుభూతయా
వ్యపూర్వవద్విస్మయమాదధానయా
గుణేన రూపేణ విలాస చేష్టితై
స్సదా తవైవోచితయా తవ శ్రియా

నీవు నీ సమస్త రూపములతో సర్వకాలముల యందు అనుభవించినా అపూర్వమైనది. ఆశ్చర్యమును కలుగచేసేది. గుణములు, రూపము, విలాసములు మొదలగు వానిచే నీకే అత్యంతమూ తగియున్న లక్ష్మితో కూడినవాడవై అనునట్లుగా ఆమె యొక్క స్వరూపము ఆయనకు అన్ని విధములా అభిమతమై ఉన్నది.

రూపః

స్వరూపమంటే ఆమెకే చెందిన స్వభావం కదా. స్వరూపం చెప్పిన తరువాత గుణాలు కాక రూప మంటున్నారేమిటి? అంటే స్వరూపానికైనా, స్వరూపాన్నాశ్రయించి ఉన్న గుణాలకైనా రూపమే ప్రకాశకము. కనుక స్వరూపము చెప్పిన వెనుక రూపము చెప్తున్నారు. స్వరూపం అభిమతమైనప్పుడు రూపం అభిమతమని వేరే చెప్పవలసిన అవసరము లేదు.

స్వరూపాన్ని ఆశ్రయించి ఉండి ఇష్టమై ఉంటుంది రూపం. వెనుక చెప్పిన అభిమత, అనురూప అనే విశేషణాలు ఈ రూపానికి కూడ వర్తిస్తాయి. రూపం అభిమతం అంటే ఏమో తెలుసుకుందాం.

లక్ష్మీదేవి స్వామితో కలసి ఉండి కూడ అకల కిల్లే నిరయుం ఒక్క క్షణం కూడ దూరంగా ఉండలేను అని తల్లడపడే అంతటి సుందర విగ్రహమాయన దైతే సర్వేశ్వరుడంతటివాడు కావాలని కోరుకొనే శరీర ఛాయ ఈమెది. రత్నము, కాంచనము మొదలగువి ధరించిన వారికి శోభను పెంపొందించినట్లు ఈ తల్లి చేరిక స్వామికి సౌందర్యాన్ని వృద్ధి చేస్తుంది.

భగవంతునికి అనురూపమెలా అవుతుందో తెలుసుకుందాం – శీలము, వయస్సు, వృత్తము, అభిజనము, లక్షణము ఇరువరిదీ సమానమైతే ఒకరికొకరు అనురూపంగా ఉన్నారన్న మాట. ఈ విషయాన్నే హనుమ–

తుల్య శీల వయో వృత్తాం తుల్యాభిజన లక్షణామ్
రాఘవోర్హతి వైదేహీం తం చేయమసి తేక్షణా

శీలము, వయస్సు, వృత్తము, అభిజనము, లక్షణము, ఈ ఐదు సమానంగా ఉండాలి. శీలమనగా స్వభావము. రెండవది వయస్సు. వృత్తమనగా నడవడి. అభిజనమనగా వంశము. లక్షణమనగా రూపము. రామునకు సీతకు పరస్పరము అన్నింటా సాదృశ్యమున్నది. ఇట్లు వారి దాంపత్యము అన్యోన్యము తగియుండెనని ప్రశంసించెను.

గుణః ఇక్కడ గుణ శబ్దం దేహగుణమైన సౌందర్య లావణ్యాదులను తెలియజేస్తోంది.

గుణాత్ రూపగుణాచ్చాపి ప్రీతి భూయోభ్య వర్తత అని రామాయణంలో చెప్పినట్లుగా అసౌందర్యము ఆయనకు ప్రీతిని అతిశయింప చేయునది. సౌందర్యాదులు రూపమునకు ప్రకాశమును కలిగించి భోగవర్ధనములవుతాయి. కనుక అభిమతమై ఉంటాయి. అందువల్లే అనురూపమని కూడ చెప్పవచ్చు.

విభవః
భోగోపకరణములై, కీర్తింపదగినవైన, వస్తు సమూహమును విభవము అంటారు. ఈ విభవము భగవదధీనము కదా! ఈమెకు విభవము చెప్పుటెట్లు అనే సందేహానికి విష్ణు పురాణం సమాధానము చెప్పింది.

అర్థోవిష్ణురియం వాణీ నీతిరేషా నయో హరిః ।
బోధో విష్ణురియం బుద్ధిర్ధర్మో ఽసౌ సత్క్రియాత్వియమ్ ॥

వాక్కు అమ్మ. దాని అర్థము స్వామి. విష్ణువు న్యాయమైనచో ఆమె నీతి, విష్ణువు తెలియజేయబడెడు వాడు అయిన ఆమె బుద్ధి అని చెప్పినట్లుగా ఆయనకు సంబంధించినవన్నీ ఆమెకు చెందినవే.

పున్నామా భగవాన్ హరిః స్త్రీ నామ్నీ లక్ష్మీః

అని చెప్పినట్లుగా లీలా విభూతి, నిత్య విభూతి కూడ ఆమెకు కలవని చెప్పుకొనవచ్చును.

చతుశ్శ్లోకిలో ఫణిపతిశ్శయ్యాసనం వాహనం వేదాత్మా విహగేశ్వరో యవనికా మాయా జగన్మోహినీ అని చెప్పినట్లుగా శయ్య, ఆసనము, వాహనము మొదలగునవి అన్నీ నారాయణునితో సమానంగా కలిగినది మన తల్లి లక్ష్మీదేవి.

ఐశ్వర్యః
సర్వ పదార్థములనూ నియమించు సామర్థ్యమును ఐశ్వర్యము అంటారు. త్రివిధ చేతనులను ఆమె స్వరూపము చేత నియమించును. ఈశ్వరుని ప్రణయ రసంతో నియమించును. నియమించుట ఎట్లనగా, బద్ధులను కర్మానుగుణంగా నియమించును. నిత్యులను, ముక్తులను స్వరూపానుగుణముగా నియమించును. ఈశ్వరుని రక్షణానుకూలంగా నియమించును.

శీలముః
శీలమంటే మంచి నడవడి. ఇది మనకి సీతాదేవి విషయములో స్పష్టంగా గోచరిస్తుంది. రాక్షస స్త్రీల విషయంలో ఆమె శీలం ప్రసిద్ధం. తక్కువ వారితో వ్యత్యాసం లేక కలిసి మెలసి ఉండుటను శీలము అంటారు. సర్వేశ్వరుని శీలము గుహుడు మొదలగు వారి విషయమున గోచరించినట్లు తల్లి యొక్క శీలము త్రిజట మొదలగు రాక్షస స్త్రీల విషయమున గోచరించును.

రాజసంశ్రయ వశ్యానాం కుర్వంతీనాం పరాజ్ఞయా
విధేయానాం చ దాసీనాం కః కుప్యేద్వానరోత్తమ

ఈ రాక్షస స్త్రీలు రాజసేవా పరాయణులు. రాజాజ్ఞను అనుసరించి తమ ప్రభువు చేయమనిన పనిని చేయువారలు. రాజునకు పరతంత్రులు. అతడు ఆజ్ఞాపించిన పనిని చేయనిచో వారు దండింపబడుదురు. వారు రావణుని దాసీలు. దాసీలపై కోపము తెచ్చుకొనే వాడు ఎవడైన ఉ ండునా? శాసించిన ప్రభువుపై కోపించవలెను కాని దాసీలపై కోపించుట తగదు.

పాపానాం వా శుభానాం వా వధార్హానాం ప్లవంగమ ।
కార్యం కరుణమార్యేణ నకశ్చిన్నాపరాధ్యతి ॥

రాక్షస స్త్రీలు పాపాత్ములని నీ అభిప్రాయము. నా అభిప్రాయములో వారు మంచివారే. మంచివారైనా, చెడ్డవారైనా పాపపు పనిచేసినారని దండించరాదు. వారిపై కరుణ చూపుట ఆర్యుల కర్తవ్యము. తప్పుచేసిన వారిని చూచి వెంటనే కోపము తెచ్చుకొనకుండా ఆ తప్పునకు కారణము ఆలోచించి వారిని శిక్షించవలెను కాని వెంటనే శిక్షించరాదు. అట్లు శిక్షించుటకే ఉపక్రమించినచో లోకములో తప్పుచేయని వారు ఎవరుందురు? అని ఉపదేశించి హనుమంతుని నుండి రాక్షస స్త్రీలని రక్షించినది.

రావణునికి మిత్రమౌపయికం కర్తుం అని ఉపదేశాన్ని చేసిన తల్లి. రాముని గురించి విదితస్స హి ధర్మజ్ఞః శరణాగత వత్సలః అని చెప్పింది.

ఆదిః — ఈ పదం చేత పరత్వమునకు, సౌలభ్యమునకు కావలసిన గుణములన్నీ తెలియజేయ బడినాయి. వాత్సల్య సౌశీల్యాదులు దీని చేత తెలియజేయబడతాయి.

అనవధికాతిశయః — వెనుక చెప్పిన స్వరూప రూప మొదలగు గుణములన్నీ ఒక్కొక్కగటే అనవధికము. అతిశయము అంటే హద్దులేనివి. అంతకన్న ఉత్కృష్టమైనది వేరొకటి లేనిది. లోకంలో కొందరిలో ఆ గుణాలు కొంచెము కనిపించినా ఆ గుణములలో పూర్ణత్వము కనిపించదు. ఆమె విషయములో ఆ గుణాలకు అవధి లేదు. ఈశ్వరీం సర్వభూతానాం

అసంఖ్యేయః గుణములు వేరు వేరుగా లెక్కించుటకు అలవి కాదు. సమూహముగా లెక్కించుటకు కూడ అలవికానన్ని అని తెలియజేయుటకు ఈ పదం వాడబడింది. దేవి త్వన్మహిమావధిర్న హరిణాపి త్వయాజ్ఞాయతే నీ మహిమ యొక్క ఆవలి హద్దు నీ భర్తయైన భగవంతునికీ, నీకూ కూడ తెలియదు అని శ్రీస్తవంలో చెప్పినట్లుగా ఆవలి హద్దులేని, లెక్కించుటకు వీలు లేని కళ్యాణ ప్రదమైన గుణ సమూహము కలది అని కళ్యాణగుణ గణాం అని వాడేరు.

కల్యాణః కల్యాణ అంటే మోక్ష పర్యవసాయి తత్త్వజ్ఞానాది మంగళావహత్వం స్వయం నిత్యాను కూలత్వం చ మోక్షాన్ని పొందించే తత్వ జ్ఞానాదులైన మంగళాలను కలిగించేది లేక స్వతస్సిద్ధంగా ఎప్పుడూ అనుకూలమే అయి ఉండేది కల్యాణము. భగవానుని గుణములకు అప్పుడప్పుడు దోషమాపాదించుటకు అవకాశమున్నది. ఆయన తన స్వరూపానికి తగినటువంటి నిరంకుశ స్వాతంత్ర్యము కలవాడు. క్రోధ మాహారయత్తీవ్రం అని చెప్పినట్లుగా కోపము తెచ్చుకొనుట మొదలగునవి దోషములుగా భావించినా ఈమెకు అటువంటి దోషములు కూడ లేకపోవటం చేత కల్యాణ అనే పదం వాడేరు.

గుణగణాంః గుణ సమూహము, ఇక్కడ గుణ శబ్దం చేత వాత్సల్య సౌశీల్య సౌలభ్యాదులైన ఆత్మ గుణాలను చెప్పవచ్చు. నతే వర్ణయితుం శక్తా గుణాన్ జిహ్వాపి వేధసః బ్రహ్మ జిహ్వకు కూడ అందనివి నీ గుణములు అని గుణముల యొక్క అతిశయము తెలియజేయబడింది.

పద్మవనాలయాంః పద్మవనమే నివాసంగా కలది. స్వామిని కూడ పరిమళింపచేయునది తల్లి. పరిమళమే ఆమే శరీరమునకు ఉపాదానము. ఆమె శరీర నిర్మాణమునకు మూలపదార్థము పరిమళమే. అందువలన సర్వగంధః సర్వరసః అనే రెండు లక్షణాలు ఈమె వల్లనే ఆయనకు లభించాయి. ఇచ్చట పద్మ శబ్దము మంగళమునకు ఉపలక్షణంగా వాడబడింది. సర్వమంగళ నివాసిని అని చెప్పవచ్చు. శ్రీస్తవంలో కూరత్తాళ్వాన్





ఐశ్వర్యం యదశేష పుంసి విదితం సౌందర్య లావణ్య
రూపం యచ్చ హి మంగళం కిమపి యల్లోకే సదిత్యుచ్యతే
తత్సర్వం త్వదధీనమేవ యదత(శ్శ్రీరిత్యభేదేన వా
యద్వా శ్రీమదితీదృశేన వచసాదేవి! ప్రథామశ్నుతే

ఈ లోకంలో ఉన్నవారియందు కనిపించే ఐశ్వర్యం. సౌందర్యం కాంతి ఏదైనా మంచిది లేక మంగళమైనదని చెప్పబడినదంతా ఆమె ఆధీనమే. అందుచే శ్రీ అనికాని శ్రీమత్ అని కాని చెప్పబడుచున్నవి. ఈ లోకములో ఏ విధమైన ఉత్కర్ష అయినా లక్ష్మి వల్లనే కలుగుచున్నది.

భగవతీం: ఇది పూజ్య వాచకము. తత్ర పూజ్య పదార్థోక్తిః పరిభాషా సమన్వితః శబ్దోయం నోపచారేణ అని భగవచ్ఛబ్ద విషయంలో చెప్పినట్లుగానే ఇది పూజ్య వాచకము.

శ్రియం: సర్వ సమాశ్రయణీయత్వ లక్షణము ఈ శ్రీ శబ్దము చేత చెప్పబడుతున్నది. భగవన్నారాయణ పదమునకు అనురూపంగా ఉండే లక్షణాలను చూపిస్తూ ఇక్కడ భగవతీం శ్రియం అనే పదాలు వాడేరు. ఈమె గొప్పదనం తెలియజేయుట సాధ్యం కాదని శ్రీరిత్యేవచ నామతే భగవతీ బ్రూమః కథం త్వాం వయం అని చెప్పేరు.

శ్రీ శబ్దం చేత ఆరు అర్థాలు తెలియజేయబడుతున్నాయి.

1) సర్వచేతనుల చేత పురషకారముగా ఆశ్రయింపబడునది.
2) ఆశ్రితుల కార్యములు నెరవేర్చుటకు భగవంతుని ఆశ్రయించి ఉండునది
3) ఆశ్రితుల మొరలను వినునది
4) వాటిని భగవంతునికి వినిపించునది.
5) జీవుల దోషములను లేనివిగా చేయునది.
6) గుణములను పెంపొందింపచేయునది.

దేవీం: దివ్ క్రీడా విజిగీషా వ్యవహార ద్యుతిస్తుతి మోద మద స్వప్న కాంతి గతి అని పది అర్థముల కల దివ్ దాతువు నందు దీవ్యతీతి దేవీ అను అర్థమును గ్రహించినప్పుడు ప్రకాశించునది అని అర్థము లేక దివ్ క్రీడాయాం అను ధాతువు వలన దేవి అనగా క్రీడించునది అని అర్థము. అంటే తన భర్త యొక్క లీలలకనుగుణమైన వ్యాపారములను నిర్వహించునదని అర్థము.

ద్వాదశాక్షరిలోన్ భగవత్, వాసుదేవ అను పదములకు అనురూప్యము భగవతీం, శ్రియం, దేవీం అనే పదాలలో చూపబడుతోంది.

నిత్యానపాయినం: నిత్య సంశ్లేషము చేత స్వామితో విశ్లేషము లేనిది. అనగా ఎప్పుడూ కలసియే ఉండునది. సూర్యుని కాంతియు, పుష్పమును సువాసనయు ఎట్లు వీడక ఉండునో అట్లే తల్లి భగవంతుని వీడక ఉండునది.

తమసః పరమోధాతా శంఖ చక్ర గదాధరః

శ్రీవత్సవక్షా నిత్యశ్రీ రజయ్య శ్శాశ్వతో ధ్రువః

ఈ శ్లోకమున మండోదరి రాముడే జగత్కారణమగు బ్రహ్మము అని చెప్పుచున్నది. ఇందు శంఖ చక్ర గదాధర అనుటచే రూపము కలవాడని తెలియుచున్నది. శరణాగతి చేసిన వారి విరోధులను తొలగించుటకు తగిన గుణాలు, ఆయుధాలు ధరించి రక్షణమున నిత్య జాగరూకుడై ఉండును. ఇతని రూపమున శ్రీవత్సము కౌస్తుభము ఎల్లప్పుడు ఉ ండును. నిత్యశ్రీః ఎన్నడునూ తనకు దూరముగా ఉండని లక్ష్మీదేవి కలవాడితడు. శ్రీతో కూడియుండుటచే ఎవ్వరిచేతను జయింపశక్యము కానివాడు అజయ్యుడు అని చెప్పినట్లుగా లక్ష్మీదేవి నిత్యము అనపాయినివై ఆయనతో కూడియుండును.

నిరవద్యాం: ఇంతకు ముందు చెప్పిన గొప్పదనమంతా తన అతిశయమునకు అతి తలంచుట అవద్యము. ఇతరుల అతిశయమునకు అనుకొనుట నిరవద్యము. తన గుణములు సర్వేశ్వరుని అతిశయమునకే అని తలంచి యుండునది. సహజంగా స్త్రీకి లొంగి ఉండాలంటే విముఖత, పతి అభిప్రాయానికి ఎదురుగా తన అభిప్రాయాలుండటం, తనను తాను విమర్శించుకోలేక పోవడం, దయలేక పోవడం, కోపముండడం అనేవి ఉంటాయని లోకములో వాడుక. కాని ఇవేవిలేని స్వభావము అమ్మది కనుక నిరవద్యాం అన్నారు.

భగవానుడు కూడ తన సొత్తంతా భక్తానాం అని భక్తులచే చెందినదని భావిస్తాడు కాని అనృశంస్యం పరో ధర్మస్త్వత్త ఏవ మయా శ్రుతః దయ కలిగి ఉండడమే ముఖ్య ధర్మమని రాముడు తనతో చెప్పేడని సీత హనుమతో చెప్తుంది. ఈ విధంగా చెప్పి గుర్తు చేసుకొని దయ కలిగి ఉండవలసిన అవసరం అమ్మకు లేదు. నిగ్రహమే ఎరుగనిది తల్లి. భస్మము చేయుటకు యోగ్యమైన రావణుని కూడ నత్వాంకుర్మి దశగ్రీవ భస్మభస్మార్హ తేజసా అని వదలివేసిన మృదు హృదయ అమ్మ. అందుకే నిరవద్యాం అని కీర్తిస్తున్నారు. అవద్యముండి తొలగించుకోవడం కాక దోషమే లేకపోవడం తల్లి గొప్పదనం.

దేవదేవ దివ్య మహిషీం: మహిషి అనగా కృతాభిషేక సర్వేశ్వర సామ్రాజ్యమునకు అభిషిక్త అయిన ఆమె తాను ఏది చేయతలపెట్టినను అడ్డు లేకుండ చేసి ముగించగలగిన శక్తి కలది. మనుష్యుల కన్న బ్రహ్మాది దేవతలు ఎలా అధికులో ఆ దేవతలకు కూడ అధికుడైన వాడు భగవానుడు. ఆవిధంగానే ఆ దేవ పత్నులకు కూడ అధికమైనది ఆమె అని తెలియబడుచున్నది ఈ పదము వలన. దివ్య పద ప్రయోగము చేత శ్రీదేవి యొక్క దివ్య మంగళ విగ్రహము (శరీరము) కూడ భగవద్విగ్రహము వలెనే ఆ ప్రాకృత తత్వాది లక్షణములు కలిగి ఉంటుందని తెలుస్తున్నది. దివ్ అనగా ప్రకాశము కనుక సహజంగా ప్రకాశించని మన శరీరముల వంటి శరీరము కాదు ఆమెది అని తెలుస్తున్నది.

అఖిల జగన్మాతరం: ఇంతవరకూ చెప్పిన లక్ష్మీదేవి యొక్క పరత్వము తెలిసినప్పుడు మనకు మన యొక్క అపరాధములను చూచి క్షమించదేమో అను భయము కలుగుట కవకాశమున్నది. ఆ భయమును పోగొట్టుటకా అన్నట్లు అఖిల జగన్మాతరం అను పదమును ప్రయోగించిరి. ఆమెకు మనతో తల్లీ బిడ్డల అనుబంధమున్నదనీ భయపడవలసిన అవసరములేదని తెలియజేస్తున్నారు. ఇక్కడ జగచ్ఛబ్దము చేతనులను తెలియజేయుపదము. నమామి సర్వలోకానాం జననీ మబ్ధి సంభవామ్ త్వం మాతా సర్వలోకానామ్ అని చెప్పినట్లుగా ఈమె తల్లి పిల్లల విషయములో వలె సర్వ ప్రాణుల విషయమున వాత్సల్యము కలది. ఈ విశ్వ మాతృత్వమను లక్షణము చేత ఆమె యొక్క వాత్సల్యము భర్తయైన భగవంతునకు అనురూపముగా ఉన్నది. ఆయన రిపూణామపి వత్సలః శత్రువుల విషయములో కూడ కారుణ్యము కలిగినవాడు. ఈమె ఓర్చుటకు వీలులేని నిరంతర అపరాధముల చేయుటలో నిధి వంటి వాడైన రావణునికి ఆ రాముని విషయములో తేన మైత్రీభవతు తే యది జీవితు మిచ్ఛసి అని రామునితో స్నేహము చేసుకొని ఈ జీవితములో సుఖపడమని అన్నిటికన్న అధికమైన రహస్యమైన ఉపదేశాన్ని అందించిన తల్లి. రాజపత్ని తన బిడ్డ మట్టి పూసుకొని ఆడుకుంటూ ఉంటే ఆ మట్టితోనే ఒడిలో కూర్చుండ బెట్టుకుని దగ్గర తీసుకొని శిరసు మూర్కొన్నట్లే మన దోషాలతోటే మనను అమ్మ స్వీకరిస్తుందని ధైర్యం కలగడానికి అఖిల జగన్మాతరం అని ప్రయోగించారు.

అస్మన్మాతరం: అఖిల శబ్దమున తాము కూడ చేరిననూ అస్మన్మాతరం అని మొత్తము జగత్తునంతటినీ ఒక వైపున, తమను ఒక వైపున నిలుపుకొని తమపై ఉన్న వాత్సల్యాతిశయమును తెలియచేసినారని పెద్దలనుగ్రహించినారు.

అశరణ్య శరణ్యాం: ఆ భగవంతుడే సర్వలోక శరణ్యుడైనను మాటను బట్టి మాత్రమే అనగా నీకు నేను శరణాగతుడను అను మాటను బట్టే రక్షించువాడాయన.

సంబంధమే హేతువుగా తీసుకొని రక్షించునామె మన తల్లి. ఇది మనకు కాకాసుర వృత్తాంతమున స్పష్టమగును. సపిత్రా చ పరిత్యక్తః భగవానుని కోపాగ్నికి గురియైన సమయమున ఈ దేహమునకు కారణమైన తండ్రి చేత కూడ విడువబడినాడు కాకాసురుడు. అభయం సర్వభూతేభ్య దదామి, మాశుచ అని నేను రక్షిస్తాను, రక్షిస్తాను అని చాటి చెప్పుకొనే సర్వేశ్వరుడే కోపించి శిక్షించినాడు. ఇతరులే కాక భగవంతుడు కూడ రక్షకుడు కానట్టి సమయమున కూడ అనుగ్రహించి నట్టి తల్లి మన లక్ష్మీ దేవి, ఆ విధంగానే రాజసంశ్రయవశ్యానాం పాపానాం వా శుభానాం వా అని రామాయణములోని రాక్షస స్త్రీలను కాపాడుటలోనూ ఇది స్పష్టమగుచున్నది. పై రెండింటా వారి మాటలను బట్టి కాక వారికి రక్షణ కల్పించుటయే తన స్వభావముగా కలదియై వారికి శరణు అయిన తల్లి మన సీతమ్మ.

అనన్య శరణః శరణ మహం ప్రపద్యేః వేరొక దిక్కులేని నేను లక్ష్మీదేవిని రక్షకురాలిగా ఆశ్రయించుచున్నాను.

అనాలోచిత విశేషాశేషలోక శరణ్యుడు భగవానుడు. సర్వులకూ శరణ్యుడయ్యే ఆ పరాత్పరుని అనుగ్రహానికి కూడ అందనంత పాపాత్ముడను నేను. అందువలన నాకు ఏ దిక్కూ లేదు తల్లీ! దిక్కులేని వారికి దిక్కయే తల్లివి నీవు. అందువలన శరణముగా నిన్నే నేను స్వీకరిస్తున్నాను అంటున్నారు.

భగవద్రామానుజులు ప్రపద్యే ఆశ్రయిస్తున్నాను అనే ఉత్తమ పురష క్రియ వాడినపుడు నేను ఆశ్రయిస్తున్నాను. అనే అర్థం దానంతట అదే సిద్ధిస్తున్నది. అయినా అహం నేను అని తమను ప్రత్యేకించి చూపించుకుంటున్నారు భాష్యకారులు. తాము ఎంత అశక్తులో, దుష్కరమైన కర్మజ్ఞానాది మార్గములు ఆచరించడం తమకెంత దుష్కరమో చెప్పడానికి తమని తాము చూపించుకుంటూ అహమ్ అంటున్నారు. శరణమ్ అంటే నిఘంటువు ఎన్నో అర్థాలు చెప్పినా, మనం ఇక్కడ మాత్రం ఉపాయము అనే అర్థాన్నే స్వీకరించాలి అని పెద్దల నిర్ణయము.




భగవంతుని పొందించడానికి ఉపాయముగా అమ్మను ఆశ్రయిస్తున్నారు. శ్రీసూక్తం కూడా తాం పద్మినీం శరణమహం ప్రపద్యే అని శ్రీదేవిని ఆశ్రయించడమనే విషయమే చెప్పింది. ప్రపద్యే పొందుచున్నాను అన్నారు కదా! సంస్కృత భాషలో ఈ విధమైన గత్యర్థమును చెప్పే ధాతువులన్నీ అంటే వెళ్లుట, పొందుట, మొదలైన అర్థాలను చెప్పే ధాతువులన్నీ బుద్ధ్యర్థాన్నీ బోధిస్తాయి. అంటే బుద్ధిలో ఆశ్రయించడం, అధ్యవసాయం కలిగి ఉండడం ఈ ప్రపద్యేకి అర్థం. ఇక్కడ భగవద్రామానుజులు ప్రార్థనా పూర్వకంగా తమ భారము అమ్మపై ఉంచుతున్నారు.

ఉపనిషత్ సిద్ధాంతము ప్రకారముగా ప్రపత్తి చేసే పెద్దలు భగవానుడు తప్ప ఇతరమైనవేవీ ఉపాయములు కావు అని నమ్మి ఉంటారు కదా! మరి లక్ష్మీదేవే ఉపాయమనడం సమంజసమేనా అని సందేహము కలుగుతుంది. లక్ష్మీదేవిని పురుషకారముగా ఆశ్రయిస్తున్నాము కనుక ఇందులో విప్రతిపత్తి లేదు. ఆచార్యుని, లక్ష్మిని పురుషకారముగా స్వీకరించాలనేదే శాస్త్రీయమైన సిద్ధాంతము ఆచార్యముపాసీత అని తాం పద్మనేమీం శరణమహం ప్రపద్యే అని చెప్పబడింది.

సా హి శ్రీరమృతాసతామ్ ముముక్షువులకు మోక్షహేతువైన లక్ష్మియే అలక్ష్మీ నిస్తరణము కూడ చేస్తుందని చన్ద్రాం ప్రభాసామ్ అనే మంత్రములో తెలియజేసేరు.

పరాశర భట్టరు వారు ఐశ్వర్య మక్షరగతిం పరమంపదంవా అని దేనినైనా ఈయగలిగినది అమ్మ అని వివరించారు.

కాంతా చతుశ్లోకిలో

శ్రేయోనహ్యరవిందలోచనమనఃకాంతా ప్రసాదాదృతే ।
సంసృత్యక్షర వైష్ణవా ఉ ధ్వసు నృణాం సంభావ్యతే కర్హి చిత్ ॥

ఆ పంకజాక్షుని ప్రియురాలి అనుగ్రహం లేకపోతే సంసారములోనైనా ఆత్మానుభవంలో నైనా, పరమాత్మ పద సేవనములోనైనా మానవులు శ్రేయస్సును పొందలేరని నిశ్చయంగా చెప్పేరు. అందువలన భగవద్రామానుజులు ముందుగా అమ్మను ప్రార్థించేరు.





ఇంతవరకు లక్ష్మీదేవి యొక్క శరణ్యత్వాన్ని (ఆశ్రితులకు దిక్కు అయ్యే లక్షణాలనన్నీ) చెప్పి, ఆ లక్షణాల్ని తెలియచేసే స్వరూప రూప గుణాలన్నింటినీ కీర్తించారు. తమ యొక్క అనన్య గతిత్వాన్ని చెప్పి ఆమె శ్రీపాదాల చెంత శరణాగతి చేసారు. అప్పుడు అమ్మ ముఖంలో ఒక కదలిక కనిపించింది. ఇంతకూ నీకు కావలసినదేమిటి ? అని ప్రశ్నిస్తున్నట్లుగా తోచింది.

భగవద్రామానుజులు తమకు కావలసిన దేమిటో వివరిస్తున్నారు. తనకు కావలసినది కైంకర్య రుచి, ప్రపత్తి నిష్ఠ, ఇవి కావాలని ఇక్కడ కోరుతున్నారు. సర్వేశ్వరుని పాదపద్మాల సన్నిధిని కైంకర్యం చెయ్యడానికి కావలసిన రుచి, విశ్వాసం మొదలైన లక్షణాలు అమ్మ అనుగ్రహంతో పొందాలని వీరి ప్రయత్నం. ఐతే వీరికి ఇంతవరకు రుచి విశ్వాసాలు లేవా? అని ప్రశ్న, ఉన్నాయి కాని తాము పొందబోయే భగవద్విషయాన్ని భావించినప్పుడు తమకున్నవేవీ సరిపోవనీ, ఏ అర్హతా లేదని శరణాగతి పరిపూర్ణమవడానికి తగిన లక్షణాలను ప్రసాదించమని శ్రీదేవి చరణ సన్నిధిలో విన్నవిస్తున్నారు.

పారమార్థిక భగవచ్చరణారవిన్ద యుగళైకాన్తి కాత్యన్తిక పరభక్తి పరజ్ఞాన పరమభక్తికృత పరిపూర్ణానవరత నిత్యవిశదతమానన్య ప్రయోజనా నవధికాతిశయ ప్రియ భగవదనుభవ జనిత అనవధికాతిశయ ప్రీతికారిత అశేషావస్థోచిత అశేష శేషతైక రతిరూప నిత్య కైఙ్కర్య ప్రాప్త్యపేక్షయా పారమార్థికీ భగవచ్చరణారవిన్ద శరణాగతిః యథావస్థితాஉ అవిరతాస్తు మే.

పారమార్థికః పారమార్థికము అంటే ప్రయోజనమని, వాస్తవమని రెండర్థాలు, పారమార్థికమ్ అనేది భగవచ్చరణారవిందములకు, పరభక్తికీ కూడ విశేషణము కావచ్చును. ఇది పరభక్తికి విశేషణ మైనప్పుడు అకృత్రిమమైన పరభక్తి అని చెప్పుకోవాలి. పాదారవిందాలకు విశేషణమైనపుడు అవి పరమ ప్రయోజనము, పరమభోగ్యము అని తెలుస్తుంది. దీని వలన భక్తి కలిగిన వానికి పరమ ప్రయోజనము భగవత్పాదారవిందాలే అవుతాయి. భగవత్పాదారవిందాలు అనుభవించాలని కలిగిన భక్తి అకృత్రిమమయే ఉంటుంది.

భగవచ్చరణారవిందయుగళః భగవంతుని పాదపద్మములయందు ఇంతకు ముందు వాడబడిన భగవచ్ఛబ్ధం సర్వేశ్వరుడు సర్వోత్కృష్టుడు అని తెలుపుతుంది. ఇక్కడ మళ్లీ భగవచ్ఛబద్ధం ప్రయోగించారు. ఇక్కడ గుణాలతో కూడి ఉ ఒడడం వలన ఆ స్వామి ఎంతో భోగ్యభూతుడై ఉంటాడు అనేది తెలుపుతున్నది. గుణములు భోగ్యభూతములు కనుక పరభక్తిని కలిగిస్తాయి. భగవచ్చరణారవింద అని చరణములను అరవిందములతో పోల్చారు. ఈ పోలిక వలన చరణాలు భోగ్యమవడమే కాదు ఉపాయదశలో కూడ ఆహ్లాదాన్ని కలిగిస్తాయి. ఆనందాన్నిస్తాయి. ఆశ్రయించవలసినది ఈ పాదయుగళినే అని లక్ష్మణస్వామి మనకు తెలియజేసాడు.

సభ్రాతుశ్చరణౌ గాఢం నిపీడ్య రఘునందనః ।
సీతాముజాచా తియశాః రాఘవంచ మహావ్రతమ్ ॥

లక్ష్మణుడు తనను కూడ రామునితో పాటు అరణ్యానికి తీసుకొనిపోవుటకు అంగీకరించమని సోదరుడగు రాముని రెండు పాదములను మనసారా పట్టుకొని మహావిశ్వాసంతో సీతమ్మతో ముందుగా చెపుతూ మహావ్రతుడగు రామునితో కూడ తన కోరికను నివేదించాడు. భరతుడు శత్రుఘ్నునితో ఈ విధంగా అంటాడు

యావన్న చరణౌ భ్రాతుః పార్థివవ్యంజనాన్వితౌ ।
శిరసాధారయిష్యామి న మే శాంతిర్భవిష్యతి ॥

రాజచిహ్నములతో, ధ్వజము, అరవిందము, వజ్రము, చక్రము మొదలగు చిహ్నములతో గుర్తింపబడిన మా రామచంద్రుని పాదములను నేను శిరసుపై ఏనాడు ధరింతునో ఆనాడు కాని నాకు శాంతిలేదు అనినాడు. పసివానికి తల్లి స్తన్యం ఎంత ప్రీతిపాత్రమైనదో, వాని ఉనికిని కాపాడేది అవుతుందో ఆవిధంగానే స్వామి చరణములు శేషభూతులకు ప్రాప్యము అని తెలియచేస్తుంది ఈ అరవింద శబ్దం. యుగళ శబ్దం ఆ స్వామి పాదాలు ఒకదానికి ఒకటి సరిజోడై ఆ



చేరికలో ఒక ప్రత్యేక సౌందర్యము వెల్లివిరియచేస్తూ ఉంటాయి అని తెలియచేస్తుంది.

ఐకాంతికః ఒక్కటే అంతముగా కలది. అనగా అదే పరమప్రయోజనమైనప్పుడు వేరే ప్రయోజనము వైపు మనసు మళ్లదు కదా! (వేరొక విషయానికి తావుండదు).

అత్యంతికః అదే సదా అనువృత్తి అవడాన్ని ఆత్యంతికం అంటారు, అంటే నిత్యమైనది. పరభక్తి, పరజ్ఞాన, పరమభక్తులకు వేరు వేరుగా నిర్వచనాలు చేప్పేరు మన పూర్వాచార్యులు.

పరభక్తిః భగవంతుని కలయికలోనే సుఖం, ఎడబాటులో దుఃఖం అయి ఉండే స్థితిని కలిగించే ప్రేమ

పరజ్ఞానంః ఆ భక్తి సాక్షాత్కారంగా మారడం

పరమభక్తిః క్షణకాలం కూడ ఎడబాటును భరించలేని దశ. వేరొక విధంగా కూడ దీనికి అర్థం చెప్పుకోవచ్చు.

పరభక్తిః యాప్రీతిరవివేకానాం విషయేష్వనపాయినీ ।
త్వామనుస్మరతః సా మే హృదయాన్మాపర్పతు ॥
అని ప్రహ్లాదుడు చెప్పినట్లుగా అవివేకులైన వారికి లౌకిక విషయముల మీద ఎంత ఇష్టముంటుందో భగవద్దర్శనం మీద అంత ప్రీతి ఉండడం పరభక్తి అంటారు.

పరజ్ఞానః మానస సాక్షాత్కారమైన తరువాత ఆ అనుభవం మీద నిరంతరం సాగే ఔత్సుక్యం

పరమభక్తిః సాక్షాత్కారం ఎప్పుడు తమకు అనుకూలంగానే భాసించడం
పరమపదంలో నిత్యులకు,ముక్తులకు ఇటువంటి అనుభవాలు కలుగుతూ ఉంటాయి పూర్వక్షణంలో ఉన్న అనుభవం మారిపోయి ఉత్తరక్షణంలో కొత్త అనుభవం కలుగుతూ ఉంటుంది.

ముందుగా విధివిహిత కర్మాచరణ చెయ్యాలి. దాని వలన యదార్థ జ్ఞానము కలుగుతుంది. దీనివలన అంతఃకరణం సంస్కరింపబడిన తరువాత భక్తి కలుగుతుంది. దాని యొక్క చివరి స్థితి పరమభక్తి అవుతుంది.

ఇది భగవదుపాసన చేసిన వారికి కలిగే పద్ధతి. కాని ఇక్కడ భగవద్రామానుజులకు ఆ జ్ఞానభక్తులకు బదులు భగవదనుగ్రహమే ఉండగా ముందుకు వెళ్ళడానికి ఉద్యుక్తులవుతున్నారు.

**కృతః** చేయబడిన

ఈ శరణాగతి అవిలంబ్య ఫలప్రదము. అంటే చేసిన వెంటనే ఫలం లభింపచేసేది.

ఈ విధమైన ప్రపత్తిని అవలంభిస్తే కైంకర్య ప్రాప్తియందు కోరిక స్థిరంగా కలుగుతుంది అనే నమ్మికతో కృత అని చెబుతున్నారు.

**పరిపూర్ణః** పూర్తిగా

భగవానుని, పర, వ్యూహ, విభవ, అంతర్యామి, అర్చామూర్తులుగా ఉన్న అన్ని అవస్థలలోనూ అనుభవించాలి.

ఇంక స్వరూప, రూప, గుణ, విభూతులన్నింటినీ ఒకే కాలములో అనుభవించాలి.

**అనవరతః** అవిచ్ఛిన్నముగా

ఆ అనుభవము ఎప్పుడో ఒకప్పుడు కాక విచ్ఛేదం లేకుండా సాగుతూ ఉండాలి.

**నిత్యః** శాశ్వతంగా

ఆత్మ ఉన్నంత వరకు ఉండాలి. నిత్య అనే పదము వల్ల ఎల్లకాలము చెయ్యాలి అనే అర్థం వచ్చినా ఒకే సమయంలో చేస్తే చాలు అని అర్థం స్ఫురిస్తుంది. నిత్యాగ్ని హోత్రి అంటే నిత్యము అగ్ని కార్యము చేసేవాడు అని అర్థం కాని రోజంతా చేసేవాడు అని అర్థం కాదు. అలాకాక ఏ క్షణము కూడ మానకుండా చేసేది అని తెలియచెయ్యడానికి నిత్య అనే పదానికి ముందుగా అనవరత అని ప్రయోగించారు.

**విశదతమః** స్పష్టంగా ఉండునది.

కలిగిన అనుభవం పరోక్షం కాక ప్రత్యక్షానుభవం కావాలి. పరభక్తి, పరజ్ఞాన, పరమభక్తులు కలిగిన దశలలోని అనుభవం కనుక విశదతమంగా ఉంటుంది.

| | |
|---|---|
| అనన్య ప్రయోజనః | వేరొక ప్రయోజనము లేనిది. భగవదనుభవం, ఆ అనుభవం వల్ల కలిగే ప్రీతి, ఆ ప్రీతి వల్ల చేసే కైంకర్యము కాదు కావలసినది, ఈ అనుభవమే చాలు అనిపించే స్థితి. ఇంత ప్రేమ కలగడానికి కారణమేమిటి? అంటే అనవధికాతిశయ ప్రియ, హద్దులేని శ్రేష్ఠమైన ప్రీతి ఇతర ప్రయోజనం లేకపోయినా అవధి కలిగి ఉండే ప్రీతి కాకూడదు అని అనవధిక అన్నారు. |
| భగవదనుభవః | భగవంతుని అనుభవము వలన చరమ శరీర అవసానమైన తరువాత అర్చిరాది మార్గము గుండా ప్రయాణించి పరమపదమును చేరి అనుభవించు అనుభవము భగవదనుభవము అన్నందువల్ల ముక్తి అనగా పాషాణ కల్పముగా అగుట కాని ఆత్మానుభవమని కాని, నిర్గుణమే పరతత్వం అనే వాదన కాని కాదు అని తెలియజేస్తున్నారు. |
| జనితః | పుట్టించబడిన |
| అనవధికాతిశయ ః | హద్దులేని |
| ప్రీతికారితః | ప్రీతిచే చేయదగిన ఇంత చక్కటి అనుభవాన్ని పొందేనే అని తలంచుకొని, తలంచుకొని దాని వలన కలిగిన ప్రీతి వరుసగా సాగుతూండడం వలన చేసే కైంకర్యం. ప్రీతిచే అనడం వల్ల ఆ కైంకర్యం తాము చేసినది కాదు ఆ ప్రేమే చేయించింది. అనుభవజనిత ప్రీతి అనగా నిరతిశయమై, అనుకూలమైన విషయము నాచే అనుభవింపబడినది అను కృతార్థతా బుద్ధి. |
| అశేషావస్థోచితః | ఏ స్థితిలో ఉన్నప్పుడైనా అనుకూలమై ఉండేది. ఆ స్థానంలో ఉన్నా, అంతఃపురంలో ఉన్నా సేవ చెయ్యాలి అనేది వీరి కోరిక. ఛత్ర చామరాది సేవలన్నీ అనంతుడు, గరుడుడు మొదలగు వారు చేస్తారు. కాని వారి కైంకర్యము నిర్ణీతమై ఉంటుంది. ఆ విధంగా కాకుండా అన్ని అవస్థలలోనూ కైంకర్యము చెయ్యాలి అని కోరుకుంటున్నారు. |

అశేషశేషతైక రతిరూపః సర్వ విధ కైంకర్యము నందు అనురాగము స్వరూపముగా గల

అశేష శేషతః సర్వ విధములుగానూ శేషవృత్తి

అనంతుడు, గరుడుడు మొదలగు వారు వారి యొక్క కైంకర్యములో స్వేచ్ఛలేని వారు. ఏకధా భవతి త్రిధా భవతి అని ఛాందోగ్యములో చెప్పినట్లు తామే అభిమత రూపమును స్వీకరించి సర్వ విధములైన కైంకర్యములు చేయు ముక్తులను చూచి ఆనందించుచూ తమ స్వప్రయోజనమునకు ప్రాధాన్యమీయరు అని తెలియజేయుటకు ఏక అనుపదము వాడబడెను.

కైంకర్య నిత్యనిరతైర్భవదేక భోగై
ర్నిత్యైరనుక్షణ నవీన రసార్ద్ర భావైః
నిత్యాభివాఞ్ఛిత పరస్పర నీచభావై
ర్మద్దైవతైః పరిజనై స్తవసంగసీయ

ఇతరులు చేసిన కైంకర్యము వలన కలిగిన పరమప్రీతిని చూచి తమరే చేసినట్లుగా ప్రీతి అన్ని చోట్లా కలుగును

ఏకరూపావారతిః ఏకరతిః కాల భేదము చేత సంకోచము లేకుండా ఎల్లప్పుడూ ఒకే విధంగా ఉండుట.

నిత్యః విచ్ఛేదము లేని

కైంకర్య ప్రాప్త్యపేక్షయా కైంకర్యము లభించుట అను ఆశచేత

పరిచర్యైక మనోరథః పరిచర్య చేయుటయే కోరికగా కలిగియుండుట

కింకరః స్వామి సమాదేశాపేక్షితచ్ఛేదితకారీ కింకరః తస్య వృత్తిః కైంకర్యమ్, యజమాని ఆదేశానికి ఇష్టపడి పనిచేసేవాడు కింకరుడు. వాని వ్యాపారము కైంకర్యము.

పారమార్థికీః వాస్తవమైన, ఆర్తరూపమైన

భగవత్ జ్ఞాన శక్త్యాది గుణములు పరిపూర్ణముగా కలిగియుండుటచే సాహాయ్యాంతరాపేక్షలేని ఉపాయ పరిపూర్ణత్వము సూచింపబడినది.

చరణారవిందః విగ్రహము విషయములో పరమోపాయత్వము చెప్పబడినది

శరణాగతిః శరణు చొచ్చుట

యథావస్థితాః యథావిధిగా

అనగా సలక్షణంగా ఉపాయంతరములను విడచి ఇదే ఉపాయము బుద్ధితో పట్టుకొనుట. స్నాత్వాభుఞ్జీత స్నానము చేసే భోజనము చేయువలెను అన్నట్లు విడచి పట్టుకొనుటను యథావస్థిత లో తెలియజేసేరు.

అవిరతాః అవిచ్ఛిన్నముగా

అస్తుమేః నాకు కలుగు గాక

విచ్ఛేదము లేకుండా నాకు కలుగుగాక అని భగవద్రామానుజులు ప్రార్థించేరు. దానికి సమాధానంగా తల్లి శ్రీదేవి.

అస్తుతే తయైవ సర్వం సంపత్స్యతే అని తిరిగి సమాధాన మిచ్చినది. అట్లే నీకు కలుగుగాక అని. ఆ శరణాగతి చేతనే మీ అభిమతమెల్లనూ చక్కగా సిద్ధింపగలదు అని ప్రత్యుత్తరమిచ్చెను.

అస్తుతే – తైన మైత్రీ భవతు తే యది జీవితుమిచ్ఛసి అని సుందరకాండలో తల్లి సీతమ్మ రావణునికి రామునితో మైత్రి చేసుకొనుటయే తగినది అని నిశ్చయముగా చెప్పినట్లు ఇచట అస్తుతే అని చెప్పినది. అస్తుమే అని కోరిన వారికి అస్తుతే అని చెప్పుటయే చాలినదై ఉండగా తయైవ సర్వ సంపత్స్యతే అని మీ అభిమతమెల్లనూ చక్కగా సిద్ధింపగలదు అని చెప్పుట ఎందులకు? మన పూర్వాచార్యులు ఈ విషయమున శ్రీదేవి యొక్క హృదయము ఈ విధముగా తెలియచేసారు.

స్వ సమ్బన్ధి సమ్బన్ధి నిస్తరణమపి సర్వశబ్దాభిప్రేతమ్ అంటే వారి శరణాగతిచే సిద్ధించు ఫలము వారి వరకే కాదు. వారి సంబంధము సాక్షాత్తుగనో, పరంపరగనో కల వారల కందరకును సిద్ధించును అని.

తయైవ అను పదముచే ఆనాడు రామచంద్ర ప్రభువు శరణువేడిన విభీషణుని మాత్రమే కాక అతనితో వచ్చిన రాక్షసులను కూడ ఎట్లు రక్షించెనో అట్లే భగవద్రామానుజుల సంబంధము కలిగిన వారందరికీ వారు చేసిన ఈ శరణాగతి యొక్క ఫలము లభించును అని తెలియజేయబడుచున్నది.




ఇక మీదట ద్వయమంత్రములోని నారాయణ శబ్దమును వివరించుచున్నాను.

అఖిల హేయప్రత్యనీక కల్యాణైకతాన స్వేతర సమస్త వస్తు విలక్షణానన్త జ్ఞానానన్దైక స్వరూప! స్వాభిమతానురూపైక రూప అచిన్త్య దివ్యాద్భుత నిత్య నిరవద్య నిరతిశయ ఔజ్జ్వల్య సౌందర్య సౌగన్ధ్య సౌకుమార్య లావణ్య యౌవనాది అనన్తగుణనిధి దివ్యరూప!

స్వాభావికానవధి కాతిశయ జ్ఞాన బలైశ్వర్య వీర్య శక్తి తేజ సౌశీల్య వాత్సల్య మార్ధవార్జవ సౌహార్ధ సామ్య కారుణ్య మాధుర్య గామ్భీర్యౌదార్య చాతుర్య స్థైర్య ధైర్య శౌర్య పరాక్రమ సత్యకామ సత్య సఙ్కల్ప కృతిత్వ కృతజ్ఞతాద్య సంఖ్యేయ కల్యాణ గుణగణౌఘ మహార్ణవ!

ఆశ్రయింపబడవలసిన వస్తు నిర్దేశమును చేయుచున్నారు. ఆశ్రయింపబడవలసినవాస్త్ర నారాయణుడే కదా! నార శబ్దముచే తెలియజేయబడు జీవ పదార్థములకు ఆశ్రయమును తెలియచేయు ఆయన శబ్దము యొక్క అర్థమైన దివ్యాత్మ స్వరూపమును తెలియచేయుచున్నారు.

ఇకపై శ్రీరంగనాధుని పలువిధములుగా సంబోధించి త్వత్పాదారవింద యుగలం శరణమహం ప్రపద్యే అని తమ శరణాగతిని విన్నవించి ముగించారు.

ఇందు అఖిలహేయ మొదలు జ్ఞానానన్దైక స్వరూప అను వరకూ మొదటి సంబోధన.

స్వరూప, రూప, గుణ విభూతులు అను వానిలో స్వరూపమును దీనిచే వర్ణించారు.

అఖిల హేయ ప్రత్యనీకః సమస్త హేయములకు ఎదిరి ఐన

హేయములు అనగా అచిత్తుకు వలె పరిణామము, చేతనులకు వలె దుఃఖము, అజ్ఞానము, నిత్యులు ముక్తుల విషయములో ఉన్న పారతంత్ర్యము మొదలగు దోషములు ఇచట హేయ శబ్దముచే తెలియజేయబడునవి. పారతంత్ర్యము హేయమా అనిన స్వతంత్రుడైన ఈశ్వరునకు పారతంత్ర్యము హేయమే కదా!

ప్రత్యనీకః ఎదిరి, ఆ హేయగుణములు దరి చేరుటకు వీలు లేని వాడు.

కల్యాణైకతానః కల్యాణ గుణములతో నిండి సమస్త హేయ రహితం విష్ణ్వాఖ్యం పరమం పదమ్ సచ సర్వగుణో పేతః

శ్రీరాముడు సర్వగుణములతో కూడిన వాడు. ఈ గుణములను ఎవ్వరునూ ఇన్ని అని వర్ణించలేరు. విలుకాడు తన అమ్ములపొదిలో బాణములు లేక ఆకాశములో బాణములు వేయుట మానవలెనే గాని ఆకాశములో స్థలము లేదు కనుక మానవలెనని మాననవసరము లేదు.





అట్లే భగవానుని గుణములను వర్ణించువారు తమ బుద్ధి ప్రసరింపక గుణములు వర్ణించుట మానవలెనే గాని గుణములు పూర్తి అగుటచే మాననక్కరలేదు.

అట్టి గుణములన్నీ కలసి శ్రీరాముని యందున్నవి అని చెప్పినట్లు స్వామి విషయమై కళ్యాణైకతాన అని చెప్పేరు.

ఇచట శ్రీమన్నారాయణుడు ఉభయలింగ విశిష్టుడు అని చెప్పబడినది. ఉభయలింగాలు అంటే హేయగుణాలు లేకపోవడం, కల్యాణగుణాలు కలిగి ఉండడం. దీనివలన స్వామియొక్క నిర్దోష మంగళ గుణాకరత్వము తెలియజేయబడ్డది.

ఫలమత ఉపపత్తే అను అధిక కరణము ఇచట దర్శింపచేయబడ్డది. ఫలము సర్వేశ్వరుని వలననే కలుగును. పరమ పురుష ఉపాసనము నందు కోరికను పెంపొందించుటకై ఈ అధికరణములో మొదట జీవుడు అని అవస్థలలోనూ దోషయుక్తుడనియూ, సర్వేశ్వరుడు అన్నింటి కన్న పరుడనియూ చెప్పబడెను.

స్వేతరః తనకంటే ఇతరమైన

జ్ఞానమే స్వరూపముగా జీవునకూ, పరమాత్మకూ చెప్పబడిననూ సర్వ ప్రకారములుగనూ సామ్యము కుదరదు అని చెప్పుటకు స్వేతర అని ప్రయోగించారు.

సమస్త వస్తు విలక్షణః సకల వస్తువులకన్న విలక్షణమై, విలక్షణమనగా ప్రత్యేకత. సర్వేశ్వరుడు సమస్త వస్తువుల కంటే విలక్షణమైన స్వరూప స్వభావాలు కలిగి ఉ ంటాడు. చేతనా చేతనముల కన్నింటికి ఉన్న పరాధీనత్వము మొదలగు లక్షణములు లేని వాడు.

అనంతః పరిమితి లేని లేక పరిచ్ఛేదము లేని

నిత్యం విభుం సర్వగతం సుసూక్ష్మమ్ ః

దేశ పరిచ్ఛేదము, కాల పరిచ్ఛేదము, వస్తు పరిచ్ఛేదము లేని వాడు, సర్వవ్యాపి అయినందున దేశ పరిచ్ఛేదము లేదు.

స్వాభిమతః సర్వకాలముల యందు ఉండువాడగుటచే కాల పరిచ్ఛేదము లేదు. సర్వ వస్తువులు తానే అయి ఉండుటచే వస్తు పరిచ్ఛేదము లేదు.

జ్ఞానానందైకస్వరూపః జ్ఞానము ఆనందము స్వరూపముగా కలవాడు ఇక రూపమును వర్ణించుచున్నారు.

స్వాభిమతానురూపైక ః

స్వాభిమతః తన కిష్టానుసారమైన

అనురూపః స్వరూపమునకనుగుణమైన

ఏకరూపః విశిష్టమైన రూపమును

తనకు అభిమతమైన, స్వరూపమునకు తగిన దివ్య మంగళ విగ్రహము కలిగిన వాడు. వ్యూహ విభవ అర్చావతారములలో ఉన్ననూ షాడ్గుణ్య పరిపూర్ణుడై ఉండునట్టి వాడు., సమస్త శక్తి రూపాణి ఏ రూపములో ఉన్ననూ సమస్త శక్తులకూ ఆశ్రయమైనవాడు. ఏకరూప విశిష్టమైన రూపము. షడ్భావ వికారములు లేనిదై, సజాతీయముగా అవతరించిననూ ఏకరూపముగా ఉండును. దేవ తిర్యఙ్మనుష్యాది రూపములను స్వీకరించిననూ పరమపదములో వేంచేసియున్న స్వామియొక్క దివ్య తేజస్సుతోనే వెలుగొందుచుండును.

అచింత్య ః ప్రాకృత వస్తు సజాతీయమని తలచుటకు వీలుకానిదై

దివ్య ః అప్రాకృతమై
భూత సంఘాతముచే తయారుచేయబడిన శరీరము కాదు.

అద్భుత ః క్షణ క్షణమూ అపూర్వమైనదిగా వెలయునది.
సర్వాశ్చర్యమయం దేవమ్ తేనాశ్చర్య పరేణాహమ్
అని చెప్పినట్లుగా అద్భుతమైన రూపము కలవాడు.

నిత్య ః స్వరూప గుణముల వలె అనాది నిధనమై (ఎల్లప్పుడునూ ఉండునది) అర్చారూపమైన విగ్రహము శుభాశ్రయమనుట కల్పితమని చెప్పుమాట ఈ నిత్యపదముచే ఆక్షేపించబడినది.
ఈ లోకములో ఉన్న మనవలె కర్మమూలమైన దుఃఖము లేని వాడు.

నిరవద్యః దోషము లేని

ఈ లోకములో ఉన్న మనవలె కర్మమూలమైన దుఃఖము లేని వాడు నిత్య నిరవద్య అని ఏకపదముగా చేసిన ఎల్లప్పుడూ నిరవద్యమై ఉండునది అని తన దాసులకు ఎల్లప్పుడు అత్యంత అనుకూలుడై ఉండును.

నిరతిశయౌజ్జ్వల్యః దీనిని మించిన మరియొక ప్రకాశము లేదు అనదగినదై. ఔజ్వల్యమంటే ఆదిత్యవర్ణమ్ దివిసూర్య సహస్రస్య అని చెప్పబడినట్లుగా ప్రకాశవంతమైన రూపము.

సౌందర్యః అవయవ శోభ

సాక్షాన్మన్మథ మన్మథః అనునట్టి అవయవ శోభ. మన్మథుని కన్న మించిన అందగాడు.

సౌగంధ్యః దివ్య పరిమళము

సర్వగంధః శ్రుతి సిద్ధమైన సహజ పరిమళము

సౌకుమార్య ః మృదుత్వము

లక్ష్మీదేవి కూడ కనువిచ్చి చూడరాని సుకుమార స్వభావము

మహాబలవంతుడైనప్పటికీ అప్పుడే వికసించిన పుష్పము వంటి మార్దవము సుకుమారౌ మహాబలౌ అని చెప్పినట్లుగా మహాబలవంతులై సౌకుమార్యము కలిగి ఉండుట.

లావణ్య ః సముదాయ శోభ

కన్నుకానందం కలిగించే విగ్రహాతిశయం

యౌవనః ఇది కాలమును బట్టి వచ్చినది కాదు. ఎల్లప్పుడు వ్యక్తిని వీడని యౌవనము. ఇది నిత్యమైన అవస్థా విశేషము.

అదిః ఇటువంటి సర్వగుణములకు ఆశ్రయమైన వాడని అభిప్రాయము

అనంతగుణనిధి దివ్యరూపః అపరిమితములగు గుణములగు ఆటపట్టైన దివ్య మంగళ విగ్రహము కలవాడా! దివ్య శబ్దము రెండు పర్యాయములు ప్రయోగింపబడుటచే ఆ చెప్పబడిన వస్తువుకు ఒక ప్రత్యేకత తెలియజేయబడుచున్నది.

ఇచట నిధి అని వాడుట ఆశ్రయించిన వారలకు నిరతిశయ భోగ్యత్వమును చూపించుటకు. ఈ చూర్ణికలో అచింత్య దివ్యాద్భుత అని మొదటనూ దివ్యరూప అని చివరనూ రెండు చోట్ల దివ్య శబ్దాన్ని వాడేరు. ఇది



పునరుక్తిగా కనిపించిననూ దివ్య శబ్ద ద్వయం ద్రవ్య సంస్థాన వైలక్షణ్యపరం అప్రాకృత స్థాన వర్తిత్వా ప్రాకృతత్వ పరౌవా అప్రాకృతమైన ఆ దివ్య రూపము ఆ అప్రాకృతమైన పరమపద మందున్ననూ లేక ప్రాకృతమైన భూలోకమందు ఉన్ననూ ఏకరూపముగా ఉండును. దీనితో స్వరూపము. రూపము తెలియజేయబడినవి.

స్వాభావికానవధి కాతిశయ జ్ఞాన బలైశ్వర్య వీర్య శక్తి తేజ సౌశీల్య వాత్సల్య మార్ధవార్జవ సౌహార్ధ సామ్య కారుణ్య మాధుర్య గామ్భీర్యౌదార్య చాతుర్య స్థైర్య ధైర్య శౌర్య పరాక్రమ సత్యకామ సత్య సఙ్కల్ప కృతిత్వ కృతజ్ఞతాద్య సంఖ్యేయ కల్యాణ గుణగణౌఘ మహార్ణవ!

ఇప్పటి వరకూ మనకు ఉపకారకాలైన గుణములకు ఆశ్రయమైన రూపాన్ని చూపేరు. ఇక ఆ గుణాల్ని వర్ణిస్తున్నారు.

స్వాభావికానవధి కాతిశయః

స్వాభావికః — స్వభావసిద్ధమైన

అనవధికాతిశయః — హద్దులేని గొప్పతనము గల

ఈ రెండు గుణాలు ఇకపై చెప్పబోవు సకలగుణములలోను అన్వయిస్తాయి.స్వాభావిక పదం చేత నిత్యత్వము, అనన్యాధీనత్వము తెలియజేయబడుచున్నది.

స్వాభావికములై ఉండుట అనగా నీటికి చల్లదనంలా, అగ్నికి వెచ్చదనంలా ఎప్పుడూ కలసి ఉండే లక్షణం. ఒకనాడు పుట్టి మరునాడు పోయేవి కావు. నిత్యుల, ముక్తుల గుణాలు భగవంతుని ఇచ్ఛచే కలిగినవి. అనన్యాధీనత్వమనే సహజ లక్షణం అక్కడ లేదు.

అనవధికాతిశయ అని చెప్పడం వల్ల కింద చెప్పబడే ఒక్కొక్క గుణమునకు తమ కన్న మించిన వెక్కడా లేకపోవుట కనిపిస్తుంది. లేక ఆ గుణములకు హద్దు లేదు అని కూడ చెప్పవచ్చు.

పైన చెప్పిన గుణాలు ఇతర వ్యక్తుల యందునూ కొన్ని చోట్ల కనిపించినా అవి హద్దుకు లోబడి యుండును. భగవంతుని విషయములో ఆ హద్దు కనిపించదు. ఇక ఈ క్రింది గుణాలను చెప్పుచున్నారు.

జ్ఞాన బల ఐశ్వర్య వీర్య శక్తి తేజస్సులనేవి ఆరూ షాడ్గుణ్యములు అనబడును. సంకర్షణాది వ్యూహత్రయం చేత అభివ్యక్తమయ్యే జ్ఞానం మొదలైన ద్వంద్వ త్రయం తెలియజేయబడుచున్నాయి.

జ్ఞానః జ్ఞానమనగా ఒక్క కాలమదే అన్నింటినీ ఉన్నదున్నట్లు తెలుసుకొనుట. యః సర్వజ్ఞః సర్వవిత్ః మొదలగు వాటివల్ల తెలుస్తోంది.

బలః బలమనగా శ్రమ ప్రసంగం రహితం సర్వధారణ సామర్థ్యమ్ సంకల్ప మాత్రమున శ్రమ లేక సకల పదార్థములనూ ధరించు శక్తి

ఏషసేతుర్విధారణః అని ఒక వంతెన రెండు ఒడ్లను కలిపి నిలబెట్టినట్లుగా సమస్త జగత్తును తన సామర్థ్యంతో నిలబెట్టి ఉంచేవాడు పరమాత్మ

ఐశ్వర్యః ఐశ్వర్యమనగా సామర్థ్యం సమస్త వస్తువులను నియమించగల సామర్థ్యం ఏష సర్వేశ్వరః సర్వేశ్వరేశ్వరః కృష్ణః అను చోట్ల ఇది మనకు తెలియజేయ బడుచున్నది.

వీర్యః వీర్యమనగా వికారము కలుగుటకు తగిన పరిస్థితులేర్పడిననూ మార్పు చెందకుండ ఉండుట. ఈ జగత్తునకంతకూ తానే ఉపాదాన కారణంగా ఉండియూ స్వరూప వికారము లేకుండుట. ఉపాదాన కారణమనగా కుండకు మట్టి వలె ఈ జగత్తునకు మూలమై ఉండుట.

శక్తిః తనకంటే వేరైన అన్ని పదార్థములను నియమించ గలిగిన సామర్థ్యం కలవాడు. అనగా అఘటిత ఘటనా పాటవం

తేజస్ దేనికినీ సహకారిని అపేక్షించకుండుట
సతత్ర సూర్యోభాతి న చంద్ర తారకమ్ నేమావిద్యుతో భాతికుతో యమగ్ని భగవత్ప్రకాశము ముందర సూర్యుని ప్రకాశము, చంద్రుని ప్రకాశము తారకల ప్రకాశము ద్యోతకము కాదంటే ఇక అగ్ని సంగతి వేరే చెప్పాలా? అని, ఇక షాడ్గుణ్యముల నుండి తోచు ఆశ్రిత రక్షణములో విశేషముగా ఉపయోగపడు కల్యాణ గుణములను చెప్పుచున్నారు.

సౌశీల్యః సౌశీల్యమనగా తాను గొప్ప వాడై ఉండి తనకన్న తక్కువ వారితో అరమరికలు లేకుండా కలిసి ఉండడం. దీనినే శీలగుణం అంటారు. రాముడు గుహుని విషయములో కృష్ణ పరమాత్మ గోపాలుర విషయములో ఈ గుణము చూపబడ్డది.



వాత్సల్యం: వాత్సల్యమనగా తన చేత రక్షింపదగిన వారిలోని దోషాల్ని చూడజాలని ప్రీతి విశేషము. దోషములను కూడ భోగ్యముగా స్వీకరించుట. భగవద్గీతలో శ్రీకృష్ణ పరమాత్మ.

అపిచేత్సుదురాచారో భజతే మామనన్యభాక్
సాధురేవ సమన్తవ్య స్సమ్యగ్వ్యవసితో హి సః

సుదురాచారః అపిః మిక్కిలి దురాచారములు కలవాడైనను చేయవలసినవి మానుటయే కాక చేయరానివి కూడ చేయువాడు. అటువంటి వాడైన ఫలాశలన్నీ విడచి నన్ను భజించనిదే నిలవలేక భజించటమే ఫలముగా భజిస్తే వానిని తప్పక ఆదరిస్తానని చెప్పేడు.

మార్ధవః మార్ధవమనగా మృదుత్వము, ఆశ్రితుల విరహమును ఓర్వలేని లక్షణం సర్వ సులభత్వమన్న మాట.

తం వినాకైకయీ పుత్రం భరతం ధర్మచారిణమ్ ।
న మే స్నానం బహుమతం వస్త్రాణ్య భరణానిచ ॥

విభీషణుడు రావణ వధానందతరము రామునితో స్నానాలంకారాలకు తగిన ఏర్పాట్లు చేయబడినవి అని చెప్పినప్పుడు రాముడు ధర్మాత్ముడైన మా భరతుడు తాను ఆడిన మాటకు కట్టుబడి సుఖముగా ఉండదగిన వాడు నా కోసము పట్టణం వెలుపల క్లేశాన్ననుభవిస్తున్నాడు. అతడు ధర్మాత్ముడు. ధర్మాచరణశాలి అతడు లేనిదే స్నానము చేయడం కాని, అలంకరించుకోవడం కాని నాకు సమ్మతం కాదని చెప్పడంలో మనకి ఈ గుణం కనిపిస్తుంది.

ఆర్జవః త్రికరణముల చేతను అనగా మనసు, మాట, చేత ఒకే విధంగా ఉండడం, దీనినే ఋజుత్వం అని కూడ చెప్పవచ్చు.

సౌమ్యః జాతి, గుణ, వృత్తాదులందు (వృత్తమనగా నడవడి) హెచ్చు తగ్గులు చూడక అందరి చేత ఒకే రకముగా ఆశ్రయింపబడ దగియుండుట. రామచంద్ర ప్రభువు శబరి విషయములో మనము దీనిని చూడవచ్చు.

శబర్యా పూజితస్సమ్యగ్రామో దశరథాత్మజ ।
పంపాతీరే హనుమతా సంగతో వానరేణ హ ॥



దశరథాత్మజుడగు రాముడు శబరి చేత బాగుగ పూజింపబడినాడు. దశరథ చక్రవర్తి కుండల ధారులైన వంట వారిచే వండించి రుచ్యాలైన పదార్థాల్ని రామునికి పెట్టించేవాడు. అంతకంటే ప్రీతితో, భక్తితో పరమ పురుషుడే తమ వద్దకు వచ్చేడని తెలిసి శరభంగాదులు ఆరాధించేరు. దశరథునిది స్నేహమైతే శరభంగాదులది భక్తి కాని శబరిది అచ్చమైన ప్రేమ. తాను తక్కువ అనే సందేహం ఆమెకు కలుగనేలేదు. అంతగా స్వామి మనచే ఆశ్రయింపబడదగినవాడై ఉండును.

కారుణ్యః ఏ ప్రయోజనము లేకుండానే ఇతరుల దుఃఖాన్ని సహింప జాలక పోవడం. దుఖించుచున్న వారి యెడల అయ్యో అని కనికరము చూపుట.

మాధుర్యః చంపదలచు దుష్టచిత్తము గల శత్రువులను కూడ ఆకట్టుకొనగల రూపము. ఏహ్యేహి పుల్లాంబుజ పత్ర నేత్రా శత్రువర్గములోని భీష్ముడు కూడ తన పైకి వచ్చుచున్న కృష్ణుని చూచి నేత్ర సౌందర్యమునకు పరవశించి రమ్ము రమ్మని ఆహ్వానించెను.

గాంభీర్యః ఆశ్రయించిన వారికి తాను చేయదలచిన దానిని, అనాశ్రితులకు ఏ మాత్రము తెలియుటకు వీలు కాని విధమైన ఆకార చేష్టామనో భావములు కలిగియుండుట.

ఔదార్యః ఇవ్వబడే వస్తువు యొక్క గొప్పదనాన్ని కాని, పుచ్చుకొనే వాని తక్కువదనాన్ని కాని చూడక ఇవ్వగలగడం లేక కోరిన వారికి కొరత లేక ఇవ్వగలిగి యుండుట.

చాతుర్యః చాతుర్యమనగా ప్రతికూలురును కూడ అనుకూలురుగ చేసుకొనుట

స్థైర్యః శరణాగతులను రక్షించుటలో ఎట్టి జంకు గొంకులు లేకపోవడం. ఇది మనం విభీషణుని విషయములో చూడవచ్చు.

మిత్ర భావేన సంప్రాప్తం సత్యజేయ్ కథంచన ।
దోషోయద్యపి తస్య స్యాత్ సతామేతదగర్హితమ్ ॥

మిత్రత్వంతో వచ్చిన వారిని వాడు ఎటువంటి వాడైనా, ఏమైనా నేను వదలను అతని యందు దోషమే ఉండు గాక, ఉండనీండి. దోషమున్నా రక్షించటం పెద్దలభిప్రాయంలో ఆదరింపబడేదే కాని నిందింపబడేది కాదు అని చెప్పడంలో స్వామి యొక్క శరణాగత రక్షకత్వం ద్యోతకమగుచున్నది.

ధైర్యః — చేసిన ప్రతిజ్ఞను విడవకుండుట.

అప్యహం జీవితం జహ్యాం త్వాం వాసీతే! స లక్ష్మణామ్ ।
నతు ప్రతిజ్ఞాం సం శ్రుత్య బ్రాహ్మణేభ్యో విశేషతః ॥

బ్రహ్మవేత్తలైన ఋషులకు మాట ఇచ్చి తిరగడం నాకు చేతకాని పని. అంతగా తప్పని పరిస్థితి ఏర్పడినప్పుడు నా ప్రాణాలైనా విడవటానికి జంకను. ప్రాణాలకంటే ప్రియమైన నిన్నే అయినా, లక్ష్మణుని అయినా వదిలేస్తాను కాని, రక్షిస్తానని ఋషులకు ఇచ్చిన ప్రతిజ్ఞను మీరజాలను అంటాడు.

ద్రౌపదితో కృష్ణుడు చెప్పిన మాట

ద్యౌ పతేత్ పృథివీ శీర్యేత్ కృష్ణే నమో మోఘం వచో భవేత్

ఆకాశం విరిగి పడినా, భూమి శిథిలమైనా హిమవత్పర్వతము ముక్కలు ముక్కలైనా నా మాట మాత్రము తిరుగదు.

శౌర్యః — నిర్భయమంగా శత్రువుల సమూహములలో ప్రవేశించగలగడం, సహాయం లేకపోయినా పరబల సమూహములలో తన బలములో ప్రవేశించినట్లు ప్రవేశించి గలిగిన సామర్థ్యం. జనస్థానములో ఖర ధూషణాది రాక్షస సమూహములతో రామచంద్రుని ఈ లక్షణం చూడవచ్చు.

పరాక్రమః — పరసైన్యంలో ప్రవేశించి ఆ చొచ్చిన చోట అవలీలగా శత్రువును భంగపరచు నేర్పు.

సౌశీల్యం నుండి పరాక్రమం వరకు చెప్పబడ్డ గుణాలు షడ్గుణాల విస్తారమే. ఇక ముందు చెప్పబోవు గుణాలు తన్నాశ్రయించిన వారి ఇష్టాన్ని పొందించడంలో సహకరించేవి.

సత్యకామః — కోరినవెల్ల కొరత లేక సిద్ధించియుండుట.

సత్యసంకల్పః — ఏది చేయదలచినను అడ్డులేక చేయగలిగిన శక్తి. జగద్వ్యాపారము, మోక్ష ప్రదానము మొదలగు విషయములలో ఆయన యొక్క అమోఘ సంకల్పత్వము చూడబడుచున్నది.

కృతిత్వంః — కృతిత్వ అంటే ఉపకారము చేయడం, తన్నాశ్రయించిన వారి పనులను చేయుచునే ఉండుట.

అభిషిచ్య చ లంకాయాం రాక్షసేంద్రం విభీషణమ్ ।
కృతకృత్యస్తదా రామో విజ్వరః ప్రముమోద హ ॥

విభీషణుని లంకానగరానికి అభిషేకం చేసిన తరువాత తనను కృతకృత్యుడైన వానిగా భావించాడు. తనకు శరణాగతుడైన విభీషణునికి ఉపకారము చేయడం మనకి ఇందులో కనిపిస్తుంది. కర్తవ్యాన్ని శేషం లేకుండా పూర్తి చేసే విషయములో కృతి శబ్దం ప్రయోగింపబడుచున్నది.

కృతజ్ఞతాః ఒకసారి చేసిన ఉపకారాన్ని ఎప్పటికీ మరచిపోక పోవుట

కథంచి దుపకారేణ కృతేనైకేన తుష్యతి ।
న స్మరత్యపకారాణాం శతమప్యాత్మ వత్తయా ॥

ఎవరైనా అనుకొనియో అనుకొనకయో ఏదో ఒక విధముగా ఒక్క ఉపకారమును చేసిన శ్రీరాముడు మనసులో పొంగిపోవును.

ఆ ఉపకారమును ఎల్లప్పుడు కొనియాడుచు ఆనందించు చుండెడివాడు.

ఆదిః మొదలగు ఇది సుప్రసిద్ధ సర్వగుణ సంగ్రహముగా వాడబడ్డది

అసంఖ్యేయః లెక్కించుటకు శక్యము గాని సముద్రంలో ఉన్న రత్నములు ఇన్ని అని ఎట్లా లెక్కించలేమో అట్లాగే స్వామి కల్యాణగుణాలకు సంఖ్యానియతని కల్పించలేము.

కల్యాణః కల్యాణ శబ్దం చేత ఆశ్రితుల విరోధులను నిరసించుట కొరకు తెచ్చుకొను క్రోధము, మొదలగునవి కూడ సంగ్రహముగా తెలియజేయబడినవి.

గుణగణౌఘ మహార్ణవః ఒక్కొక్క గుణములో అవాంతరముగా అనేక గుణములు ద్యోతకమగుట గణ శబ్దముచే తెలియజేయబడుచున్నది. అటువంటి కల్యాణ గుణములనే ప్రవాహములకు సముద్రము వంటి వాడా! అని సంబోధించారు.

స్వోచిత వివిధ విచిత్రానన్తాశ్చర్య నిత్య నిరవద్య నిరతిశయ సుగన్ధ నిరతిశయ సుఖ స్పర్శ నిరతిశయౌజ్జ్వల్య కిరీట మకుట చూడావతంస మకరకుణ్డల గ్రైవేయక హార కేయూర కటక శ్రీవత్స కౌస్తుభ ముక్తాదామ ఉదరబన్ధన పీతామ్బర కాఞ్చీగుణ నూపురాద్య పరిమిత దివ్యభూషణ!

కళ్యాణ గుణాల్ని వర్ణించి, స్వామి యొక్క దివ్య మంగళ విగ్రహానికి అలంకారాలైన దివ్యాభరణాల్ని ఇకపై వర్ణిస్తున్నారు

స్వోచితః ఇంతకు ముందు చెప్పబడిన స్వరూపగుణ గుణములకు అనురూపమైన అనగా తగిన

వివిధ విచిత్ర : అనేకములైన వైచిత్రులను కలిగిన హేమము, రత్నము, ముత్యము, మొదలగు వాటితో కూడియున్నవి అని చెప్పవచ్చును. లేదా అన్నియూ అలంకారములే ఐననూ వాటిలో వాటికున్న శిల్ప విశేషముల చేత అవాంతర భేదముండుట ఇచట వివిధ, విచిత్ర చేత తెలియజేయ బడుచున్నది.

అనంతః పరిమితి లేని

ఆశ్చర్యః ఆశ్చర్యమును కలిగించునవైన

నిత్యనిరవద్యః ఎల్లప్పుడునూ ఉండునవై, ఎట్టి దోష సంబంధము లేని, దోష సంబంధము లేనివై అని మాత్రము అన్నచో ఒకప్పుడు దోషముతో సంబంధమున్నదా? అను అనుమానము వచ్చును. కనుక నిత్య నిరవద్య అని ఏకపదముగా తీసుకున్నచో ఎప్పుడునూ దోష సంబంధములేని అని తెలియుచున్నది.

నిరతిశయ సుగంధః

సర్వగంధః అని చెప్పబడువాడు స్వామి. ఆయనకు కూడ ఆమోదమును, అతిశయమున, కలిగించగలిగిన పరిమళములను వెదజల్లుచున్న.

నిరతిశయ సుఖస్పర్శః అతి విశిష్టమైన, సాటిలేని సౌకుమార్యము కలవై

నిరతిశయౌజ్వల్యః సాటిలేని కాంతి కలవై ఉండు.

కిరీట మకుట చూడావతంసః ఈ మూడు శిరోభూషణాలే. కిరీట మనగా రాజలాంఛన చిహ్నితమైన శిరోభూషణము. కిరీటాగ్ర భాగమును మకుటము అందురు. చూడావతంసమనగా నెమలి పింఛముతో కూడిన శిరోభూషణము. వీటిలో సౌలభ్యమునకు దాల్చిన అలంకారము ఒకటి, పరత్వ సూచకముగా దాల్చిన ఆభరణ మొకటి, ప్రణయరసా విష్కరణ సూచకముగా దాల్చిన ఆభరణ మొకటి అని కూడా చెప్పవచ్చును. చూడవతంసమును ఏకపదంగా కాకుండా చూడ, అవతంస అని తీసుకున్నచో అప్పుడు దండకడియము, కర్ణపుష్పములు అను ఆభరణములు తెలియజేయబడుచున్నవి.

మకరకుండలః మకర సన్నివేశం కుండలం మకర కుండలమ్. మకరాకృతి కలిగిన కుండల వలను మకరకుండలములందురు.

గ్రైవేయకః కంఠము నందు దాల్చు ఆభరణము.

హారః — వక్షస్థల మందు ధరించు ముత్యాల దండలు మొదలగునవి.

కేయూర కటకః — బాహువుల యందు ధరించునవి, ముంజేతికి ధరించు ఆభరణములు.

శ్రీవత్సః — శ్రీవత్సము స్వామితో అవిభక్త లక్షణం కలిగియున్నప్పటికీ అనగా వేరుచేసి చూపుటకు వీలులేనిదే అయినప్పటికీ ఈ చిహ్నము ఒక ఆభరణముగా చెప్పబడినది. ఇది సర్వేశ్వరత్వ చిహ్నమైన ఆభరణముగా చూపబడినది.

కౌస్తుభః — కౌస్తుభమణి వక్షస్థలముపై ఉంచుకొను శ్లాఘ్యమైన రత్నము. ఒక్క క్షణము కూడ విశ్లేషము లేకుండా ఎప్పుడు వక్షస్థలము మీదనే ఉండు ఆభరణమిది.

ముక్తాదామః — ముత్యాల దండలు, ఏకావళి, త్రిసరము, పంచసరము అనబడు ముత్యాల హారములు.

ఉదరబంధనః — నడుమునకు కట్టు పట్టి, ప్రళయకాల సమయములో ఈ జగత్తునంతనూ తన ఉదరమందు దాచుకొని వాటిని రక్షించిన ఆపత్సఖత్వము అను లక్షణమునకు పట్టము కట్టినట్లున్నదీ పట్టీ

పీతాంబరః — పురుషోత్తమత్వాన్ని తెలియజేయు పచ్చని వస్త్రము.

అతసీపుష్ప సంకాశః పీతవాసా జనార్ధనః ।
వ్యభ్రాజత సభామధ్యే హేమ్నీవోపచితోమణిః ॥

అవిసెపూవు వంటి శరీరఛాయ కలిగి, పచ్చని వస్త్రముతో ఒప్పుచున్న జనార్ధనుడు సభామధ్యములో బంగారమందు పొదగబడిన మణివలె ప్రకాశించుచున్నాడు.

కాంచీగుణః — పీతాంబరమునకు శోభను కలిగించు మొలత్రాడు.

నూపురః — అందె

ఆదిః — మొదలగు, ఆది శబ్దము చేత యజ్ఞోపవీతము, ఉంగరములు మొదలగు ఇతర ఆభరణములు చెప్పబడినట్లైనవి.

అపరిమిత దివ్యభూషణః అసంఖ్యేయమైన దివ్యాభరణములు కలవాడా! అని సంబోధించారు.

స్వానురూపా చిన్త్యశక్తి శఙ్ఖచక్ర గదాऽసి శార్ఙ్గాది అసఙ్ఖ్యేయ నిత్య నిరవద్య నిరతిశయ కల్యాణ దివ్యాయుధ!

ఇప్పటి వరకూ ఆశ్రితులు అనుభవించుటకు తగిన దివ్య ఆభరణములను చెప్పి ఆ అనుభవ రక్షణమునకు ఉపయుక్తమగు ఆయుధములను తెలియజేయుచున్నారు.

స్వానురూపః తనకు తగినవై, ఇంతకు ముందు చెప్పిన బల వీర్యాది గుణములతో కూడిన విగ్రహమునకు అనురూపమైన ఆయుధములను చెప్పుచున్నారు. (లేక)ఆశ్రితవిరోధులను దునుమాడు ఆయుధములను వివరించుచున్నారు.

అచింత్యశక్తిః మనసు చేత కూడ తలచుటకు వీలుకాని శక్తిని కలిగినవి. (లేక) ఒక్కొక్క ఆయుధమే అన్ని ఆయుధముల యొక్క కార్యము చేయగల శక్తి కలవి. దానిని అచింత్య శక్తి అని చెప్పవచ్చు.

గొడ్డలి, గునపము మొదలగునవి చేయవలసిన కార్యమును ఒక బాణము చేసినది అని మనకు రామాయణములో రామచంద్ర ప్రభువు చేసిన సప్తసాలభంజనము వల్ల తెలుస్తోంది.

ఆ ఒక్క బాణమే సప్త మహాద్రుమములను దునుమాడి గిరి, రసాతల భేదనం కూడ చేసింది.

శైలశ్చ వసుధాచైవ బాణేనైకేన దారితాః శంఖచక్ర గదా శార్ఙ్గాదిః శంఖము చక్రము గద విల్లు మొదలైన ఇక్కడ నాలుగు ఆయుధములే చెప్పబడ్డాయి.

కాని వీటిని మనకు సాధారణముగా స్వామికి చెప్పే పంచాయుధాలకూ ఉపలక్షణముగా గ్రహించవలెను.

చక్రము హేతిరాజుగా కీర్తింపబడినా ఇక్కడ శంఖమును ముందుగా చెప్పి తరువాత చక్రము చెప్పుట శంఖమునకు భగవంతుని సర్వశక్తులలోనూ ప్రధాన శక్తికి శంఖమునూ సూచకంగా చెప్పేరు.

ఆదిః దీని చేత హలము, ముసలము మొదలగునవి కూడ తలచవచ్చును.

అసంఖ్యేయః లెక్కింపనలవి కానివి.

ఆభరణములకు ఎట్లా నియతి లేదో అట్లే ఆయుధములకు కూడ నియతి లేదని తెలియజేయుచు ప్రధానమైన ఆయుధములను కొన్నింటిని మాత్రము తెలియజేసిరి.

భగవద్గీత పదకొండవ అధ్యాయములో

అనేక వక్త్ర నయనమనేకాద్భుత దర్శనమ్ ।
అనేక దివ్యాభరణం దివ్యానేకోద్యతాయుధమ్ ॥

అని అనేక ముఖములు, అనేక నేత్రములు కలది, నిరతిశయమైన ఆశ్చర్యముగా చూడబడునదియై అనేక దివ్యాభరణములను ధరించునదియై అప్రాకృతములైన అనేక ఆయుధములను ఎత్తి పట్టుకొనియున్నదియైన రూపాన్ని చూపినట్లు సంజయుడు తాను దర్శించినట్లు ధృతరాష్ట్రునకు వర్ణించి చెప్పెను.

నిత్య నిరవద్యః: రోజులు గడచినా వాడి తగ్గని ఎల్లకాలము యందు ఒక్క తీరుననే ఉన్నవి నిత్య ఉత్పత్తి వినాశములు లేనివై నిరవద్య ప్రతికూలురను నిరసించుట మొదలగు విషయములలో తమ శక్తిని స్వార్ధము లేకుండా తమకు శేషియైన శ్రీమన్నారాయణుని కోసమే ఉపయోగపడునవి.

నిరతిశయ కల్యాణః: ఆశ్రిత విరోధి నిరసన సమయములో ఈశ్వర సంకల్పమునకు ముందుగనే ఆ కార్యమును నెరవేర్చునవి.

దివ్యాయుధః: దివ్యాయుధములు కలవాడా!

స్వాభిమత నిత్యనిరవద్యానురూప స్వరూప రూప గుణ విభవైశ్వర్య శీలాద్యనవధికాతిశయాసంఖ్యేయ కల్యాణ గుణగణ శ్రీవల్లభ!

లక్ష్మీదేవి విషయములో మొదటి చూర్ణికలో చెప్పబడిన విశేషణమే ఇక్కడ కూడ చెప్పబడినది. ఇది పునరుక్తిగా భావించదగియున్నది.

కాని అదరాతి శయమున పలికిన పలుకులకు పునరుక్తి దోషము లేదు. ఆచ్చాణ్ పిళ్ళై వారు భగవద్రామానుజులు తాము ఇతరులకు ఉపదేశించక తామే అనుభవించుచూ దాని వల్ల కలిగిన ఆదరాతిశయముచే పలికిన పలుకుల కనుక దోషము లేదు అని చెప్పిరి. లేక అక్కడ శరణ్యత్వమునకు అనుకూలముగా చెప్పిరనియూ, ఇక్కడ వాల్లభ్యమునకు అనుకూలముగా చెప్పిరనియూ చెప్పవచ్చు.

శ్రీవల్లభః: ఈ కల్యాణ గుణములు కల మహాలక్ష్మికి వల్లభుడైన వాడా! శ్రీవల్లభ అనునది రెండు రకములుగా చెప్పుకొనవచ్చును.

శ్రీదేవి వల్లభుడనీ శ్రీదేవి చెప్పిన మాటను జవదాటక ఆమెకు విధేయుడై ఉండువాడనీ, భగవానునికి అమ్మ అన్న పిచ్చి ప్రేమ.

ఆకలితో ఉన్నవాడు అన్నాన్ని ఎంత ఆతురతతో అనుభవించునో అమ్మను అంత ఆర్ద్రతతో స్వామి స్వీకరించును.

అందుకే ఆళ్వార్లు పిత్తర్ పనిమలర్ మేల్ పావైక్కు

పుష్పపుత్రిని గూర్చి పిచ్చెత్తిన వాడు అని అభిప్రాయపడినారు. ఈ ప్రేమే మనకు రామావతార కాలములో ఇంకా స్పష్టముగా కనిపిస్తోంది. ఆమె ఒక మాసం కంటే రామునికి దూరమై బతకలేను అంటే న జీవేయం క్షణమపి వినా తామసితేక్షణామ్ అని క్షణకాలము కూడ వదలలేనంటాడు స్వామి.

అటువంటి వాల్లభ్యము ఆమె యందు స్వామికి ఉన్నది కనుక ఆమె మనకు పురుషకారమవడంలో కాని మనకు ప్రాప్యమవడంలో కాని ఏవిధమైన అవరోధం లేదని భగవద్రామానుజులు నిర్ధారిస్తున్నారు.

ఏవంభూత భూమి నీలానాయక : ఇంతకు ముందే లక్ష్మీదేవికి చెప్పిన కళ్యాణ గుణములన్నీ భూదేవికినీ, నీళాదేవికినీ సమానమే. దేవి త్వామను నీళయా సహ మహీ దేవ్యై స్సహస్రం తథా నీళా, భూదేవులతో కూడ నిన్ననుసరించియుండు వేల కొలది దేవేరులను చెప్పుచున్నారు.

వైకుంఠనాథస్తు అనంతాసన సంస్థితః ।
సేవ్యశ్శ్రీభూమి నీళాభిః ప్రాదుర్భావైస్తుచాఖిలైః ॥

అని పరమపదములో దేవీత్రయ సంబంధము అనగా శ్రీ భూ నీళా దేవులతో కూడియుండుట ప్రమాణ సమ్మతమే.

స్వచ్ఛన్దానువర్తిస్వరూప స్థితి ప్రవృత్తి భేద ఉశేష శేషతైక రతిరూప నిత్య నిరవద్య నిరతిశయ జ్ఞాన క్రియైశ్వర్యాది అనంత కల్యాణ గుణ గణ శేషశేషాశన గరుడ ప్రముఖ నానావిధ అనంత పరిజన పరిచారికా పరిచరిత చరణయుగల!

దేవేరులతో కూడిన స్వామిని సేవించుటయే తమకు స్వరూప లాభమని భావించు పరిజన సమూహమును ఇకపై వర్ణించుచున్నారు.

స్వచ్ఛందానువర్తి : సంసారులు భగవంతుని సంకల్పమును తెలుసుకొనగలిగిన జ్ఞానము కలవారు కారు. కనుక వారు స్వామి యొక్క సంకల్పమును అర్థము చేసుకొని దానికి అనుగుణముగా ప్రవర్తించు శక్తి లేని వారు. అందుచే వారి నడువడి భగవత్సంకల్పాధీనముగా సాగును. నిత్యులు అట్లుకాక భగవదభిప్రాయమును స్పష్టముగా తెలుసుకొనగలిగిన జ్ఞానము కలవారు. అందుచే ఆత్మాత్మీయములను అనగా తానూ తనకు సంబంధించిన వన్నియూ భగవంతుని యొక్క సంకల్పముననుసరించి ప్రవర్తించునట్లు చేయుటయే స్వచ్ఛందానువర్తి అను పదములో తెలియుచున్నది.

రూప స్థితి ప్రవృత్తిః స్వరూపము, స్థితి, ప్రవృత్తుల యొక్క స్వరూపాన్ని నిర్వచిస్తూ సజాతీయ విజాతీయ వ్యావర్తకాకార విశిష్టమ్ స్వరూపమ్ అంటారు.

సజాతీయమైన వాటిలో కూడ ఒక దాని కన్న ఒక దానికి ప్రత్యేకత ఉంటుంది. అది సజాతీయ భేదం.

విజాతీయమంటే వేరు వేరు జాతులకు చెందిన సజాతీయమైన వాటి కన్న విజాతీయమైన వాటి కన్న వేరైనది స్వరూపము.

ఒకే జాతికి చెందిన వాటిలో వేరు అంటే చెట్లన్నీ ఒకే జాతికి చెందినా మామిడి చెట్టుకీ, పనస చెట్టుకీ తేడా ఉన్నది కదా.

విజాతీయమన్న దాంట్లో రెండు వేరు వేరు జాతులన్నప్పుడు ఒక చెట్టుని కొండనీ ఉదాహరణంగా తీసుకోవచ్చు. అంటే అది అదే అని తెలియజేసే రూపమేదైతే అదే స్వరూపము.

అన్ని కాలముల యందు ఆ స్వరూపము అనువర్తించి యుండుట స్థితి అనబడును. కైంకర్య రూప వ్యాపారమే ప్రవృత్తి

బేధః భేదము గల, అనగా ఈశ్వర సంకల్పమునకు అనుగుణముగా తనయొక్క స్వరూపమును, స్థితిని, ప్రవృత్తిని మార్చుకొనునట్టి ఇది మనకి లక్ష్మణ స్వామి విషయములో గోచరిస్తుంది. రాముని యొక్క ఆజ్ఞను అనుసరించి అరణ్యములో లక్ష్మణుడు ఆశ్రమ నిర్మాణమును పూర్తి చేసిన తరువాత రామచంద్ర ప్రభువు చెప్పిన మాటలు.



భావజ్ఞేన కృతజ్ఞేన ధర్మజ్ఞేన చ లక్ష్మణ ।
త్వయా పుత్రేణ ధర్మాత్మా న సంవృత్తః పితామమ ॥

ఇటువంటి ఆశ్రమమును నీవు నిర్మించిన తరువాత తండ్రిగారు పోయిన లోపము నాకు లేదు. నాకు ఏ విధముగా అనుకూలముగా ఉండునో, నా మనసును ఎరిగి నీవు నిర్మించితివి. ఈ ఆశ్రమ నిర్మాణములో చూపిన నేర్పుచే నీవు భావజ్ఞుడవు. ధర్మజ్ఞుడవు, కృతజ్ఞుడవని తెలియచున్నది. నా భావమును తెలుసుకొని నిర్మించితివి. కనుక భావజ్ఞుడవు. తండ్రిగారు నాకై నిర్మించిన భవన నిర్మాణ క్రమమును గుర్తు చేసిన వాడవు కనుక కృతజ్ఞుడవు. నాకు అవసరమైనవన్నీ కల్పించి నీవు దాసునిగా నా సేవ చేయుచూ వెలుపల ఉండుటకు నిర్ణయించుకొని నీకొక స్థానమును నిర్మించుకొనకుండుటచే నీవు ధర్మజ్ఞుడవని నిరూపించికొంటివి అని అనెను. ఈ విధమైన ఈశ్వర సంకల్పాను సారముగా తమ స్వరూపము, స్థితియు, నడతయు, మార్చుకొనునట్టి పరిజనులను ఉద్దేశించిరి.

అశేష శేషతైక రతిరూపః సమస్తమైన దాస్యముల యందు ఒకే విధమైన ఆదరమే స్వరూపముగా గల, ఆ కైంకర్యము ఏది అనుదానిలో తేడా లేకుండా ఏ కైంకర్యమైననూ ఒకే విధమైన ఆదరమును కలిగిన స్వరూపము కలవారు.

నిత్యః సర్వకాలముల యందు ఉండునట్టి

ముక్తులు కొంతకాలము మనవలె సంసారములో ఉండి, స్వామి అనుగ్రహముచే ఆయన వద్దకు చేరినవారు. ముక్తులు కూడ సంసారములో ఉన్నప్పుడు మనవలెనే స్వామి యొక్క సంకల్పమును ఎరిగి కైంకర్యము చేయగలిగిన శక్తిలేని వారు. ఆ ముక్తుల వలె ఒక కాలమందు ఉండి, ఒక కాలమందు లేని జ్ఞానము కలవారు గాక సర్వ కాలముల యందు ఉండునట్టి నిత్యులు ఇందు తెలియజేయబడుచున్నారు.

నిరవద్యః దుఃఖాది దోష గంధ రహితత్వం నిరవద్యత్వమ్
దుఃఖము మొదలగు దోష గంధము కూడ లేకుండుటయే నిరవద్యత్వము.
స్తోత్ర రత్నములో - హతాఖిల క్లేశమలై స్స్వభావతః
భగవదనుగ్రహము చేత మలినముల వంటి క్లేశములను తొలగించుకొనిన స్వభావము కలవారు నిత్య సూరులు. అనగా అవిద్యాది ప్రకృతి సంబంధ రహితులు, నిత్య నిరవద్య అని జ్ఞానానికి విశేషణంగా చెప్పుకుంటే కైంకర్యము నందు స్వాధీనము (తన చేయు పని తన ఆధీనములో ఉండుట), స్వార్ధము (తన కొరకు చేయుట), కర్తృత్వము (చేయువాడను తానే అని అహంకరించుట) అనెడి భ్రమరాహిత్యమును తెలియజేయును.

నిరతిశయజ్ఞానః అసంకుచితమైన జ్ఞానము

క్రియః జ్ఞానమునకు అనురూపమైన వ్యాపారము

ఐశ్వర్యః దేహేంద్రియాది నియమనము లేక - స్వామిని కూడ నియమించగలిగిన నియమన శక్తి

ఆదిః మొదలగు

అనంతః ఈశ్వరునకు రక్షణ విషయములో ఆయనకు గల గుణములకెట్లు అవధి లేదో అట్లే స్వామికి కైంకర్యము చేయుటకు అనుగుణమైన గుణములలో హద్దు లేకపోవుటయే ఇచట అనంతలో తెలియజేయబడుచున్నది.

గుణ గణః పైన చెప్పబడినటువంటి మంగళకరమైన గుణముల యొక్క సమూహములు కల.

శేష శేషాశన గరుడ ప్రముఖః

శేషః శేష అనగా శేషుడు వీరినే అనంతాళ్వాన్ అని పిలుస్తారు

శేషాశనః శేషాశనులనగా విష్వక్సేనులు. వీరినే సేనైముదలియార్ అంటారు

గరుడః గరుడాళ్వార్, వారినే పెరియతిరువడి అంటారు

ప్రముఖః ప్రముఖులు

నానావిధానంత పరిజనః

నానావిధః — వివిధ భేదములు కల, ఆసన వాహన ద్వార పాలాది భేదము చేత నానా విధత్వము, చండాది ద్వారపాలకులు, కుముదాది గణాధిపతులు మొదలగు వివిధ భేదములు, ఛత్ర చామర పాదుకా పతద్గ్రహణ కైంకర్యము చేయువారిలోని భేదములు కూడ చూడవచ్చును.

అనంత పరిజనః — అనంతత్వమనగా అసంఖ్యాకత్వము. అసంఖ్యాకమైన పరిజనము

పరిచారికాః — దాసీజనములు, అనుగ్రహ, విమల, కాంతి, వారుణి, సుకీర్తి, రుద్ర, సూత్రవతి మొదలగువారిని పరిచారకులనుట.

పరిచరిత చరణయుగళః — పరిచర్య చేయబడుపాదారవిందములు కలవాడా! స్వామి యొక్క విగ్రహ సౌందర్యము చేతను, గుణముల చేతను కైంకర్యమందు ప్రేరేపింపబడినవారు. హనుమ అడిగిన ప్రశ్నకు రాముని ప్రేరణచే లక్ష్మణుడు తనను గురించి తెలియజేస్తూ –

అహమస్యావరో భ్రాతా గుణైర్దాస్యము పాగతః ।
కృతజ్ఞస్య బహుజ్ఞస్య లక్ష్మణో నామనామతః ॥

నేనితనికి తమ్ముడను, గుణములచే దాస్యమును పొందిన వాడను, రాముని అభిప్రాయములో నేను తమ్ముడను. కాని నేను అతనిని ప్రభువుగా భావిస్తున్నాను. అతని గుణములు నన్ను దాసునిగా మార్చినవని చెప్పినట్లుగా స్వామి యొక్క గుణవిశేషములకు వశపడి కైంకర్యము నందే శ్రద్ధ కలిగిన పరిజనములను ఇంతవరకు తెలియజేసిరి.

పరమయోగి వాఙ్మనసా పరిచ్ఛేద్య స్వరూప స్వభావ స్వాభిమత వివిధ విచిత్రానన్త భోగ్య భోగోపకరణ భోగస్థాన సమృద్ధ అనంతాశ్చర్యా అనంత మహావిభవ అనంత పరిమాణ నిత్య నిరవద్య నిరతిశయ శ్రీవైకుంఠనాథ!

నిత్యసూరుల చేత భోగ్యభూతమై, కైంకర్యము స్వీకరించుటకు తగిన స్వరూపమును ఇంతకు ముందు చెప్పి, ఆకైంకరయమును పెంపొందించుటకు తగిన విశేషములతో కూడిన పరమపదమును గూర్చి ఇకపై తెలియజేయుచున్నారు.

పరమయోగి వాఙ్మనసా పరిచ్ఛేద్య స్వరూప స్వభావ వరకూ ప్రత్యేక వాక్యముగా తీసుకొని దీనిని ప్రత్యేక సంబోధనగా చెప్పువారునూ కలరు.

పరమయోగిః — ముక్తానాం లక్షణం హ్యేతచ్ఛ్వేతద్వీప నివాసినామ్ అని చెప్పినట్లుగా సనకాది పరమయోగులు

వాఙ్మనసాః — వాక్కు చేతను, మనస్సు చేతను

అపరిచ్ఛేద్యః — పరిచ్ఛేదింప శక్యము కాని

స్వరూప స్వభావః — స్వరూపము, స్వభావము కలది

పంచోపనిషణ్మయమై, శుద్ధ సత్త్వమయమైనది పరమపదము, వైకుంఠ గద్యలో

దివ్యపురుషైర్మహాత్మభిరాపూరితే, తేషామపి ఇయత్పరిమాణమ్, ఇయదైశ్వర్యమ్, ఈదృశ స్వభావమితి పరిచ్ఛేత్తు మయోగ్యే అన్నట్లుగా పరబ్రహ్మ స్వరూపమును దర్శించిన శ్వేత ద్వీపములో ఉన్న పరమయోగులు చేతనూ శ్రీవైకుంఠము యొక్క స్వరూపమును, స్వభావమును పేర్కొనుటకు, తలంచుటకు కూడ వీలుకానిది.

పంచోపనిషణ్మయమైనది కనుక ఒకటే ద్రవ్యమన వీలుకాదు, అనేక ద్రవ్యములతో కూడి ఉండుటచే అది నిత్యమనుటకు వీలులేదు. అవస్థాంతరమును పొందదు కనుక పరిణామ శీలమని చెప్ప వీలుకాదు. భగవత్సంకల్పముచే మార్పు కలది కనుక ఏకరూపమని చెప్పుటకు వీలుకాదు. అందువలన పరమయోగులు కూడ జ్ఞానమంతా వెచ్చించినా ఇటువంటిదని నిర్ణయించుటకు శక్యము కాని విలక్షణ స్థానము ఆ శ్రీవైకుంఠము.

స్వాభిమతః — తనకభిమతమైన

వివిధ విచిత్ర : నానావిధమైన

అనంత : అంతము లేని

భోగ్య భోగోపకరణ భోగస్థాన సమృద్ధి :

అనుభవ యోగ్యములు, అనుభవ సాధనములు, అనుభవ దేశ విశేషములచే సమృద్ధమై ఉండు

భోగ్యములనగా : అప్రాకృతములైన శబ్దాది విషయములు

భోగోపకరణములనగా : తాను ధరించు పూలమాలలు, సేవించు పరిజనము మొదలగునవి

భోగస్థానములనగా : అప్రాకృతములైన రత్నమయ మండపములు మొదలగు దేశ విశేషాలు వీటితో సమృద్ధమై ఉన్నదా శ్రీవైకుంఠము.

అనంతాశ్చర్యః మితిలేని ఆశ్చర్యముగల

ఎల్లప్పుడు నిత్యనూతనమై అనుభవింపదగినదై ఉండుటచే ఆశ్చర్యకరమై ఉండును.

అనంత మహావిభవః ఉద్యానవనములు, తటాకములు మొదలైనవి లెక్కలేనన్ని ఉండుట చేత అనంతమైన సంపద కలది.

అనంత పరిమాణః హద్దులేని విస్తారమైన పరిమాణము కలది

నిత్యః ఎప్పటికి ఏకరూపమై

నిరవద్యః హేయ ప్రత్యనీకమై

నిరతిశయః అన్ని విధముల చేత అతిశయించిన

శ్రీవైకుంఠనాధః శ్రీవైకుంఠమునకు నాధుడైనవాడా!

కుఠిగతి ప్రతిఘాతే అని ధాతువు. జ్ఞానమును అడ్డగించు కర్మ ప్రసంగము కూడ లేని నిత్యసూరులు వికుంఠులు అనుబడుదురు. వారి సంబంధముచే వైకుంఠ శబ్దము ఏర్పడినది. అప్రాకృత స్థానమిది.

ఏకాంతినః సదా బ్రహ్మద్యాయినో యోగినశ్చ యే
తేషాంతు పరమం స్థానం యత్తత్పశ్యన్తి సూరయః
గత్వా గత్వా నివర్తంతే చంద్ర సూర్యోదయో గ్రహాః
అద్యాపి న నివర్తంతే ద్వాదశాక్షర చింతకాః

శరణాగత నిష్ఠులు, బ్రహ్మచింతనలో నిమగ్నమై యుండు యోగిజనులు దేనిని దర్శించవలెనని కోరుదురో ఆ పరమస్థానమును నిత్యసూరులు దర్శించుచున్నారు.

పుణ్యము చేసిన వారు చంద్ర సూర్యాది లోకములకు వెళ్ళిననూ వెనుకకు మరలక తప్పదు. కాని ఎవరు ద్వాదశాక్షర చింతకులో వారు మోక్షప్రదము నుండి వెనుకకు మళ్లరు అని విష్ణుపురాణములో చెప్పినటువంటిదీ శ్రీ వైకుంఠము.

తమసః పరమో ధాతా శంఖ చక్ర గదాధరః

తమోమయమగునది ప్రాకృత మండలము. దాని కంటె ఆవల ఉండునది. సృష్టికి ముందుండునది శ్రీవైకుంఠము. దీనిని గూర్చి తమసః పరస్మాత్ రజసః పరాకే అని శ్రుతి చెప్పుచున్నది. అక్కడ వైకుంఠములో ఉన్నవాడు తమస్సు కంటె పరుడు. అంతటా వ్యాపించి యుండు వాడు. వైకుంఠములో ఉండుట ఎట్లని సందేహము కలుగునని శంఖ చక్ర గదాధరః అనిరి. ఆ రూపముతోనే శ్రీవైకుంఠములో ఉండెడి దివ్యసూరులకు ముక్త పురుషులకు దర్శనమొసగుచుండును.

నాధః ఈశ్వరుడు, నియమన సమర్థుడు

ఈ దివ్యదేశములో భగవంతుని యొక్క ఐశ్వర్యము ఆయన కూడ తెలియజేయుట ఆశక్యము అని భావము.

స్వసంకల్పాను విధాయి స్వరూప స్థితి ప్రవృత్తి స్వశేషతైక స్వభావ ప్రకృతి పురుష కాలాత్మక వివిధ విచిత్రానంద భోగ్య భోక్తృవర్గ భోగోపకరణ భోగస్థాన రూప నిఖిల జగదుదయ విభవ లయలీల

ఇప్పటి వరకూ అప్రాకృతమైన నిత్య విభూతిని గూర్చి అందు వేంచేసియున్న వైకుంఠనాధుని గురించి తెలియచేసిరి. ఇక మీదట ఆ వైకుంఠమునకు ప్రతిద్వంద్వియయిన, ఆయనకు లీలా రసమునకు హేతువైన లీలావిభూతిని గూర్చి తెలియజేయచున్నారు.

స్వసంకల్పానువిధాయిః తన ఉద్దేశముననుసరించి వర్తించుచున్న

స్వరూప స్థితి ప్రవృత్తిః స్వరూపము, స్థితి, ప్రవృత్తులు కలదై

స్వశేషతైక స్వభావః అనన్యార్హ శేషత్వమే స్వభావముగా కలదై

ప్రకృతి పురుష కాలాత్మకః ప్రకృతి. చేతనము, కాలము ఇవే రూపములుగా కలదై

ప్రకృతి పురుషుడు కాలము ఇవియే జగత్తై ఉండుటచే ప్రకృతి పురుష కాలాత్మక అనిరి. వీరి యొక్క స్వరూపము. స్థితి, ప్రవృత్తులు భగవంతునకు అధీనములై, అతనికే శేషభూతమై ఉన్నవి.



ప్రకృతి : ప్రకృతి యొక్క స్వరూపము సత్వాది గుణములతో కూడిన జడత్వము

స్థితిః చేతనులకు భోగ, మోక్ష సాధనానుష్ఠానములకు, ఫలానుభవములకు స్థానమిది

ప్రవృత్తిః భోగ్య భోగోపకరణ భోగస్థానములుగా పరిణమించుట

పురుష : సంసారి చేతనులకు స్వరూపము అచిత్తుతో కూడిన ఆకారము (సంకుచితమైన జ్ఞానము కలిగియుండుట)

స్థితిః అన్నాదులచే నిలబడుట

ప్రవృత్తి : పుణ్యపాప రూపమైన కర్మానుష్ఠానము, తత్ఫలానుభవము

కాలః కాలము యొక్క స్వరూపము అచిత్వము

స్థితి : చేతనా చేతనములు యొక్క పరిణామమును నిర్వహించుట

ప్రవృత్తిః నిమేష కాలకాష్ఠాది రూపములతో ఉత్పత్తి వినాశాదులు కల్గి ప్రవర్తించుట.

వివిధ విచిత్రః పలు విధములుగను, విచిత్రములుగను

అనంతః అంతము లేని

భోగ్య భోక్తృ వర్గ భోగోపరకరణ భోగ స్థాన రూపః

అనుభవించుటకు యోగ్యమైన, అనుభవించువారు, అనుభవించు సాధనములు, అనుభవించదగు ప్రదేశములు స్వభావముగా కలదై ఉన్న.

విచిత్రమనగాః శబ్ద స్పర్శాది రూపముగా వైవిధ్యము, వాటిలో మరల అంతర భేదముచే విచిత్రము.

నిఖిల జగదుదయ విభవ లయలీలః

సకల జగత్తును సృష్టించుట, స్థితి, సంహారములు, క్రీడగా కలిగినవాడా! ప్రయోజన నిరపేక్షముగా ఈ జగద్వ్యాపారమును ఎందుకు చేయుట? అన్న దానిని నిరసనము చేయుటకు లీల శబ్దమును వాడిరి.

వ్యక్తం విష్ణుస్తధాయుక్తం పురుషః కాల ఏవచ
క్రీడతో బాలకస్యేవ చేష్టాం నిశామయ

అని చెప్పినట్లుగా భగవంతుని యొక్క లీలగా ఈ జగద్వ్యాపారము జరుగును.



బ్రహ్మసూత్రములో లోకవత్తు లీలా కైవల్యమ్ అని ఉన్నది. అనగా అవ్యాప్త సమస్త కాముడు, పూర్ణుడు ఐన సర్వేశ్వరుడు కేవలము విలాసము కొరకై సంకల్ప మాత్రముచే ఈ జగత్తును సృజించెను. ఒక భూమండలాధిపతియగు చక్రవర్తి పరాక్రమవంతుడైననూ విలాసార్థము బంతులాడుట మొదలగునవి చేయునట్లే పరబ్రహ్మమునూ లీలగా ఈ సృష్టి, స్థితి,లయలను చేయుచున్నాడు అని తెలియజేయుటకు లీల పదము వాడబడెను. వీటి వలన ఈ లీలా విభూతి అంతయూ లీలగా కలిగిన వాడని తెలియచున్నది.

సర్వేశ్వరుని శ్రీపాదముల నాశ్రయించుటకు ఉపేయ రుచి అనగా పొందబడు వస్తువు నందు ప్రీతి, ఉపాయ అధ్యవసాయము అనగా ఆయనే మనకు ఆ ఫలమును అందించువాడు అను విషయమందు దృఢమైన నమ్మకము ఉండవలెను.

అవి పొందుటకు మొదటి చూర్ణికలో అమ్మవారి యొక్క శ్రీపాదముల నాశ్రయించిరి. రెండవ చూర్ణికలో ఆమె అనుగ్రహ విశేషము వలన వాటిని పొందిరి. తరువాత ఆశ్రయింపబడవలసిన వారెవరనగా కారణంతు ధ్యేయః అని చెప్పునట్లుగా కారణమైనదేదో దానినే ధ్యానించవలెను. ఈ సకల జగత్తునకు కారణభూతమైన నారాయణుడే ఆశ్రయింపబడువాడు అని అఖిలహేయ అనే చూర్ణికలో నార శబ్దముచే తెలియజేయబడు సకల జీవ పదార్థములకూ ఆశ్రయైన దివ్యాత్మ స్వరూపమును చెప్పి తరువాత స్వరూప గుణములకు ప్రకాశము కలిగించు దివ్య మంగళ విగ్రహమును తెలియజేసి, ఆ విగ్రహమునకు అలంకారమైన దివ్యాభరణములను చెప్పి, వీటన్నిటికీ రక్షణగా ఉన్న దివ్యాయుధ వర్గమును చెప్పి, ఈ భోగములన్నిటినీ అనుభవించు దివ్య మహిషులను తెలియజేసి, ఆ శ్రీ భూ దేవులతో కూడియున్న భగవానుని అనుభవించి సేవించి స్తోత్రము చేయుచున్న దివ్య పరిజనమును తెలియజేసి కైంకర్యమును వర్ధిల్లజేయు నిత్య విభూతిని అనగా శ్రీవైకుంఠమును తెలియజేసి తరువాత ఈ సృష్ట్యాది క్రీడలకు విషయమైన లీలా విభూతి నాధత్వమును తెలియజేసిరి.



ఇక ఆశ్రయించుటయే ఉన్నది. ఆ ఆశ్రయణమునకు ఉపయోగపడు గుణములను (అపార కారుణ్య ....) చెప్పుటకు ముందు ఎనిమిది సంబోధనలతో ప్రస్తుతిస్తున్నారు. మనకు ఆయనయే ఉపాయము. ఆయనయే ఉపేయము అను విషయములో ధృడమైన విశ్వాసము ఏర్పడి వానినే శరణుజొచ్చుటయే ప్రపత్తి అందురు.

అనన్య సాధ్యే స్వాభీష్టే మహావిశ్వాస పూర్వకమ్ ।
తదేకోపాయతా యాఞ్చాప్రపత్తిః ॥

వేరొక, దాని వలన సాధింపబడని, మహావిశ్వాసముతో కూడియున్న తన కభీష్టరూపమైన, తదేకోపాయత్వమును కోరుటే ప్రపత్తి యందురు.

సత్యకామ సత్యసంకల్ప పరబ్రహ్మభూత పురుషోత్తమ
మహావిభూతే శ్రీమన్నారాయణ శ్రీవైకుంఠనాథ

ఇందులో ఎనిమిది సంబోధనలను వాడిరి

సత్యకామ, సత్యసంకల్ప, పరబ్రహ్మభూత అను మూడు సంబోధనలు లీలా విభూతి వర్ణించు వెనుకటి చూర్ణికతో అన్వయించుచున్నవి. తాను ఏది తలచిననూ దానిని నెరవేర్చుగలవాడు కనుక వివిధ విచిత్ర సృష్టిని చేయగలిగి, చేయదలిచిన వాటిని చేసి ముగించుట సత్య సంకల్పము.

సృష్టించిన జగత్తునంతయూ సక్రమ పద్ధతిలో పరిపాలించి వాటి ప్రయోజనములను సమకూర్చగలిగినవాడు, అన్నిటికన్న బృహత్వము కలవాడు కనుక ఆయన పరబ్రహ్మ భూతుడు.

ఈ ప్రకృతిని జీవులను తన ఆధీనములో ఉంచుగొన గలిగినవాడు, పురుషోత్తమ, నారాయణ అను సంబోధనలు గుణ చూర్ణికతో అన్వయిస్తాయి.

పురు సనోతీతి పురుషః అధికముగా ఇచ్చువాడు పురుషుడు. జీవుడు కూడ పురుషుడే అయిననూ ప్రకృతి ఆవరణ వల్ల సత్యకామత్వాల అతనికి మరుగుపడుతాయి. పరిపూర్ణముగా ఇవ్వలేడు. కాని పరమాత్మ పురుషోత్తముడు. ఈ జీవులకు సమస్తమునూ అందించగలవాడు కనుక సమస్త గుణ పరిపూర్ణుడు స్వామియే అని గుణ చూర్ణికలు సూచించు చున్నవి. నారాయణ అను పదము సర్వజీవులకాధారమైనవాడు.

సర్వజీవుల యందు తానుండు వాడు అని తెలియజేయుట చేత వాత్సల్యాది గుణములు తెలియజేయబడును. అందుచే ఇది కూడ గుణ చూర్ణికతో అన్వయింపబడును.

మహావిభుతే శ్రీవైకుంఠనాధ అన్నవి నిత్యవిభూతిలో అన్వయించుచున్నవి. విభూతి అనగా ఐశ్వర్యము. లీలా విభూతి ఒక వంతు, నిత్య విభూతి మూడు వంతులు కనుక ఆ మహావిభూతియైన పరమపదమును తమ ఐశ్వర్యముగా కలవాడు అని ఆ వైకుంఠమునకు ప్రభువైనవాడు అని తెలియజేయుచున్నది. శ్రీమన్ అను సంబోధన మహిషీ చూర్ణికతో అన్వయించుచున్నది. శ్రీ అనగా లక్ష్మీ, లక్ష్మీ కలవాడు అనునది తెలియజేయు ఈ సంబోధనము మహిషీ చూర్ణికకు అనుబంధముగా ఉన్నది.

సత్యకామ ః తలచినవెల్ల నెరవేర్చగలిగియుండువాడా! వెనుక సత్యకామ అనునపుడు ఆశ్రయించు వారికి అనుభవించదగినది అని తమకిష్టమైనదైన విభూతిని చెప్పారు. ఇక్కడ లీల కొరకై ప్రకృతి, పురుష, కాలములను తనకిష్టమైనవిగా స్వీకరించువాడును అర్థమును తెలియజేయుచున్నారు. వెనుక కోరుకొను విషయమును చెప్పినారు. ఇప్పుడు కోరిక చెప్పినారు.

కామ శబ్దము –

అని నిఘంటువు. కామ శబ్దము మన్మధుని, ఇష్టమైన దానిని (కోరుకొను వానిని) తెలియజేయుచున్నది. ఇచట సత్య శబ్దము నిత్యవాచి. సృష్టికి విషయమైన పురుష సమూహము. ఆ సృష్టింపబడిన చేతనులకు భోగస్థానరూపమైన ప్రకృతి. ఈ రెండింటిని కర్మానుగుణముగా నడిపించుటకు తగిన కాలము ఈ మూడు భగవంతుని సృష్టికై కోరుకొనదగినవి. ఈ జగత్సృష్ట్యాదులు బ్రహ్మాదులకు తపస్సు చేసి పొందవలసినవి. కనుక భోగరూపముగా ఉండును. ఈశ్వరునకది లీల కనుక ఐచ్ఛికమై ఉండును. ఈ సృష్టి జీవులకు బంధకము, వినాశ హేతువు. ఈశ్వరుని మరపించి అనర్థాల్ని కలిగించేది. ఇటువంటి దానిని, ఆయన లీల, ఆయనకిష్టమైనది అని అనవచ్చునా? మనకు అనర్థమైనది ఆయనకు ఇష్టమగునా? అని సందేహము.



ఈ సృష్టిలో శుకోముక్తః వామదేవోపిముక్తః అన్నట్లుగా ఒకరిద్దరు ముక్తులై ఉత్తమ స్థితిని పొందుట వలన ఆ విధముగనే ఈ జీవవర్గమంతా తరించునను ఆశతో ఈ సృష్టి భగవంతుడు చేయుచున్నాడు. అందువల్లనే మరల మరల ఈ జగత్తును నశింపజేయుచూ, సృష్టించుచూ, తన ప్రయత్నమును కొనసాగించుచున్నాడు. ఒక పొలము ఎంతో కాలమై పంట పండనిదై ఉండగా దానిని దున్ని, నీరు పెట్టి ఒకనాటికైనా ఫలించదా అని ప్రయత్నించే రైతులా భగవంతుడు చేసే కృషే ఈ సృష్టి.

**సత్య సంకల్పః** తలచినట్లెల్ల చేసి చూపించిన వాడా! లీలకు హేతువైన సంకల్పము కలవాడు, ఆశ్రయించువారికి అనుభవించుటకు తగిన అపూర్వ భోగములను సృష్టించగలిగిన వాడు.

ఇచట సత్య శబ్దం అమోఘవాచి బ్రహ్మ మొదలగు వారి సంకల్పము అమోఘమైనది కాదు. ఒక్కొక్కసారి వ్యర్థమగుచుండును. బ్రహ్మ సనకాదులను సృష్టించి వారిని ఈ జగత్సృష్టికి కారణభూతులుగా నియమించ సంకల్పించి వారిని ఆదేశించెను.

కాని వారు మేము ముముక్షువులము మాకు సృష్టి కార్యము తగదు అని దూరమైనాడు.

అట్లే తాను సృష్టించిన అసురులే వేదములను అపహరించినపుడు ఆ పరమేశ్వరుని దగ్గరకు చేరి వేదా మే పరమం చక్షుః అని మొరపెట్టెను. అట్టిది కాదు స్వామి సంకల్పము.

ఈ సత్యకామ, సత్య సంకల్పము లింతకు ముందే తెలియ జేయుబడుటచే ఇది పునరుక్తి కాదా? అన్నచో అచట గుణముల ఉనికిని మాత్రమే తెలియజేసిరి. కాని ఇచట ఆ గుణములు సృష్టికి ఉపయోగపడునని చెప్పుటచే పునరుక్తి దోషము లేదు.

**పరబ్రహ్మభూతః** ప్రళయకాలములే ప్రకృతి, జీవ విశిష్టుడై తానే ఉన్నప్పుడు బహుస్యాం ప్రజామేయ అని అన్కముగా అగుదును గాక అని సంకల్పించి జగదాకారముగా పరిణమించుటచే బ్రహ్మము తెలియజేయబడుచున్నది. స్థూల చిదచిద్విశిష్ట బ్రహ్మమే కార్యమైన ఈ జగత్తు.



పురుషోత్తమః పురుషుల యందుత్తమా!

ఇందు పురుషులని బహువచనము వాడుటచే బద్ధ, ముక్త, నిత్యుల కన్న అధికుడు పరమాత్మ అని తెలియుచున్నది.

పురుషుడు, ఉత్ పురుషుడు, ఉత్తర పురుషుడు, ఉత్తమ పురుషుడు.

పురుషుడనగాః అచిత్తుకన్న వేరైన వాడు అనగా బద్ధ చేతనుడ

ఉత్ పురుషుడనగాః బద్ధుల కన్న ప్రత్యేకత కలిగిన ముక్త పురుషులు అనగా లీలా విభూతిలో ఉండి భగవదనుగ్రహముచే పరమపదము నందిన వారు.

ఉత్తరపురుషుడనగాః ముక్తుల కన్న వేరైన నిత్యులు. అనగా లీలా విభూతి సంపర్కమే లేని వారు.

ఉతమపురుషుడుః వీరి కన్న ప్రత్యేకత కలిగిన సర్వేశ్వరుడు

బద్ధులనగాః హేయమే రూపుదాల్చినవాడు

ముక్తులనగాః ఒకప్పుడు హేయములున్నవారై దాని నుండి వేరై శుభ్రపడినవారు.

నిత్యులనగాః హేయరహితులు

వీరు హేయ రహితులే కాని హేయ ప్రతిభటులు కారు.

అనగా వీరికి హేయముండదు కాని, వీరు హేయతను పోగొట్టగలిగిన వారు కాదు.

సర్వేశ్వరుడు ఈ చేతనములలో అంతరాత్మగా ఉన్నప్పటికి వాటి హేయత తన కంటక ఉండగలిగిన వాడు. ఆశ్రితుల యొక్క హైన్యతను పోగొట్ట గలిగిన వాడు. దీని వల్ల జగత్తులో వ్యాపించుట దానిని భరించుట, దానికి స్వామియై ఉండుట అను ప్రత్యేకత కలవాడు పురుషోత్తముడు అని తెలియుచున్నది.

మహావిభూతేః వెనుక విభూతిని చెప్పేరు. మరల చెప్తారు. ఇప్పుడు చెప్తున్నారు. ఇది పునరుక్తి కాదు. వెనుక విభూతి కలవాడని చెప్పేరు. అనన్య ప్రయోజనులైన వారికి ఆ విభూతిని అందించగలడని ఇప్పుడు చెప్పుచున్నారు. ఇది విభూత్యౌదార్యం. తరువాత దాస్యాన్ని స్వీకరించటానికి అనువైన ప్రదేశమని మహావిభూతిని తెలియజేసారు. అందుచే పునరుక్తి దోషము లేదు.

శ్రీమన్: భగవానుడు ఈ అనన్య ప్రయోజనులకు అందించే దేశములో ఉండే భోగ్య విషయములను వివరిస్తున్నారు. ఇక్కడ శ్రీనారాయణులిద్దరూ కలిసే దాస్యాన్ని స్వీకరిస్తారు.

వైకుంఠేతు పరే లోకే శ్రియా సార్ధం జగత్పతిః అని చెప్పబడినట్లుగా లక్ష్మీ విశిష్టుడై పరమపదంలో నారాయణుడు వేంచేసి ఉంటాడు కనుక ఆ విభూతి దర్శనమే భోగ్యమైనది. కనుక శ్రీమచ్ఛబ్దం భోగ్యతను తెలియజేస్తోంది.

నారాయణః: అనంతమైన మంగళ గుణాలతో కూడిన, ఏ కొరతా లేని శ్రీమన్నారాయణుడే మన కైంకర్యమును స్వీకరించువాడని తెలియజేస్తోంది. శ్రీమన్నారాయణ అనుటచే ఆ మిథునమే మనకు పొందవలసిన తత్త్వమని తెలుస్తున్నది.

శ్రీవైకుంఠనాథః: దాస్యము స్వీకరించుటకే తగిన పరమపదమునకు ప్రభువై ఉండి మన దాస్యము స్వీకరించువాడు ఆ శ్రీమన్నారాయణుడే కనుక వైకుంఠనాథా అనిరి.

అపార కారుణ్య సౌశీల్య వాత్సల్యౌదార్యైశ్వర్య సౌన్దర్య మహోదధే! అనాలోచిత విశేషాశేషలోక శరణ్య! ప్రణతార్తిహర! ఆశ్రిత వాత్సల్యైక జలధే! అనవరత విదిత నిఖిల భూత జాతయాథాత్మ్య! అశేష చరాచర భూత నిఖిల నియమన నిరత! అశేష చిదచిద్వస్తు శేషిభూత! నిఖిల జగదాధార! అఖిల జగత్స్వామిన్! అస్మత్స్వామిన్! సత్యకామ! సత్యసఙ్కల్ప! సకలేతర విలక్షణ! ఆర్థికల్పక! ఆపత్సఖ! శ్రీమన్నారాయణ! అశరణ్యశరణ్య! అనన్య శరణస్త్వత్పాదారవిన్ద యుగళం శరణమహం ప్రపద్యే.

ఇప్పటి వరకూ ఆశ్రయింపబడవలసిన వానిని తెలియజేసి ఇక మీదల ఆశ్రయించుటకు ఉపయోగపడు గుణములను తెలియజేయుచున్నారు.

కారుణ్యము, సౌశీల్యము, వాత్సల్యము, ఔదార్యము, ఐశ్వర్యము, సౌందర్యము మొదలైన కల్యాణ గుణాలన్నీ అపారముగా కలిగినవాడు.

అపారకారుణ్యః: కారుణ్యమంటే కృప, పరదుఃఖాసహిష్ణుత్వమ్ అనగా ఇతరుల యొక్క దుఃఖాన్ని చూచి సహించ లేకపోవుట. ఇది అపారము, తప్పక దండింపబడవలసిన వాని విషయములో కూడ ఈ కారుణ్యము మనకి కనిపిస్తుంది.





వధార్హమపి కాకుత్థ్సః కృపయా పర్యపాలయత్ తల్లి సీతమ్మను హింసించిన కాకాసురుడు వధించుటకు తగినవాడే అయిన కృపతో కాకుత్థ్సుడు వానిని రక్షించాడు.

గచ్ఛ అనుజానామి రణార్థితతస్త్వమ్ యుద్ధములో చేతికి దొరికిన రావణాసురుని తిరిగి లంకకు వెళ్ళి పరికరములతో రమ్మని అనుజ్ఞ ఇచ్చిన కారుణ్యమూర్తి.

సౌశీల్యః న్యూనాధికత్వ దర్శన జనితా ఉ వజ్ఞా సాధ్యస సంహారార్థ ఇహ సౌశీల్యోక్తిః దేవ, మనుష్య అవతారములలో వలె మత్స్య కూర్మాద్యవతారములలో కూడ తానూ వాటిలో ఒకటిగా అయి నిర్విశేష నీరంధ్రమును చూపించెను.

విష్ణుపురాణములో అహంవోబాంధవో జాతః నేను మీ బంధువును అని చెప్పినట్లు, రామాయణంలో ఆత్మానం మానుషం మన్యే అని తనను మనుష్య మాత్రునిగా అవతార పరిసమాప్తి వరకూ మానవులతో సమానంగా ప్రవర్తించుటచే ఆయన సౌశీల్యము తెలుస్తున్నది.

వాత్సల్యః ఆశ్రయించిన వారి విషయములో దోషాన్ని కూడ భోగ్యంగా స్వీకరించుట వాత్సల్యం. రిపూణామపి వత్సల అని శత్రువుల విషయములో కూడ ఆయన వాత్సల్యం విదితమౌతున్నది.

ఔదార్యః అర్థిషు ఉదారత్వవచన హేతుభూత అర్థిత ప్రదానే స్వప్రయోజనాభి సంధిమత్త్వం ఔదార్యమ్ కోరిన వారికి వారి స్వరూపానికి అనురూపాలైన అపేక్షితాల్ని తీర్చేటప్పుడు ఆ ఇచ్చుటకు ప్రయోజనము తనకే అనునట్లు ఇచ్చుట.

ఐశ్వర్యః అనగా నియంతృత్వం. అనాదికాలము నుండి స్వరక్షణమే వృత్తిగా గల జీవుల్ని ఏదో ఒక వ్యాజంతో తన చేత నియమింపబడుటకు అభిముఖంగా చేయు శక్తి ఇక్కడ ఐశ్వర్యమని చెప్పవచ్చు. ఇది అపారము.

సౌందర్యః ఈ సంసారుల యొక్క చిత్తములను తనకు వశమగునట్లు చేయుటలో ఉపాయంగా సౌందర్యాన్ని చూడవచ్చు. విరుద్ధ ప్రకృతులు కలిగిన శూర్పణఖ మొదలగు వారి విషయములోను, సాత్విక ప్రవృత్తి కలిగిన ఋషుల విషయములలోను, దృష్టిని చిత్తమును అపహరించి వారికి తనమీద ప్రీతి కలిగించునట్టి సౌందర్యము కలవాడు.

సందర్శనాధకస్మాచ్చ పుంసాం సంమూఢ చేతసామ్ కువాసనా కుబుద్ధిశ్చ కుతర్క నిచయశ్చయః కుహేతుకశ్చ కుభావశ్చ నాస్తికత్వం లయం వ్రజేత్

ఇది అర్చావతార విషయములో చెప్పబడ్డది, మూఢులైన ఈ చేతనులు సర్వ దుర్లక్షణములూ కలిగిన వారు అకస్మాత్తుగా స్వామి యొక్క సందర్శము చేత వారిలో ఉన్న నాస్తికత్వము పోవును. ఆ సందర్శనమే అంతటి ఫలమును కలుగచేయును.

మహోదధేః ఇట్టి గుణములకు సముద్రము వంటి వాడా!

అనాలోచిత విశేషశేషలోక శరణ్య ప్రణతార్తి హరః

జన్మ వృత్త, జ్ఞానములందు హెచ్చు తగ్గులను ఆలోచింపక ఎట్టి వారైన వచ్చి ఆశ్రయించుటకు అనుకూలంగా సర్వలోకములకూ శరణ్యమై వెలసిన వాడు. సర్వ లోక శరణ్యాయ రాఘవాయ మహాత్మనే రాముడు తనను నమ్మి చేరిన వారెవ్వరైనా అట్టివారికందరికీ శరణమొసగుటలో సమర్థుడు. శరణమని చేరినవారు ఏ కులము వారైనా, విద్యా విహీనులైనా, నడువడి లేనివారైన తారతమ్యము చూడకుండా శరణము అనుటయే చాలునని అందరినీ రక్షించు స్వభావము కలవాడు రాముడు. ఇచట విశేష అనే శబ్దము చేత జన్మ వృత్త గుణ తారతమ్యం తెలియ జేయబడుతోంది. గీతలో సర్వస్య శరణం సుహృత్ అని సుహృదం సర్వభూతానాం అని చెప్పినట్లుగా ఆయనే శరణ్యుడు.

ఏకః కృష్ణ నమస్కారో ముక్తి తీరస్య దేశికః

కృష్ణునికి చేసే ఒక్క నమస్కారము ముక్తి అంచుకి తీసుకువెళ్ళే గురువు అన్నట్లుగా అల్పయత్నంతో సాధింపబడునది అని తెలియ జేయబడుచున్నది. అనాలోచిత విశేషం యదా తథా అశేషాణాం లోకానం శరణ్య అనుట. ప్రణతార్తిహరుడనగా ఆశ్రయించిన వారి దుఃఖాల్ని తీర్చేవాడు అని. ప్రపన్నార్తిహరం విష్ణుం ప్రపన్నుల యొక్క ఆర్తిని తీర్చువాడు విష్ణువే కదా!

ఆశ్రిత వాత్సల్యైక జలధే

మిత్ర భావేన సంప్రాప్తం దోషోయద్యపి మొదలైన వాటివల్ల స్వామి యొక్క వాత్సల్య గుణం తెలియజేయబడుతోంది. ఆశ్రయించిన వారి తప్పులను చూడక వానిని భోగ్యముగా స్వీకరించుటయే వాత్సల్యం. ఆ గుణమునకు సముద్రమైన వాడా! అని సంబోధిస్తున్నారు.



ఆశ్రయణ అర్హతను చెప్పి, ఆశ్రయించిన వారి యొక్క ఆర్తిని తీర్చువాడా అని చెప్పి, దానికి ప్రధానంగా కావలసిన వాత్సల్యాన్ని ఇప్పుడు తెలియజేసారు.

అనవరత వదిత నిఖిలభూత జాత యథాత్మ్యః

సకల పదార్థముల యొక్క యథార్థ స్థితిని పరిపూర్ణముగా తెలిసికొనినవాడా! ఆయనను శరణు పొందుటకు మనము అకించనులము. అనన్యగతి కులము అవవలెను. ప్రాతికూల్య నివర్తనము, అనుకూల్య సంకల్పము ఉండవలెను. కురుష్వ మాం అనుచర లక్ష్మణుడు రామచంద్ర ప్రభువును నన్ను నీతో కూడి ఉండువాననిగా చేసుకొమ్మని ప్రార్థించాడు. అనుచరుడనగా అతనితో కలసి సంచరించువాడు. నా స్వరూపము నీకు అనుచరుడిగా ఉండిననే నిలచి ఉండును. నా అంత నేను నీకు అనుచరుడిగా ఉండజాలను. నీవే నన్ను అనుచరునిగా చేసుకొనవలెను అని ఇట్లు ప్రార్థన చేయవలెను. కాని అట్లు చెప్పవలసిన అవసరము లేకనే అతడే తెలుసుకొనగల సమర్థుడు, సర్వజ్ఞుడు.

అశేష చరాచర భూత నిఖిల నియమన నిరత ః

జంగమ స్థావరాత్మకమైన సకల పదార్థముల యొక్క సర్వ ప్రకార నియమనము (శాసించుటను) చేయుటకు సమర్థుడా! బంధింపబడు జీవుడు, బంధకమైన ప్రకృతి – ఈ రెండింటి యందు భేదము లేక శాసింపగల సమర్థుడు.

అశేష చిద చిద్వస్తు శేషిభూత ః

ఇట్లు రక్షించుటకు మనలో అనుకూల్య భావమును పెంచి, ప్రాతికూల్యమును తగ్గించి తన దగ్గరకు చేర్చుకొనుటకు ఏమి ప్రయోజనము? ఆయన సకల చేతనా చేతనములకు శేషి అయినవాడు. శేషి కనుక మన కైంకర్యములను స్వీకరించవలసిన బాధ్యత ఆయనదే. అది ఆయన యొక్క కార్యము.

నిఖిల జగదాధార ః సకల జగత్తునకు ఆధారమైనవాడా!



అఖిల జగత్స్వామిన్ః సకల జగత్తునకు నాథుడా!

భగవద్భాగవత విషయములో అపరాధము చేసిన వారికి ఆధారం ఎవరూ లేరా అని భయపడవలసిన అవసరము లేకుండా వారికి ఆ అపరాధములను పోగొట్టి అభిముఖ్యమును కలిగించువాడు ఆయనే అనునట్లుగా అఖిల జగత్స్వామిన్ అని వాడినారు. మదేక వర్జం కిమదం వ్రతం తే – విభీషణుని అనుగ్రహించు సమయమును స్వామి ఒక ప్రతిజ్ఞను చేసెను. తనను ఆశ్రయించిన చేతనుని, సర్వ భూతములకూ రక్షణ నిచ్చి ఏలుకుంటాను అని చేసిన ప్రతిజ్ఞకు నన్ను తప్ప అని ఏమైనా ఒక నియమమున్నదా! అని యామునులు ప్రశ్నించినట్లుగా ప్రశ్నించవలసిన అవసరము లేకుండా ఆయన నాకు ప్రత్యేకముగా స్వామి అని అనుచున్నారు.

అసత్స్వామిన్ః నాకు స్వామియైన వాడా!

ఇంతకు ముందు శేషిత్వమును చెప్పారు. అది సంబంధ పరము, అక్కడ శేషి శేష భావమును తెలియజేసారు. ఇక్కడ అస్మత్స్వామిన్ అనుటలో సంబంధానుగుణమైన నియమనపరంగా వాడారు.

సత్యకామః అవాప్త సమస్త కాముడగు వాడా!

అకించనో ఽనన్య గతీ శ్శరణ్య అని చెప్పినట్లు అకించనుడైన వాని రక్షణమును పరిపూర్ణముగా చేయువాడు.

సత్యసంకల్పః అనాయాసముగా ఎవరి చేతనూ అడ్డగింపరాని విధముగా నెరవేరునట్టి సంకల్పము కలవాడు.

సకలేతర విలక్షణః చేతనా చేతనముల కన్న విలక్షణమైన వాడా! ఆశ్రితులకు అనుకూలమైన (అనుభావ్యమైన) స్వరూప రూప గుణములు కలవాడు. ఇతరులెవరూ ఆస్రితులకు అపేక్షితములు తీర్చేవారు కారు. అందరి కన్నా, అన్ని విధములా విశిష్టుడైనవాడు స్వామి,

విష్ణు పోతం వినా నాన్యత్కించిదస్తి పరాయణమ్

ఇట్లు వారికి అనుభవించుటకు తగినట్లుగా ఉండుట ఎందుకు? దానిలో ఆయనకు స్వార్ధమేమైనా ఉన్నదా ? అనగా ఆయనను అర్ధికల్పక అని సంబోధిస్తున్నారు.



**ఆర్థికల్పకః** కోరికలను కోరుకున్న వారికి కల్పవృక్షము వంటి వాడు. యాచకులకు కల్పవృక్షముగా ఉండువాడు అనీ, యాచకుడుగను, కల్పవృక్షముగను ఉండువాడు అని చెప్పవచ్చు.

ఉదారాస్సర్వ ఏవైతే అని భగవద్గీతలో కృష్ణపరమాత్మ చెప్పినట్లుగా ఆయనే సర్వులకూ అన్ని కోర్కెలూ ఈడేర్చువాడు.

**ఆపత్సఖః** ఆపద సమయములో తోడ్పడువాడు

సర్వరక్షకుడు ఆయనే, తల్లిదండ్రులు, బంధువులు కూడ వదలివేసిన స్థితిలో ఆయనే రక్షించువాడు స్తోత్రరత్నములో

రఘువర యదభూస్త్వం తాదృశో వాయసస్య
ప్రణత ఇతి దయాళుర్యస్య చైద్యస్య కృష్ణ

రామావతరమున భూమిపై పడినదని కాకాసురుణి దయాళుడవై రక్షించితివి. అపరాధములు చేసిన శిశుపాలునికి దివ్యమైన సాయుజ్యము నిచ్చితివి అన్నట్లుగా అందరకును రక్షకుడు ఆయనే. 1)విశ్వసనీయత 2)స్నేహ విషయమును సూచించుచున్నట్లుగా సఖ శబ్దము ప్రయోగించారు. శత్రువుల విషయములో ఇది మనము చూచుచున్నాము. ఇష్టమును చేకూర్చుట, అనిష్టమును నివారించుట రెండునూ మనము ఈ ఆపత్సఖలో చూడవచ్చు. వీనికి కారణము ఆయన శ్రీమన్నారాయణుడు అగుట.

**శ్రీమన్నారాయణః** పురుషకార భూతురాలైన లక్ష్మీదేవితో ఎప్పుడూ కూడి ఉండేవారు అనేది శ్రీమన్ అనే శబ్దం చేత తెలుస్తోంది. ఈమె పురుషకారము చేయుటకు ముందే తాను సృష్టి చేసి ఈ జీవులలో అను ప్రవేశము చేసి వాటిని నిలబెట్టినవాడు. ఆధారమైనవాడు అని తెలియజేస్తూ నారాయణ అను పదము వాడబడినది.

**అశరణ్య శరణ్యః** వేరొక రక్షకులు లేని వారికి రక్షకుడైనవాడు.

**అనన్య శరణ్యః** ఇతరమైన దిక్కులేని వాడనైన నేను.

పత్తిలార్ పత్త నిన్నానే పట్టు లేని వారికి పట్టు. ఈ స్వామి. వేరొక ఉపాయము లేని వారికి తానే ఉపాయమౌతాడు అని ఆళ్వార్లు సూచించారు.



త్వత్పాదారవింద యుగళం శరణమహం ప్రపద్యేః

నీయొక్క శ్రీపాదములను ఉపాయముగా నేను పట్టుకొనుచున్నాను. ఇక్కడ అహం అనే శబ్దం ప్రయోగించడం చేత ఉపాయాంతర శూన్యత్వం. అపాయ భీరుత్వం, అతి శంకరాహిత్యత్వం, ప్రయోజనాంతర తదుపాయ పరిత్యాగిత్వం, మోక్షార్థ ప్రపత్యున్ముఖత్వం సూచింపబడ్డాయి. త్వత్ శబ్దం చేత ఇప్పటి వరకు చెప్పిన స్వామి యొక్క యోగ్యత తెలియుచున్నది.

ఇక ఆవశ్య కర్తవ్యం పాదగ్రహణమే. ఆ పాదములు అరవింద శబ్దము చేత భోగ్యత్వము కూడ సూచింపబడినది. యుగళ శబ్దము చేత పాదద్వంద్వం సూచింపబడినది. ఇప్పటి వరకూ ద్వయమంత్రము నందలి శ్రీమన్నారాయణ చరణౌ శరణం ప్రపద్యే అనే పూర్వ ఖండము పూర్తిగా వివరింపబడినది. ఇక మీదట ఉత్తర ఖండమూ యొక్క వ్యాఖ్యానం ఉంటుంది.

అత్రద్వయంః ద్వయ మంత్రమును ఇట అనుసంధించుకొనవలెను. అర్థముతో అనుసంధానము చేయవలెనని కాని, మంత్రమునే అనుసంధానము చేయవలెను అని కాని చెప్పవచ్చును. మన పెద్దలు ఈ చోట ద్వయ మంత్రమును తమకు మాత్రమే వినిపించునట్లు అనుసంధానము చేయుట చూచుచున్నాము.

పితరం మాతరం దారాన్ పుత్రాన్ బన్ధూన్ సఖీన్ గురూన్, రత్నాని ధనధాన్యాని క్షేత్రాణి చ గృహాణి చ సర్వ ధర్మాంశ్చ సంత్యజ్య సర్వకామాంశ్చ సాక్షరాన్, లోకవిక్రాన్తచరణౌ శరణం తే ఉ వ్రజం విభో

తమరు చేయు శరణాగతిలో ఏమైనా లోపమున్నదా అని పురాతన పురుషులు పాటించిన శరణాగతి ప్రక్రియను తెలియజేసిన వచనములను ముందుంచుకొని శరణాగతిని చేయుచున్నారు. పూర్వులు తెలియజేసిన వానిలోని భావములే కాక వారి పలుకులు కూడ తలుచుకొనుట వల్ల భగవంతుని అనుగ్రహము కలుగును. మనకు ఇచట ఒక శంక కలుగవచ్చును.

శరణాగతిని మరల మరల చేయవలెనా?

పునః పునః ప్రపద్యతే అనే శంక అవసరము లేదు. ఇది పూర్వులు తెలియజేసిన వచనములను మరల మరల తలచుకొనుటయే జరుగుచున్నది. ఈ శ్లోకము పూర్వార్ధములో చేతన పదార్ధములను అనగా తండ్రిని, తల్లిని, భార్యను, కుమారులను, బంధువులను, స్నేహితులను, గురువులను తెలియజేసిరి. ఉత్తరార్ధములో అచేతనమైన రత్నములను ధన ధాన్యములను, భూములను, ఇండ్లను, సకల ధర్మములను వదలిపెట్టుట చూపిరి. ఇవి అన్నీ ఉపాయాంతర సహకారులుగను, స్వయంగా ప్రయోజనం కలవి కనుక ఉపేయముగను కన్పట్టును. తల్లి తండ్రి మొదలైనవారు భగవంతుని సహాయము లేక తమంత తాముగా బిడ్డలకు రక్షకులు కారు. కావున వారికి వేరొక ఉపాయము అవసరము. భగవద్రామానుజులు అట్టి వారిని కాదని సాక్షాత్తు ఉపాయమైన నారాయణునే స్వీకరించదలచి వీటిని వదలుట తెలియ జేయుచున్నారు.

హే విభో = ఓ స్వామీ!,
పితరం మాతరమ్ దారాన్ = తండ్రిని, తల్లిని, భార్యను,
పుత్రాన్ బంధూన్ సఖీన్ = కుమారులను, బంధువులను, స్నేహితులను,
గురూన్ = శాస్త్రోపదేశము చేసిన గురువులను,
రత్నాని ధనధాన్యాని = రత్నములను, ధనధాన్యములను
క్షేత్రాణి చ గృహాణి చ = భూములను, ఇండ్లను,
సర్వ ధర్మాంశ్చ = సకల ధర్మములను,
సర్వకామాంశ్చ = సకల కామ్య పురుషార్ధములను,
సాక్షరాన్ = కైవల్యమును,
సంస్త్యజ్య = విడిచిపెట్టి
తే = నీ యొక్క,
లోక విక్రాంత చరణౌ = లోకములన్నింటినీ కొలచిన శ్రీపాదములను
శరణం వ్రజ = శరణుజొచ్చినాను.

మాతృదేవోభవ, పితృదేవోభవ, ఆచార్యదేవోభవ అని శాస్త్రములు విధించుచుండగా వాటిని వదలుచున్నాను అని శాస్త్ర విధి తెలిసిన భగవద్రామానుజులు ఇట్లు అనుట న్యాయమేనా? దారాన్ – స్త్రీలను

సహధర్మానుచారిణిగా మన ధర్మాచరణములో తోడు పడుచుండగా ఆమెను వదులుట ఎట్లు? పుత్రుడు -

పున్నామ్నో నరకాత్త్రాయత ఇతి పుత్రః

అనగా పున్నామ నరకము నుండి కాపాడువాడు పుత్రుడు కదా! వానిని వదలుట ఎట్లుః అని అనుమానము వచ్చును. భగవద్రామానుజులు తాము ఆచార్యులను వదిలిపెట్టిన వారు కాదే. యధార్థముగా వదిలిపెట్టదగిన ధన ధాన్యములతో పాటు వీటిని కూడ చెప్పుట ఎట్లు పొసగును' పై వాటిని వదిలిపెట్టుట వారితో విరోధపడి వదలుట కాదు. కామ్యమునకో, అర్థమునకో ఉపయోగపడుదురు అని వారిని స్వీకరించ కుండుటయే ఇచట త్యాగము.

కొణ్డ పెణ్డీర్ మక్కళు త్తార్ శుత్తత్తవర్ పిఱరుమ్

తిరువాయ్ మొళిలో స్వీకరించిన భార్యను, బిడ్డలను, బంధువులను, జ్ఞాతులను వదలిపెట్టునట్లు ఉపదేశించిరి. వీరందరు ఏదో ఒక ప్రయోజనము ఉంటేనే ప్రేమిస్తారు. తప్ప అవసరము లేకపోతే వీరెవరూ దగ్గరగా కూడ రారు. కాని ముక్తికి ముఖ్యకారణము ఆచార్య సంబంధమే కదా! అట్టి ఆచార్య సంబంధమును ఇట విడుచుచున్నాను అని చెప్పుటలో అర్థమేమిః ఆ తిరువాయ్ మొళిలోనే ఫలశ్రుతిని చెప్పునప్పుడు ఈ పది పాశురములను అభ్యసించువారే మనకు ప్రాప్యులు అని మరల తెలియజేసిరి. ఒకచోట వదల వలెనని, మరియొకచోట వారే ప్రాప్యులని, ఏ భావముతో ఆళ్వార్లు, తెలియజేసిరో అదే భావమును ఇచట కూడ గ్రహించవలెను. తల్లిదండ్రులను, ఆచార్యులను, పుత్ర మిత్రాదులను అన్నింటిని భగవద్విభూతిగా తలచుటయే ఇచట మనము అర్థము చేసుకొనవలెను. వీరు భగవద్భాగవత అనుభవ విరోధులైనచో వారలను వదిలిపెట్టవలెను.

స్వ ధర్మాంశ్చ — ధర్మశబ్దముతో ఉపాయరూపమైన కర్మయోగాదులు తెలియజేయబడు చున్నవి.

సర్వకామాన్ — స్వర్గలోకాధిపత్యము, బ్రహ్మ లోకాధిపత్యము మొదలైన బ్రహ్మైశ్వర్య పర్యంతము తెలియజేయబడుచున్నది.

సాక్షరాన్ ఆత్మ మాత్రానుభవం. అనగా కైవల్యము

సంసృజ్యసమ్యక్ త్యక్త్వా సువాసనగా వదిలిపెట్టుట లేక లజ్జా పురస్సరంగా వదలుట.

లోక విక్రాంత విభు శబ్ధములచే సౌలభ్యం పరత్వము తెలియజేయబడుచున్నవి. వారందరి శిరస్సులపై ఆ శ్రీపాదములను ఉంచుటచే వాత్సల్యము సూచింపబడుచున్నవి.

శీలాది గుణములతో కూడిన జ్ఞాన శక్త్యాది గుణపూర్ణుడైన ఆ స్వామి శ్రీపాదములే మనకు ఉపాయమని తెలియజేయబడుచున్నది.

తే లక్ష్మీ సంబంధము అనుసంధానము చేయవలెను.

చరణౌ ఒక రూపము తెలియజేయబడుచున్నది.

శరణం ఉపాయ భావము చెప్పబడుచున్నది. ఇక మీదట ఈ వదిలిపెట్టిన విషయములన్నీ ఆ స్వామే అని చెప్పుచున్నారు.

త్వమేవ మాతా చ పితా త్వమేవ ।
త్వమేవ బంధుశ్చ గురుస్త్వమేవ ।
త్వమేవ విద్యా ద్రవిణం త్వమేవ ।
త్వమేవ సర్వం మమ దేవదేవ ॥

ఇంతకు ముందు శ్లోకములో వదిలి పెట్టినట్లు చెప్పినవన్నీ భగవంతుడే అని ఈ శ్లోకములో చెప్పుచున్నారు.

దేవ దేవా! = దేవతలకు దేవుడైన వాడా!,

మమ = నాకు,

త్వమేవ మాతా = నీవే తల్లివి,

పితా త్వమేవ = నీవే తండ్రివి,

త్వమేవ బంధుశ్చ = బంధువును నీవే,

గురుస్త్వమేవ = జ్ఞానోపదేశము చేయు గురువునూ నీవే,

త్వమేవ విద్యా = ఉపదేశించబడు జ్ఞానమును నీవే,

ద్రవిణం త్వమేవ = ధనము నీవే,

త్వమేవ సర్వం= సమస్తము నీవే భగవంతుడు ప్రియమునే కోరువాడు కనుక తల్లిగాను, హితమును కోరువాడు కనుక తండ్రిగానూ చెప్పారు.



ప్రళయ దశాయాముదరే స్థాపయిత్వా ప్రసనవాత్

శరణం — మాతా ప్రళయదశలో ఉదరంలో ఉంచుకొని రక్షించి, మరలా సృష్టి చేయుటచే తల్లి తెలియజేయబడుచున్నది.

త్వమేవ — నీవే యనగా నీ పాదములే అని గ్రహించవలెనని అందురు.

త్వమేవ బంధుశ్చ — సకల విధ బంధువులు చేయు ఉపకారముల నన్నింటిని చేయువాడు ఆ భగవంతుడే అంతరాత్మగా ఉండి నడిపించువాడు కనుక ఆయనే బంధువు. అంధకారమును తొలగించువాడు కనుక గురు శబ్దముచే తెలియజేయుచున్నారు. సకల వేదములను సకల శాస్త్రములను అనుగ్రహంచినవాడు ఆయనే.

లక్ష్మీనాథ సమారమ్భాం మన ఆచార్య పరంపరలో వారే ప్రథమాచార్యులు

త్వమేవ విద్యా — ఉపదేశింపబడు జ్ఞానము కూడ నీవే.జ్ఞాన ప్రతిపాద్యమైన విషయమూ నీవే.

ద్రవిణం త్వమేవ — ద్రవిణం అనగా ద్రవ్యము, భోగానికి ఉపకరణమై ఉండునది. ఇచట భోగోపకరణము పరభక్త్యాదులు. అవి అన్నియూ నీవే అనుట.

త్వమేవ సర్వం చెప్పదలచిన సంబంధములన్నీ నీవే.

దేవ దేవ అయర్వఋ మమరర్ కళదిపతి ఆయనే

అమరులనగా మరణము లేని వారు. భగవదనుభవమందు విస్మృతి కలుగుటయే మరణము. అట్టి మరణము లేని వారు నిత్య సూరులు. వీరిలో మరల రెండు తెగల వారున్నారు. ఒకరు నిత్యులు. వేరొకరు ముక్తులు. వీరిద్దరికినీ విస్మృతి లేదు.

ఒకరికి భగవద్విస్మృతి ఎన్నడునూ లేనే లేదు. వేరొకరికి సంసారములో ఉన్నంత కాలము భగవద్విస్మృతి ఉండి తర్వాత నశించినది నిత్య సూరులు సర్వేశ్వరునితో సమానమైన గుణములు స్వరూపము కలిగి ఉందురు. కానీ లక్ష్మీదేవి ఎవరి వక్షస్థలముపై ఉన్నదో ఆయనే నారాయణుడు. సర్వేశ్వరునితో సమానులు చాలా మంది ఉండి తానొక్కడైననూ అధిపతి అయిన స్వామి వారికి కూడ అందని పైవాడు.

దేవ దేవ అయర్వఖ మమరర్ కళధిపతి ఆయనే

దీనిచే ఉపాయము - పరమాత్మను పొందు సాధనము,

ఉపేయము - పొందదగిన వస్తువు

పరమాత్మ రెండూ నీవే అన్నీ సర్వవిధ సంబంధములూ ఆయనతోనే అని తెలియజేసినారు.

పితాఽసి లోకస్య చరాచరస్య,
త్వమస్య పూజ్యశ్చ గురుర్గరీయాన్
న త్వత్సమో ఽస్త్యభ్యధికః కుతో ఽన్యో,
లోకత్రయేఽప్యప్రతిమ ప్రభావ!
తస్మాత్ప్రణమ్య ప్రణిధాయ కాయం,
ప్రసాదయే త్వా మహమీశ మీఢ్యమ్ ।
పితేన పుత్రస్య సఖేవ సఖ్యుః,
ప్రియః ప్రియాయార్హసి దేవ! సోఢుమ్ ॥

త్వమేవ మాతా చ పితా త్వమేవ

తనకొక్కనికే తల్లి తండ్రి అనునట్లు ఈ సంబంధము అందరకు సమానమే అని తెలియజేయుచు ఇప్పుడు చెప్పుచున్నారు.

అప్రతిమ ప్రభావః అసమానమైన ప్రభావము కల ఓ స్వామీ! అని సంభోదించుచున్నారు.

పితాసి లోకస్య చరాచరస్యః

జంగమ స్థావర రూపమైన ఈ ప్రాణి సమూహమున కంతకును ఉత్పాదకుడవు నీవే

త్వమస్య పూజ్యశ్చః అందరికినీ పూజ్యతముడవు, పూజార్హుడవు నీవే

గురుర్గరీయాన్ః అజ్ఞానమును పోగొట్టు శ్రేష్ఠుడైన ఆచార్యుడును నీవే.

గరీయాన్ బ్రహ్మదః పితా బ్రహ్మను అందించినవాడే పూజ్యతముడైన తండ్రి.

గరీయాన్ ఆయన యొక్క పూజ్యతకు అవధి చెప్పబడినది.

లోకత్రయే అపి బద్ధ ముక్త నిత్య చేతన వర్గము అని కాని లేక కృతక, అకృతక, కృత కాకృతక లోకములని కాని చెప్పవచ్చును.

సత్వత్సమోఽస్తి నీతో సమానుడు లేదు.

అభ్యధిక కుతః అస్యః సమానుడే లేనప్పుడు అధికుడైనవాడు ఎట్లు ఉండును?

సత్వత్సమో౽స్తి అనుటచే అన్యులెవరునూ నీకు సములు లేరు అని తెలియుచుండగా మరల అన్య శబ్దమును వాడుట ఎందులకు అని అనుమానము వచ్చును.

త్వదన్య అని దానికి అన్వయము చేసి చెప్పవలెను. అనగా నీ కంటె అన్యుడెవడునూ నీకు సముడు లేడు అనుటచే నీకు నీవే సముడవు అని అర్థము.

గగనం గగనాకారం సాగరస్సాగరోపమః ।
రామరావణయోర్యుద్ధం రామరావణయోరివ ॥

అని రామాయణంలో రామ రావణ యుద్ధాన్ని వర్ణించినట్లు నీకు నీవే సాటి వేరొకటి చెప్పుటకు అవకాశము లేదు.

ఒత్తారై మిక్కారై ఇలైయాయవిరే

సములు అధికులు లేనివాడు ఆ సర్వేశ్వరుడే అని చెప్పుచున్నారు. అప్రతిమ ప్రభావ అని చెప్పి, మరల నీకు సముడు లేడు అనుటలో ఈ మూడు లోకములలో నీ కంటే వేరొకరు కారుణ్యాది గుణములలో ఏ గుణమును బట్టి కాని నీకు సమానుడు లేడు అని తెలియుచున్నది.

భగవద్రామానుజులు ఇంతకు ముందు తాను చేసిన శరణాగతికి ఇక్కడ క్షమాపణ కోరుచున్నారు. ఇది తనను బట్టియా! లేక భగవంతుని బట్టియా? అని చూచిన తనను బట్టియే అని తెలియుచున్నది.

అనాది కాలము నుండి అపరాధములు చేసి మూట కట్టుకొని ఈనాడు ఆయన వైపు అభిముఖ్యము కలుగగనే రక్షించుటకు ఆయన నుండి లోటు లేదు.

రిపూణామపి వత్సలః శత్రువుల విషయమున కూడ వాత్సల్యమును చూపును.

అనన్యార్హ శేషభూతులమైన మనము అపరాధములను చేసి చేసి ఇప్పుడు వచ్చి నన్ను క్షమించుము, నీవే శరణు అనుట అది అపరాధమే కాదు





శేషత్వహాని అని తలచి అపరాధ క్షమాపణను కోరుచున్నారు. ఆనాడు శరణు కోరుట ఏమి? మరల ఈనాడు క్షమించమని కోరుట ఏమి?

అనగా ఆనాడు కాకాసుర వృత్తాంతములో మొత్తము మూడు లోకములు తిరిగి తిరిగి ఎవరూ రక్షకులు కారు అని తెలుసుకొని తమేవ శరణం గతః అని ఆ కాకాసురుడు రాముని పాదముల వద్ద శరణు కోరినట్లుగా వేరొక దిక్కులేని వారము కనుక శరణాగతి చేయవలెను. పూర్వ పాపాల్ని తొలగించుటకు శరణాగతి చేయవలసినదే.

రక్షణ తనకు విధి విహితమని భావించు పరమాత్మకు రక్షణ విషయమును కొత్తగా నేర్పినట్లు రక్షించమని ప్రార్థించుట తగని పని అని అనిపించును. అందువల్ల నేను శరణాగతిని చేయుచున్నాను అనుట కూడ భయహేతువు కనుక మరల క్షమాపణ కోరుట కూడ తగినదే.

తస్మాత్ః (ఇంతకు ముందు త్వమేవ అనుచోట చెప్పినట్లు సకల విధ బంధుత్వములు నీతోనే అగుట వలన).

ఒక్క భార్య భర్త సంబంధము మాత్రమే ఉన్నచో అది ఒక నియమమునకు లొంగి యుండును కాని సకల విధ బంధుత్వములు ఆయనతోనే కనుక ఏ రకమైన అపచారమైన క్షమాపణ కోరుటకు తగియున్నది.

ప్రణమ్యః నమస్కరించి, మానసికముగా నమస్కారమర్పించి

ప్రణిధాయకాయంః శరీరముతో దండ ప్రణామము చేసి, ఇట్లు మానసిక శారీరక సమర్పణ సూచింపగనే వాచికము కూడా దానిలోనే ఇమిడి ఉన్నది. అందుచే త్రివిధకరణములతో అనగా కాయిక, వాచిక, మానసిక వ్యాపారములచే ఆయనను శరణు కోరుట తెలియుచున్నది.

ప్రసాదయేః ప్రసన్నునిగా చేసుకొనుచున్నాను. ఎవరినుట్లే ప్రసన్నునిగా చేసుకొనుచున్నది.

ఈశమీడ్యం త్వాంః సర్వ నియామకుడు స్తోత్రార్హుడు అగునట్టి నిన్ను, భక్తివలె ప్రపత్తి కూడ ఆయనను ప్రసన్నునిగా చేసుకొనుటకు ఉపయోగపడును. ఇచ్చట భగవద్రామానుజులు కోరునది

మదిష్ట విఘాత అనిష్ట ప్రాప్తి హేతు భూత మత్కృత అపరాధ జనిత అప్రీతిరూప కాలుష్య రహితం కరోమి

అని అనగా నాకు ఇష్టమైనది కలుగకుండా అనిష్టమైనది పొందేలా చేసే నా చేత చేయబడిన అపరాధములచే కలిగిన అప్రీతి రూపమైన కాలుష్యమును నివారింపుము అని కోరిరి.

అనగా నాకు ఎప్పుడు నీపై ప్రీతి కలిగియుండేలా అనుగ్రహించమని ప్రార్థించారు. ఇది ఎవరు చేయవలెను?

త్వాం — నీవు అనగా సర్వభూతములకు

సుహృత్ — అయినవాడవు., కానీ నా అపరాధముల చేత నీవు కూడా కలుషితమైన బుద్ధి కలవాడవు అగుదువు. అట్టి నీవు.

అహంః — నేను అనన్యార్హ శేషభూతుడనై ఉండి అపరాధములను చేసి ఇప్పుడు వచ్చి శరణు కోరిన వాడను.

ఈశంః — అపరాధులను కూడ నిగ్రహించిన సామర్థ్యము కలవాడవు. అపరాధములను ఎందుకు సహించవలెను.

పితేవ పుత్రస్య సఖేవ సఖ్యుః

అపరాధము చేసిన పుత్రుని మరల ప్రార్థించినప్పుడు తండ్రి ఎట్లు క్షమించునో చెలికాడు చేసిన తప్పులను చెలికాడు ఎట్లు సహించును.

ప్రియ ప్రియాయార్హసి దేవ సోఢుం – పరమ కారుణికుడవైన నీవు ఇష్టుడనైన నా యొక్క సమస్త అపరాధములను సహించి క్షమింపదగుదువు.

ప్రియః ప్రియా యార్హసి

అనుచోట ప్రియురాలి తప్పులు ప్రియుడు సైచినట్లు అని కూడ చెప్పుకొనవచ్చును.

ఈ శ్లోకములో ప్రణమ్య అనగా శరణ వరణము చేసి అని ప్రపత్తిని తెలియజేసిరి.

ఈ ప్రపత్తికి అంగములుగా చెప్పబడు అనుకూల్యతా సంకల్పము. ప్రాతికూల్య వర్జనము, రక్షించునని నమ్మకము, రక్షింపుమని ప్రార్థించుట, ఆత్మ సమర్పణము, నైచ్యాను సంధానము అను ఆరు అంగములు కలవు.

అవి పూర్వ శ్లోకము నందలి పితృత్వ, గురుత్వాదులను జ్ఞాపకము చేయు తస్మాత్ అను పదము చేత అనుకూల్యతా సంకల్పము.

సత్వత్సమో .... అనుటచే ప్రాతికూల్య వర్ణనము ఈశమీధ్యం అనుటచే రక్షించినను విశ్వాసమును, ప్రసాదయే అనుటచే రక్షింపుము అను ప్రార్ధన, అహం అనుటచే నైచ్యాను సంధానము పితేవ ఇత్యాదులచే ఆత్మ సమర్పణము తెలుపబడుచున్నవి.

మొదటి చూర్ణికలో ప్రాప్య రుచి కలుగుటకు పొందించువాడు ఆయనే అను నమ్మకము కలుగుటకు లక్ష్మీదేవి అనుగ్రహములకు శరణుజొచ్చిరి. రెండవ చూర్ణికలో ఆమె అనుగ్రహమును పొంది ఆపై ఉభయ విభూతి నాధత్వము చెప్పి, ఆశ్రయించుటకు తగిన శీలాది గుణములను స్మరించి, అమ్మవారి పురుషకారముతో శరణు వేడిరి. తరువాత ఇతిహాస పురాణ ప్రక్రియ రూపముగా శరణు కోరిరి.

సకృదేవ ప్రపన్నాయ — ఒక్కసారి శరణు కోరిన చాలును కాని ప్రాప్యత్వరచే మరల శరణు కోరుచున్నారు.

కర్మ — కర్మ వలన అజ్ఞానము, అజ్ఞానము చేత దేహ సంబంధము వరుసగా ఏర్పడును. ముందుగా కర్మను తెలియజేయుచున్నారు. ముందుగా అనిష్టాలు తొలగితే కాని ఇష్ట ప్రాప్తి జరుగదు. అందువల్ల నమశ్శబ్దార్ధాన్ని ముందుగా తెలియజేస్తున్నారు.

అనిష్టాలేమిటి? — దేహాత్మ భ్రాంతి మొదలైనవి. భగవత్కైంకర్యము చేస్తున్నపుడు నేను చేస్తున్నాననే భావము వరకు అన్నీ విరోధులే. ఈ విరోధులు తొలగాలంటే కర్మ నశించాలి. కనుక వీరు కర్మతో ప్రారంభించారు. ఆళ్వారు మాత్రం విరోధుల్ని చెప్పినప్పుడు అవిద్యతో ప్రారంభించేరు.

రామానుజులు కర్మను ఆళ్వార్లు అవిద్యను ముందుగా చెప్పడానికి కారణమేమనేది ప్రశ్న. ఆళ్వార్లది స్వానుభవం కనుక దేహాత్మానుభవం వల్ల కలిగిన అహంకారమే నలుగుడు పెడుతోందనే భావనతో అవిద్య ముందుగా చెప్పేరు. భగవద్రామానుజులు కూడ స్వానుభవమే ఐనా వీరు ఒక దర్శన వ్యవస్థాపకులవడం వల్ల మన దర్శనానికి కర్మ ప్రాధాన్యం ముఖ్యము కనుక కర్మతో మొదలు పెట్టేరు

మనోవాక్కాయై రనాదికాల ప్రవృత్తానన్తాకృత్యకరణ, కృత్యాకరణ భగవదపచార, భాగవతాపచార సహ్యాపచారరూప నానావిధానన్తాపచారాన్ ఆరబ్ధకార్యాన్ అనారబ్ధకార్యాన్ కృతాన్ క్రియమాణాన్ కరిష్యమాణాంశ్చ సర్వానశేషతః క్షమస్వ ॥

కర్మను చేయుటకు పరికరములు ఈ మనస్సు, వాక్కు, కాయము, ఇవి భగవంతుని వలననే లభించినది. కాని వీటిని అనర్థములు పొందుటకు ఉపయోగించుచున్నాము.

మన ఏవ మనుష్యాణాం కారణం బంధ మోక్షయోః

సర్వానిష్టములకు ఇష్ట విఘాతములకు కారణము కర్మ కనుక దాని నివృత్తిని ఇచ్చుట కోరుచున్నారు.

అనాది కాల ప్రవృత్తః అనాది కాలము నుండి అనగా మొదలు తెలియని చాలా కాలము ముందరే కలిగిన.

అనంతః లెక్కలేని

అకృత్యకరణః చేయరాని పనులను చేయుట

శాస్త్ర విరుద్ధములైన కృత్యములను చేయుట అనగా శాస్త్రములో చేయరానివిగా చెప్పబడిన దుష్కృత్యములను చేయుట. ప్రాణులను హింసించరాదు అను విధి ఉండగా దాని నతిక్రమించి ప్రాణులను హింసించుట. ఈ పదార్థములు తినరాదు. అని ఉండగా వాటిని యధేచ్ఛగా తినుట, వీనిని అకృత్య కరణములు అందురు.

కృత్యాకరణః శాస్త్ర విహితములైన వర్ణాశ్రమ ధర్మాలను సోమరితనము చేత, ఇతర కారణముల చేత అనుష్టింపక విడుచుట.

శక్త స్యాతీవ దోషవత్ శక్తి ఉండి అనుష్టించినిచో దోషమును కలుగజేయునవి కృత్యాకరణములు.

భగవదపచారముః రామకృష్ణాద్యవతారములలో సజాతీయ బుద్ధి కలిగియుండుటయు, అర్చావతార విషయములో ఉపాదన స్మృతియు అనగా ఈ విగ్రహము దేనితో తయారు చేయబడినది అను ఆలోచనయు, పరమాత్మను దేవతాంతరములతో సాటిగా తలచుటయు ఇవి అన్నియూ భగవదపచారములుగా వచ్చును.

భాగవతాపచారములుః అర్థ, కామ అభిమానము నిమిత్తముగా తీసుకొని విష్ణు భక్తుల విషయములో వివాద పడుటయు, భక్తుల విషయములో జన్మ వృత్తాది విషయాలలో ఆక్షేపణము చేయుట.

అసహ్యాపచారముః అర్థకామాది విషయములు ఊతగా కాక హిరణ్యకశిపుని వలె భగవద్విషయమును, భాగవత విషయమును వినను, చూడన, ఓర్వక ఉండుట, పుత్ర వాత్సల్యమును కూడ మరచి నారాయణుడే అన్నియు అని పలికిన ఒక మాటను హేతువుగా తీసుకొని అగ్నితో దహించుట మొదలగు హింసలు పెట్టిన ఆ తండ్రి చేసిన కార్యములు అసహ్యాపచారములు. ఆచార్యుల విషయములో చేయు అపచారములు కూడ అసహ్యాపచారమే అనబడును.

భాగవతాపచారః భగవదపచారః । భగవదపచారః భాగవతాపచారః

భాగవత భక్త విషయాపచారః అసహ్యాపచారః

ఆచార్య విషయ అవరాధోవా అని శ్రుత ప్రకాశికాచార్యులు చెప్పిరి.

భాగవతులు యెడల చేయు అపచారము భగవదపచారమే అగును.

నానావిధ అనంత అపచారాన్ః

పలు విధములను అపరిమితములైన తప్పులను లెక్కించుటకు వీలులేని విధముగా చేసిన అపచారములను ఒక్కొక్క విధముగనే అసంఖ్యాకాలు. ఒక్కొక్క విధముగనే అనంతములు.

యద్బ్రహ్మ కల్ప నియతానుభవే వ్యనాశ్యం

తత్కిల్బిషం సృజతి జంతు రిహ క్షణార్ధే .....

అనేక బ్రహ్మ కల్పములు అనుభవించిననూ నశింపని పాపములను ప్రాణి అరక్షణములో చేయుచున్నాడు అని వైకుంఠ స్తవములో చెప్పినట్లుగా అపచారములు అనంతములు, అసంఖ్యాకములు.

ఈ వాక్యమున అనంత పదము, రెండు సార్లు వాడబడినది. మొదటి పదము అకృత్య కరణ, కృత్యాకరణ అపచారములలో అన్వయించును. రెండవ అనంత పదము భగవదపచారాదులలో అన్వయించును.

ఆరబ్ధ కార్యాన్ అనారబ్ధ కార్యాన్‌ః

మనము చేయు కర్మలు వెంటనే ఫలము నీయజాలవు. పరిపాక క్రమమునే ఫలమునిచ్చును. అట్లు ఫలము నీయుటకు సంకల్పింపబడిన కర్మములనే ప్రారబ్ధములు అందురు. వాటినే ఆరబ్ధ కార్యాన్ అని చెప్పిరి. ఇంకను ఫలము నీయకుండా ఉన్న కర్మలను అనారబ్ధ కార్యములు అని తెలియజేసిరి.

కృతాన్ క్రియమాణాన్ కరిష్యమాణాంశ్చః

కాలత్రయములందు చేయబడిన అపచారములు అనగా భూతకాలమునను, వర్తమాన కాలమునను, భవిష్యత్కాలమునను వ్యాపించి యుండు అపచారములు.

సర్వాన్‌ః అన్నిటిని, అన్ని విధములైన పాపములను చెప్పుటకు వీలుకాని సర్వపాపములను.

అశేషతః క్షమస్వః సువాసనగా పోవునట్లు మన్నించి అనుగ్రహించవలయును అని ప్రార్థించిరి. అపరాధాల్ని పూర్తిగా క్షాళనము చేయవలెనని తెలియచేయుటకు సర్వ శబ్దమును ప్రయోగించారు. కాని అపచారములు వైదిక కర్మల్ని ఆచరించుటకు అర్హతను పోగొట్టునవి కొన్ని, చేయు కర్మకు అడ్డంకులను కల్గించునవి.

కొన్ని పూర్వ జన్మల నుండి వాసనారూపమైన పాపములను కలిగించునవి కొన్ని ఉండును. వాటిలో మొదటి రెండు భగవానుని క్షమకు విషయములుగను, వాసనా రూపముగా వచ్చు పాపములు మాత్రము క్షమా విషయము కాకపోవచ్చు. కాని ఇది కూడ తమకు విషయమును చేసి అనుగ్రహించవలసిందిగా భగవత్ రామానుజులు ప్రార్థిస్తున్నారు.

అనాది కాల ప్రవృత్త విపరీత జ్ఞాన మాత్మ విషయం ।
కృత్స్న జగద్విషయం చ, విపరీత వృత్తం చ ।
అశేష విషయమద్యాపి వర్తమానం ।
వర్తిష్యమానం చ సర్వం క్షమస్వ ॥



ఇంతవరకు చేయకూడని పనులు చేయుట, చేయవలసిన పనులు చేయకుండుట మొదలైన అపరాధములు క్షమించమని కోరిరి. ఇప్పుడు విపరీత వృత్తము (నడవడి) చే చేయు అపరాధములు క్షమించమని కోరుచున్నారు. ఇంతకు ముందు కోరినదే మరల కోరినట్లు లేదా? అట్లు కాదు. అచట శాస్త్ర విరుద్ధమైన వాటిని అనుష్ఠించుట చేతను, విహితానుష్ఠానము చేయకపోవుట చేతను కలిగిన వృత్త హానిని చెప్పిరి. వేదాంత విషయ జ్ఞానము లేకపోవుట చేత కలుగు వృత్త హాని ఇందు చెప్పబడినది. అందుచేత పునరుక్తి దోషము లేదు.

అనాది కాల ప్రవృత్తః అనాది కాలము నుండి చేయుచూ పోయిన, ఆత్మ విషయము, కృత్స్న జగద్విషయము, ఆత్మను గురించియు, సమస్త జగత్తుకు సంబంధించినది.

విపరీత జ్ఞానమ్ః ఒక విషయములో మరొక రకమైన బుద్ధి కలుగుటయే విపరీత జ్ఞానమనబడును.

యధావస్థిత విషయ విరుద్ధాకర అవగాహి జ్ఞానమిహ విపరీత జ్ఞానమ్

తాడును చూచి పామను బుద్ధి కలుగుట. శుక్తిని రజతముగా భావించుట మొదలైనవి. ఈ విపరీత జ్ఞానము ఆత్మ యొక్క స్వరూపమే అన్నట్లుగా కనబడును.

ఇది ఒకనాడు వచ్చి చేరినది అని చెప్పుటకు కుదరదు. ఎప్పుడు వచ్చి చేరినదో తెలియదు. అనాదిగా ఉన్నది కానీ భగవంతుని అనుగ్రహము కలిగినపుడు ఈ విపరీత జ్ఞానము పోవుచున్నది. కనుక ఇది ఆత్మ యొక్క సహజమైన స్వరూపముకాదు అని తెలియుచున్నది.

ఆత్మ విషయములో విపరీత జ్ఞానము అనగా దేహాత్మాభిమానము, స్వతంత్రాత్మ భ్రమ, అన్యశేషత్వ భ్రమ మొదలగునవి.

జగద్విషయములో విపరీత జ్ఞానము అనగా దేవ, తిర్యక్, మనుష్య, స్థావర శరీరములను చూచి వాటిని అట్లే భావించుట. వాటి లోపల అంతర్యామిగా ఉన్న సర్వేశ్వరుని పర్యంతము జ్ఞానము వెళ్ళకపోవుట.




విపరీత వృత్తంచః విరుద్ధమైన అనుష్ఠానము

ఆత్మ విషయం కృత్స్న జగద్విషయం అనేవి విశేషణాలు. ఇవి విపరీత వృత్తం అను విశేష్యము నందు అన్వయించును. ఆత్మ విషయములో విపరీత వృత్తమనగా పరతంత్రుడైన తనను స్వతంత్రునిగా భావించి ప్రవర్తించుట.

జగద్విషయములో విపరీత విషయమనగా ఒకడు మనకు అపకారము చేసిన అది నా కర్మ ఫలము అనియో లేక కర్మలకు అనుగుణముగా ఈశ్వరుడు అనుగ్రహించిన ఫలమో అని తలచవలెను. కాని అట్లు తలచక నిమిత్త మాత్రుడైన ఆ చేతనుని (అనగా ఎవరి వలన అపకారము జరిగెనో అతని) విషయములో మనకు ఒక భావన కల్గును. స్వతంత్రత లేని అతనిని స్వతంత్రునిగా భావించి అతడే అపకారము చేసెనని తలచి వానికి అపకారము చేయుట.

అశేష విషయంః ఐశ్వర్యాది పురుషార్ధములను అపేక్షించుట

విపరీత వృత్తంచః ఇట్టి కామ్య కర్మలనన్నింటిని ఈ చూర్ణికలో తెలియజేసి ఇక స్వామిని ప్రార్థించుచున్నారు.

అద్యాపి వర్తమానం వర్తిష్యమాణం చః

ఇంతకు ముందు చేసిన విపరీత వృత్తములను ఇప్పుడు చేయుచున్న వానిని, ఇక ముందు చేయబోవు వానిని - ఇచట ఇంతకు ముందు చేసిన వాటినే కాక ఇక చేయబోవు వాటిని అనుట ఏల? ఆచార్య సేవ మొదలైన వాటి వల్ల శాస్త్ర జన్య జ్ఞానము కలిగినప్పటికి వాసనావశము వల్ల అనువర్తించుటను ఇచట తెలియజేసిరి.

సర్వం క్షమస్వః నేను జ్ఞానము లేని వాడను. నేను చేసిన అపరాధములనన్నింటిని నేను ఎరుగలేను. కాని సర్వజ్ఞులైన మీరు (అనగా రంగనాథా) అన్నింటిని తెలుసుకొని మన్నించి అనుగ్రహించవలెననిరి).





మదీయనాదికర్మ ప్రవాహ ప్రవృత్తాం భగవత్స్వరూప తిరోధానకరీం విపరీత జ్ఞాన జననీం, స్వవిషయాయాశ్చభోగ్యబుద్ధేర్జననీం దేహేన్ద్రి యత్వేన భోగ్యత్వేన సూక్ష్మరూపేణ చావస్థితాం దైవీం గుణమయీం మాయాం దాసభూతం శరణాగతోఽస్మి తవాఽస్మి దాసః ఇతి వక్తారం మాం తారయ.

సర్వానిష్టములకు మూలమైనది కర్మ. ఆ కర్మ నివృత్తిని మొదట చెప్పి వ కర్మ చేయుటకు కారణమైన అజ్ఞానాన్ని, దానివలన కోరుకొను కామ్య కర్మల నుండి రక్షించమనీ ప్రార్థించేరు. ఇప్పుడు వీటికి కారణమైన ప్రకృతి సంబంధ నివృత్తిని కోరుచున్నారు. మదీయ అని ప్రారంభించి.

వెనుక చూర్ణికలో క్షమస్వ అని చెప్పి ఈ చూర్ణికలో తారయ అని వాడారు. ఇట్లా వాడటానికి కారణమేమి?

కర్మ, అజ్ఞానము రెండు స్వామి యొక్క నిగ్రహ స్వరూపములు.

ఆయన మనసులో క్షమించెదను అని సంకల్పించగనే అవి నశించును.

కాని ఈ అచిత్తు నిత్యము కనుక నశించుట కుదరదు.

ఈ అచిత్తు ఈశ్వర విభూతిలోనిదే. ఇది నశించవలెనని ప్రార్థించుట భగవద్రామానుజుల అభిప్రాయము కాదు.

ఈ విభూతి ఇట్లే ఉండి తమను దీని నుండి దాటించమని ప్రార్థించుటయే ఇచట తారయ అనుటలో మనకు కన్పించుచున్నది.

పాలు, నీరు కలసి ఉన్నప్పుడు ఇవి పాలు, ఇది నీరు అని విడదీయుట సాధ్యము కాదు.

కాని ఇట్లు విడదీయుటకు శక్తి కలిగిన ఒక పరికరములో వానిని ఉంచిన సారతమమైన పాలను గ్రహించి పిప్పివలెనన్ను నీటిని వదిలి వేయదగినట్లుగా సర్వశక్తిమంతుడైన స్వామి మాత్రమే

ఈ ప్రకృతి సంబంధము నుండి ఉద్ధరించి రక్షించగలడు.

ఇచట మాయా స్వరూపాన్ని తెలియ జేయుచున్నారు.

భగవద్గీతలో కృష్ణ పరమాత్మ తెలియజేసినది ఇక్కడ అనుసంధించుకొనవలెను.

దైవీహ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా ।
మామేవ యే ప్రపద్యంతే మాయా మేతాం తరంతి తే ॥

దైవీ = దేవుడనగు నాచే లీలార్థము నిర్మింపబడినదియు,
గుణమయీ = సత్వరజస్తమోగుణ మయమైనదియూ అగు,
ఏషా = ఈ చెప్పబడిన,
మమ = నా యొక్క,
మాయా = ప్రకృతి,
దురత్యయా = అతిక్రమింప శక్యము కానిది.

ఇచట ప్రకృతి మాయా శబ్దముచే చెప్పబడినది. మాయా శబ్దానికి మిధ్య అని అర్థం కాదు. విచిత్ర కార్యకరమగుటచే మాయా అనబడుచున్నది. దాని నుంచి దాట గలుగుట ఎట్లు అనగా.

మామేవ = నన్నే,
యే = ఎవరు,
ప్రపద్యతే = శరణుజొచ్చుచున్నారో,
తే = వారు,
ఏతాం= ఈ గుణమయమును, నాదియును అయిన,
మాయా = మాయను,
తరంతి = దాటుచున్నారు. ఈ గీతావచనమును అనుసంధించియే,
తారయ= అని వాడిరి,
మదీయ = నా యొక్క.

ఈశ్వరునకు పక్షపాతముండునా? అందరూ ఆయనకు సమానులే కదా.
కనుకనే ఈశ్వరునకు వైషమ్యము నైర్ఘృణ్యము లేవు అనుటకు తగినట్లుగా మదీయ అనే పదాన్ని వాడారు.

అనాది కర్మ ప్రవాహ ప్రవృత్తాం॰

అనాది కాలము నుండి నేనొనర్చిన కర్మ పరంపరలచే కలిగినదై బీజాంకుర న్యాయము వలె కర్మ ప్రకృతి సంబంధము అనాదిగా ఏర్పడుతున్నది. మాయ చేసే కార్యమేమి అనేది తరువాత చెబుతున్నారు.

భగవత్స్వరూప తిరోధాన కరీం॰

భగవంతుని యొక్క నిజ స్వరూపమును తెలుసుకొననీయకుండా అడ్డగించునది, భగవంతుని మరచునట్లు చేయునది.

ఆయన స్వరూపమును తెలియకుండ చేయుట అనగానేమి?

శ్రియః పతి — పురషోత్తముడు, సమస్త కళ్యాణ గుణాకరుడు, దేవతలకు కూడా అధిపతి అయినవాడు, ఉభయ విభూతి నాధుడు అయినవాడు ఈశ్వరుడు. ఈ ప్రకృతి సంబంధము చేత అది నిర్విశేష చిన్మాత్రము అని అనిపించును. మిగిలినదంతయూ అపరమార్ధము అనిపించును.

చిదచిత్తులు — ఈశ్వరునికి శేషము, ఈశ్వరుడు శేషీ, ఈ భావన కలుగకుండా అగును. కర్మను చేయుటకు తానున్నాడు. కర్మ ఫలము అనుభవింపచేయుటకు కర్మ ఉన్నది. ఇక ఈశ్వరుడెందుకు? అనిపించును. ఇది ఇచట భగవత్స్వరూప తిరోధానకరీం లో చూపారు.

విపరీత జ్ఞాన జననీం॰విపరీత జ్ఞానమును కలిగించునది.

ఆత్మకాని దానియందు ఆత్మ అను బుద్ధి పుట్టించును. దేహమే నేను దేహమే ఆత్మ అను బుద్ధి పుట్టించును.

స్వవిషయాయాశ్చ భోగ్య బుద్ధే ర్జననీం॰

తన యొక్క కార్యములందు అనుభవింపవచ్చుననే బుద్ధిని పుట్టించునదియు.

దేహేంద్రియత్వేన, భోగ్యత్వేన, సూక్ష్మరూపేణ చావస్థితాం॰

భోగములు అనుభవించుటకు తగిన ఈ మానవ దేహ రూపముగను, ఈ భోగమును అనుభవించుటకు ఉపకరణములైన ఇంద్రియ రూపములుగను, భోగ్యమైన శబ్దాది రూపములుగను, వీటన్నింటికీ మూలమైన సూక్ష్మ ప్రకృతి రూపముతోను నాలుగు రకములుగ పరిణమించినదైనది.

దైవీం॰ — భగవంతునకు క్రీడా పరికరముగా చేయబడినదైన

గుణమయీం॰ — సత్వరజస్తమోగుణమయమైనది అగు ఈ చేతనులు పరిగ్రహించిన శరీరములు తమః ప్రచురములు, రజః ప్రచురములు, సత్వ ప్రచురములు అయి ఉండును.

మాయాం: విచిత్ర కార్యకరత్వము చేత మాయా శబ్దము వాడబడినది. ఏక ద్రవ్యము యొక్క పరిణామముగా పంచభూతములు ఏర్పడినవి. అవి అన్నియు ఒకదానికి ఒకటి భిన్న రూపములు కలిగినవి. భోగ్య భోగోపకరణ భోగ స్థానములుగా ఏర్పడి చిత్ర పటము వలె ఆశ్చర్యమును కలిగించును.

మాంతారయ: ఇటువంటి స్వభావము కలిగిన ప్రకృతి నుండి నన్ను ఉద్ధరింపుము అని కోరిరి. ఎందుకు తరింపచేయవలెను! అని రంగనాధుడు ప్రశ్న వేయగా దాసభూతః అని చెప్పిరి.

అనాది కాలము నుండి దుష్కర్మలే చేయుచున్నను దేహమే ఆత్మ అను స్వరూపము నిరూపించుకొనుటకు తమకు అనన్యార్హ శేషభూతుడను అని చెప్పిరి.

అందరి కార్యములు నేనే చేయవలెనా?

అని స్వామి ఎక్కడ ప్రశ్నించునో అని ఇంతకు ముందు చెప్పిన శరణాగతో౽స్మి తవా౽స్మి దాస అని చెప్పిరి.

స్వామి! మీరే ఉపాయము అనియూ, మీరే ఉపేయము అనియూ మీకే అనన్యార్హశేష భూతుడను అనియు చెప్పినట్లైనది.

వక్తారం మాం: ఈ విధముగా పలుకుచున్న వాడనగు నన్ను

తారయ: ఈ మాట మాత్రము చేతనే ఈ ప్రకృతిని తరించిన వాడనగునట్లు అనుగ్రహింపుము అని ప్రార్థించిరి.

తవా ౽స్మి దాసః అస్మి ప్రార్థనాభిప్రాయముతో ప్రయోగింపబడినదని భావించవలెను. దాస వృత్తి పరుడనై ఉండగలవాడను అని తెలియజేసిరి. నమః శబ్దము యొక్క అర్థము ఇక్కడ వివరింపబడినది.

శ్రీమన్నారాయణుని కొఱకే నా కొఱకు కాదు అని బోధించు నమః శబ్దము యొక్క అర్థమైన సర్వానిష్ట నివృత్తి ఇచ్చట ప్రతిపాదింపబడినది. ఇంతకు ముందు నమః శబ్దార్థాన్ని చెప్పేరు.

ఆ నమః శబ్దమునకు అర్థము విరోధి నివృత్తే కదా! ఆ విరోధి నివృత్తి జరిగిన తరువాత కావలసినది ఇష్టప్రాప్తి పరమ పురుషార్థ లక్షణ కైంకర్య సిద్ధి కావలెను.

తేషాం జ్ఞానీ నిత్యయుక్త ఏకభక్తిర్విశిష్యతే ।

ప్రియో హి జ్ఞానినో ఽత్యర్థమహం స చ మమ ప్రియః

ఉదార స్సర్వ ఏవైతే జ్ఞానీ త్వాత్మైవమే మతమ్

ఆస్థిత స్సహి యుక్తాత్మా మామేవానుత్తమాం గతిమ్ ॥

బహూనాం జన్మనామన్తే జ్ఞానవా న్మాం ప్రపద్యతే,

వాసుదేవ స్సర్వమితి  స మహాత్మా సుదుర్లభః

ఇతి శ్లోక త్రయోదిత జ్ఞానినం మాం కురుష్వ,

పురుషస్స పరః పార్థ! భక్త్యా లభ్యస్త్వనన్యయా

భక్త్యా త్వనన్యయా శక్యః మద్భక్తిం లభతే పరామ్

ఇతి స్థాన త్రయోదిత పరభక్తి యుక్తం మాం కురుష్వ,

ఆ కైంకర్యము వలె ప్రియ విషయమై శ్రీవైకుంఠము నందును అనువర్తించునవైన పరభక్తి, పరజ్ఞాన, పరమభక్తులను అపేక్షించిరి. అవి అనన్య ప్రయోజనముగా భక్తి రూపాపనన్నమైన జ్ఞానము కలవారికి సిద్ధింపగలవు.

ఆ జ్ఞానము సిద్ధింపవలెనని గీతోపనిషదాచార్యులు అనుగ్రహించిన మూడు శ్లోకములను ఉదహరించి ఆ జ్ఞానమును కలిగించి అనుగ్రహింపవలెనని ప్రార్థించుచున్నారు.

తేషాం జ్ఞానీ ..... ఈ శ్లోకమునకు ముందు శ్లోకములో

చతుర్విధా భజన్తే మాంజనే స్సుకృతినో ర్జున ।

ఆర్తో జిజ్ఞానురర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ ॥

పుణ్యకర్ములు తననే శరణుజొచ్చి భజింతురు అని చెప్పెను. ఇచట భజనము అనగా ఉపాసనము చెప్పబడినది. వీరు నాలుగు విధములుగా ఉందురు.

ఆర్త జిజ్ఞాసుః అర్థార్థి జ్ఞాని

| | |
|---|---|
| ఆర్తుడు | పోగొట్టుకున్న ఐశ్వర్యము మరల రావలెను అని కోరుకొనువాడు. |
| అర్థార్థి | అర్థింపదగిన ఐశ్వర్యమును అర్థించువాడు. |
| | వీరిరువురకు ఫలము ఐశ్వర్యమే. |
| | కాని పోయిన ఐశ్వర్యము కోరుట, పొందని ఐశ్వర్యమును కోరుట అనునదే భేదము. |

జిజ్ఞాసువు జ్ఞానమే స్వరూపముగా కలవాడు అని అర్థము.
జ్ఞానమనగా శుద్ధాత్మానుభవ రూపమైన జ్ఞానముగా గ్రహింపవలెను.
శుద్ధాత్మయే కేవలాత్మ అనబడును.
కేవలాత్మ స్వరూపాను భవమే కైవల్యము అనబడును.
జిజ్ఞాసువనగా కైవల్యార్థి.
ఇక జ్ఞాని శుద్ధాత్మానుభవమున నిలువక భగవంతునే పొందగోరును.
భగవంతునే పరమప్రాప్యునిగా తలచుటచే భగవంతునే పొందగోరును.
భగవత్ప్రాప్తియే మోక్షము కనుక జ్ఞాని మోక్షార్థి అగును.

తేషాంః పైన చెప్పబడిన ఈ నలుగురిలో అనగా ఐశ్వర్య కైవల్య, భగవంతుని యొక్క శరణార్థులలో జ్ఞాని విశిష్యతే అతిశయించి ఉన్నాడు. ఆ నలుగురిలో జ్ఞానియే శ్రేష్ఠుడు ఏల అనగా వాని శ్రేష్ఠత్వమునకు కారణము చెప్పుచున్నారు.

నిత్యయుక్తః ఏకభక్తిః నిత్యయుక్తుడు అనగా ఇతరులిద్దరును, ఐశ్వర్యార్థి, కైవల్యార్థి తమరు కోరిన ఫలము సాధించునంత వరకే భగవంతునితో సంబంధము పెట్టుకొందురు. అట్లు కాక సాధన దశ యందు భగవంతునే సాధనముగాను, ఫలదశ యందు భగవంతునే ఫలముగాను కలిగి యుండుట. అతనితో నిత్య సంబంధము కలిగియుండు వాడై ఉండును. కనుక శ్రేష్ఠుడు అని భావము.

ఏకభక్తిః అనగా భగవంతునియందే భక్తి కలవాడు తక్కినవారు తమరు కోరిన ఫలమునందును దానికి సాధకుడు కావున భగవంతుని యందును రెండింటి యందును భక్తి. జ్ఞానికి భగవంతుని యందొక్కని యందే భక్తి కనుక శ్రేష్ఠుడు.

అహం = నేను,
జ్ఞానినః = జ్ఞానికి,
అత్యర్థం = చెప్పనలవి కానట్టి,
ప్రియోహి = ఇష్టుడను కదా!
స చ = ఆ జ్ఞానియు,
మమ ప్రియః = అట్లే ప్రియుడు.

అర్థము అభిదేయము,

అత్యర్థం అభిదేయమును అతిక్రమించినది.

అనగా తక్కిన అభిధేయములు చెప్పుటకు శక్యములై ఉండునట్లుగాక తాను చెప్పన శక్యమై ఉండుట.

సర్వజ్ఞుడు, సర్వశక్తిమంతుడు అయిన భగవంతుడు జ్ఞానికి తాను ప్రియుడై ఉండుట ఇంత అని చెప్పనలవి కాదు.

స చ మమ ప్రియః అట్లే వాడును నాకు ప్రియుడు.

అట్లు అనగా జ్ఞానికి భగవంతుని యందు ప్రీతి ఇంత అని ఎట్లు చెప్పనలవి కాదో అట్లే జ్ఞాని యందు ప్రీతి కూడ చెప్పనలవి కాదు.

ఉదారస్సర్వ ఏవైతే ...............

ఏతే సర్వే = వారందరును,

మే = నాకు,

ఉదారాః ఏవ = దాతలే,

జ్ఞానీ తు = జ్ఞానీయే,

ఆత్మైవ నా = ఆత్మయే అని,

మే = నా యొక్క,

మతం = నిశ్చయము.

తన్నుపాసించి తన వలన అడిగి పుచ్చుకున్న వారందరూ ఉదారులే అని అన్నారు. కాని ఇచ్చినవాడు ఉదారుడగును కాని పుచ్చుకున్నవాడు ఉదారుడెట్లగును?

అనిన పుచ్చుకొనువాడుండిననే స్వామి యొక్క ఔదార్యము ఫలప్రదమగును, కానీ లేనిచో కాదు కదా!

అందుచే అట్లు పుచుకొన్న వారినే ఉదారులు అని సంబోధించిరి.

ఆత్మైవ అనుచోట శరీరమునకు ఆత్మ ఎట్లు ధారకమో అట్లు జ్ఞాని తనకు ధారకము అని చెప్పబడినది. ఇట్లు ఎందుకు నిర్ణయించిరి! అనగా



సః= వాడు,
యుక్తాత్మా = నా తోడి యోగము ఎదురు చూచుచున్న ఆత్మ కలవాడై,
మామేవ = నన్నే,
అనుత్తమాం= సర్వోత్తమమైన,
గతిం = ప్రాప్యస్థానము,
ఆస్థితః = నిశ్చయించిన వాడగును.

యుక్తాత్మా అనుట వలన భగవంతుని అనుసంధింపని యెడల వేరొకటి అనుసంధింప పూనుటకు అసమర్థుడైన స్వభావము కలిగియుండు వాడు. మామేవ అనుటచే ఉపాయ భూతుడగు భగవంతునే కాని మరియొక ఫలలేశమును కాదనుట ఈ విధముగా భగవంతుడు తన భక్తుని ఈ శ్లోకములో స్తుతించుట తెలియుచున్నది.

బహూనాం జన్మనా మంతే
బహూనాం = అనేకములైన,
జన్మనాం = పుణ్య జన్మముల యొక్క,
అంతే = తుదను,
జ్ఞానవాన్ = జ్ఞానము కలవాడై,
వాసుదేవః = సర్వాత్మకుడైన భగవంతుడే,
సర్వం = ప్రాప్యము,
ప్రాపకము = తక్కిన అభీష్టములన్నియూ,
ఇతి = అని
మాం = నన్ను
ప్రపద్యతే = ఉపాసించుచున్నాడో,
సః = అట్టి
మహాత్మా = పుణ్యాత్ముడు,
సుదుర్లభః = మిక్కిలి దుర్లభుడు.

బహూనాం జన్మనాం వట్టి జన్మలను చెప్పలేదు. ఏవో జన్మలు అనేకములు. ఎత్తినంత మాత్రమున జ్ఞానము కలుగదు. కనుక ఇచట అనేక పుణ్యజన్మలు ఎత్తిన పిదప జ్ఞానవంతుడై నన్ను ఉపాసించుచున్నాడు.

జ్ఞానవాన్ ఏ జ్ఞానము కలవాడు అన్నచో వాసుదేవునకు శేషమై ఉండుటయే నా స్వరూపము. నా స్వరూప, స్థితి, ప్రవృత్తుల అతని అధీనములు. అతడు అసంఖ్యేయములగు కల్యాణ గుణముల చేత అన్నింటి కంటే ఉత్కృష్టుడైనవాడు అను జ్ఞానము కలవాడు.

మాం ప్రపద్యతే = నన్ను కొలుచున్న, ఎట్లు కొలుచున్నాడనగా

వాసుదేవ స్సర్వం = వాసుదేవుడే సర్వం అని ఆళ్వార్లు,

ఉణ్ణుం శోఱుం పరుగు నీరు తిణ్ణుం వెత్తిలైయుం ఎల్లాం కణ్ణన్ అన్నట్లుగా

ధారక, పోషక, భోగ్యములగు అన్నము, నీరు తాంబూలాదులు సర్వమునూ వాసుదేవుడే అని ఉపాసించుచున్నాడు అని చెప్పిరి.

పురుషస్స పరః పార్థ! .......

ఇంతకు ముందు పరభక్త్యాదులకు పూర్వభావియైన భక్తి రూపాపన్న జ్ఞానమును అపేక్షించిరి. ఇప్పుడు కైంకర్యమునకు పూర్వభావియైన పరభక్త్యాదులను కోరుచున్నారు. భగవద్గీతలో 8వ అధ్యాయమున, 11వ అధ్యాయమున, 18వ అధ్యాయమున చెప్పబడిన పరభక్తిని కలుగు చేయవలసినదిగా పరభక్తి యుక్తం మాం కురుష్వ అని ప్రార్థించిరి.

పురుషస్సపరః పార్థ భక్త్యా లభ్యస్త్వనన్యయా
యస్యాన్తస్థాని భూతాని యేన సర్వమిదం తతమ్

హే పార్థ! భూతాని = సమస్త ప్రాణులు,

యస్య = కారణభూతుడగు పురుషుని యొక్క,

అంతస్థాని = లోపల ఉన్నవో,

యేన = ఎవని చేత,

ఇదం సర్వం= ఈ చరాచర ప్రపంచమంతయు,

తతం = వ్యాపింపబడియున్నదో,

సః = అట్టి,

పరఃపురుషః= పరమ పురుషుడు,

అనన్య = అన్య విషయములేని

భక్త్యా = భక్తి చేత

లభ్యః = పొందదగిన వాడు.

ఎవని లోపల సర్వభూతములు అంతర్గతములై ఉన్నవో, పరుడైన ఏ పురుషుని చేత ఈ సమస్తము వ్యాప్తమైనదో, ఆ పరమ పురుషుడు అనన్య భక్తి చేత మాత్రము లభింపదగినవాడు.

భక్త్యాత్వనన్యయా శక్యః అహమేవం విధోఽ ర్జున
జ్ఞాతుం ద్రష్టుంచ తత్త్వేన ప్రవేష్టుంచ పరంతప !

నా యధార్థ స్వరూపమును అనన్య ప్రయోజనమగు భక్తి చేత మాత్రమే (అనన్యయా భక్త్యాతు) యధార్థముగా శాస్త్రముల చేత తెలుసుకొనుటకు, ప్రత్యక్షముగా చూచుటకు, పరిపూర్ణముగా పొందుటకు శక్యుడను అని భగవానుడు చెప్పెను.

బ్రహ్మ భూతః ప్రసన్నాత్మా నశోచతి నకాంక్షతి
నమస్సర్వేషు భూతేషు మద్భక్తిం లభతే పరామ్

శేషభూతమై ఉండుటే స్వభావముగా కలిగియుండు శుద్ధాత్మా స్వరూపమును పొందినవాడు కర్మ సంబంధము చేత కలుషితము కాని స్వరూపము కలవాడై నా కంటే ఇతచరమగు ఏ ప్రాణిని గూర్చి శోకించగోరడు.

నేను తప్ప తక్కిన సమస్త భూతముల యందు సమానమైన అనాదర భావమును చూపుచు పరమమైన నాయందలి భక్తిని పొందుచున్నాడు.

ఇట్లు ఈ మూడు చోట్ల చెప్పబడిన పరభక్తి తమకు కలుగజేసి అనుగ్రహింపవలెనని భగవద్రామానుజులు ప్రార్థించిరి.

పరభక్తి పరజ్ఞాన పరమభక్త్యేక స్వభావం మా కురుష్వ

పరభక్తి, పరజ్ఞాన, పరమభక్తులే స్వభావముగా కల వానినిగా చేయుము అని ప్రార్థించుచున్నారు.

వెనుక చెప్పిన పరభక్తి వలన పరజ్ఞానము, పరజ్ఞానము వలన పరమభక్తి కలుగుతాయి. అటువంటి మూడు స్థితులు తమకు స్వభావముగా, నిత్యంగా సాగాలని భగవద్రామానుజులు కోరుకుంటున్నారు.

ఇక్కడొక సందేహము కలిగే అవకాశము ఉన్నది. పరభక్తి వలన పరమపద వాసమే లభిస్తుంది కదా! ఆ దేశ విశేష అనుభవం పరభక్తి వలన కలుగుతుంటే అది ఒక్కటే కోరుకుంటే సరిపోతుంది కదా! ఈ పరభక్తి, పరజ్ఞానములు నిత్యంగా ఉండాలని ఎందుకు కోరుకుంటున్నారు?

ఐతే మనం రోజూ అన్నం తింటూనే ఉన్నాము. దాని రుచి మారకపోయినా ఆహారము మీద ఉన్న ఇష్టం వలన రోజు అన్నం తినాలనే మనకి ఉంటున్నది కదా! ఆ పరమపదంలో భగవదనుభవం కలిగినప్పుడు ఆ అనుభవాన్ని ఎంతగా అనుభవించినా అట్లా అనుభవించాలనే ఉంటుంది. భగవద్విషయము విచిత్రమైనది.

ఆ త్రిపాద్విభూతి విశిష్టుడైన పరమాత్మను అనుభవించినప్పుడు అనుభవించిన అంశము అల్పముగానూ అనుభవించవలసిన అంశము ఎక్కువగానూ ఉంటుంది. అపరిచ్ఛేద్యమైనది భగవద్విషయము.

ఎప్పటికప్పుడు కొత్తదనాన్ని, కొత్త అనుభూతిని కలిగిస్తూనే ఉంటుంది. కొత్త విషయము చూడగానే దాని మీద మనసు నిలుస్తుంది. అదే పరభక్తి జ్ఞానానికి అదే విషయమవుతుంది అదే పరజ్ఞానము, ఆ విషయాన్ని అనుభవించకపోతే తన మనుగడే లేదనిపిస్తుంది. అదే పరమభక్తి ఈ మూడు స్థితులూ కలుగుతాయి.

భగవద్విషయంలో అనుభవం నవ్యనూతనమై ఎప్పుడూ కొనసాగుతూ ఉంటుంది కనుక పరభక్తి, పరజ్ఞాన, పరమభక్తులు తమకు స్వభావముగా, నిత్యంగా సాగాలని కోరుకుంటున్నారు భగవద్రామానుజులు.

పరభక్తి పరజ్ఞాన పరమ భక్తి కృత పరిపూర్ణానవరత నిత్య నిశదతమానన్య ప్రయోజనా నవధికాతిశయ ప్రియ భగవదునుభవోహం, తథావిధ భగవదనుభవ జనిత అనధికాతిశయ ప్రీతికారితా శేషావస్థోచిత అశేషశేషతైకరతిరూప నిత్యకిఙ్కరో భవాని.

పరభక్తి పరజ్ఞాన పరమభక్తి కృతః

పరభక్తి పరజ్ఞాన పరమభక్తుల చేత చేయబడిన

పరిపూర్ణః

సంపూర్ణమైన అనగా స్వరూప రూప గుణవిభూతున్నింటినీ ఒకే పోకగా అనుభవించి

అనవరతః

అవిచ్ఛిన్నమైన, విషయాంతరముల యందు దృష్టి లేక

నిత్యః

నిత్యమైన, యావదాత్మభావియై

విశదతమః — మిక్కిలి విశదమైన, ఇక్కడ పరభక్తి దశలో అనుభవము విశదముగను, పరజ్ఞాన దశలో అనుభవము విశదతరముగను, పరమభక్తి దశలో అనుభవము విశదతమముగను అని చెప్పవచ్చును.

అనన్య ప్రయోజన — వేరొకటి ప్రయోజనముగా లేని

అనవధికాతిశయ ప్రియ మిక్కిలి అతిశయముగల ప్రియమైన

భగవదనుభవోహం: భగవదనుభవముగల నేను

తధావిధ భగవదనుభవ జనిత ప్రీతిః అట్టి భగవదనుభవము చేత పుట్టించబడిన ప్రీతిచే

కారితాశేషవస్థోచితః చేయించబడిన సమస్త అవస్థలకు అనుకూలమైన

అశేష శేషతైక రతిరూపః సకల కైంకర్యముల యందు ఒకేరకమైన అభినివేశ రూపమైన

నిత్య ః — పునరావృత్తి రహితమైన దేశము నందు

కింకరో భవానిః — కైంకర్యము లభించువాడను కావలయును.

ఈ చూర్ణికలో నిత్యానుభవమును, నిత్య కైంకర్యమును పొందవలెనని ప్రార్థించిరి. ఇచట భవాని అనుట వలన ప్రార్ధన సూచింపబడుచున్నది. ఈ కింకర భావ ఆవిర్భావమునకు పూర్వము తాను జీవించి లేనట్లే అని సూచింపబడినది.

ఏవం భూత మత్కైఙ్కర్య ప్రాప్త్య పాయతయా వక్లుప్త సమస్తవస్తు విహీనోపి, అనన్త తద్విరోధిపాపాక్రాన్తోపి, అనన్తమదపచారయుక్తోపి, అనన్త మదీయాపచార యుక్తోపి, అనన్తాపహ్యాపచార యుక్తోపి, ఏతత్కార్య కారణ భూతనాది విపరీతాహంకార విమూఢాత్మ స్వభావోపి, ఏతదుభయ కార్య కారణ భూతానాది విపరీత వాసనా సంబద్ధోపి, ఏతదనుగుణ ప్రకృతి విశేష సంబద్ధోపి, ఏతన్మూల ఆధ్యాత్మిక ఆధి భౌతిక ఆధి దైవిక సుఖ దుఃఖ తద్ధేతు తదితరో పేక్షణీయ విషయానుభవ జ్ఞాన సంకోచ రూప మచ్చరణారవిందయుగలై కాంతికాత్యంతిక పరభక్తి, పరజ్ఞాన పరమభక్తి విఘ్నః మత్ప్రసాదలబ్ధ మచ్చరణార విందయుగళై కాన్తి కాత్యన్తిక పరభక్తి పరజ్ఞాన పరమభక్తి, మత్ప్రసాదాదేవ సాక్షాత్కృత యథావస్థిత మత్స్వరూప రూపగున విభూతి లీలోపకరణ విస్తారః, అపరోక్ష సిద్ధ మన్నియామ్యతా మద్దాస్యైక స్వభావాత్మ స్వరూపః మదేకానుభవః మద్దాస్యైక ప్రియః పరిపూర్ణానవరత నిత్య విశదతమానన్య ప్రయోజనా నవధికాతిశయ ప్రియ మదనుభవస్త్వమ్ తథా విధ మదనుభవ జనిత, అనవధికాతిశయ ప్రీతి కారితాశేషవస్థోచితాశేషశేషతైక రతిరూప నిత్య కింకరో భవ ॥



ఇది మొదలు ఈ గద్య పూర్తి అగు వరకు భగవంతుని ప్రతి వచనము తెలియజేయబడినది.

తొండరడిప్పొడి ఆళ్వార్లు, తిరుమాలై దివ్య ప్రబంధములో

అళియన్ నంపైయలైన్నార్ అమ్మవో కొడియావారే

వీడు నావాడు అన్నట్లు ఒక్కమాట ఐననూ పలుకడేమో అని వ్యాకులత నొందగా భగవంతుని మనస్సు కూడ ప్రసన్నమైనది.

ఈ లోకులలో వీరు ఒక్కరే కైంకర్యమును కోరుచున్నారనియు, శరణాగతి చేసి భారముంచిరనియు, ఆరాట పడుచున్నారనియు భావించి ఇక ఫలితమును ఆలసింపక తప్పక ఇత్తునని ప్రసన్న చిత్తుడాయెను. ఉపాయ, ఉపేయ, అధ్యవసాయముతో చేసిన ప్రార్ధనతో

శొంబరై యుగత్తిపోలుం శూష్ పులరంగత్తానే

నిన్నే నమ్ముకొని స్వప్రవృత్తి విడిచి యుండు ప్రపన్నులపై నీకు ఎంతటి ప్రేమయో కదా! శ్రీరంగనాథ ! అని రంగనాథుని ముఖారవిందమును చూచి తొండరడిప్పొడియాళ్వార్లు విన్నవించినారు. అటులనే ఇచట కూడ భగవద్రామానుజుల శరణాగతికి సంతసించి రంగనాధుడు తిరిగి సమాధానము చెప్పుచున్నాడు.

రంగనాథుడు తనకు భగవద్రామానుజులపై ఉన్న ప్రీత్యతిశయము చేత ఇంతకు ముందు వారు కోరిన దానినంతను మరల చెప్పి మీకు నా అనుగ్రహముచే ఏమియు కొరత లేకుండ మీ కోరిక ఈడేరును అని చెప్పిరి. ఇచ్చట మనకు భగవద్రామానుజులు, రంగనాథుడు ఒకరితో ఒకరు ప్రత్యక్షముగా సంభాషణ చేసుకున్నట్లు కనిపించుచున్నది. ఇది సాధ్యమేనా? అని మన బోంట్లకు వచ్చు సందేహము, ఎంబారుకు కూడ ఇదే సందేహము వచ్చి భగవద్రామానుజుల నడిగిరి వారు సమాధానము చెప్పుచూ మాకు రంగనాధుడు శీలాది గుణములనన్నింటిని కరతలామలకముగా అనగా దానిని ఎంత స్పష్టంగా చూడగలమో అంత స్పష్టముగా చూపినారు. భగవానుని హృదయములో లేని భావము మా నోటి వెంబడిరాదు. అందుచేత మేము చెప్పిన మాట వారు చెప్పినదిగనే విశ్వసించవచ్చును అని చెప్పిరి.

ఏవంభూత మత్కైంకర్య ప్రాప్తిః

ఈ విధమైన నా యొక్క కైంకర్య ప్రాప్తికి ఇచట ఏవంభూత అనునది కైంకర్యమునకు విశేషణము. ఇంతకు ముందు ఎట్టి కైంకర్యము కోరబడినదో అట్టిది అనుట.





ఉపాయతయావక్లుప్తః

ఉపాయములుగా వేదాంతములో చెప్పబడిన ఉపాసనాత్మకమైన కర్మ జ్ఞాన భక్తులు లేకపోయినను

అనంత తద్విరోధి పాపాక్రాంతోపిః

అట్టి ఉపాయ, అనుష్ఠానములను సంపాదించుకొందమన్నను వీలుకాకుండా వానికి విరోధములైన అనంత పాపములచే ఆక్రమింపబడియున్నా

అనంత మదపచార యుక్తోపిః

అనేకములగు నా విషయమై చేసిన అపచారములతో కూడియున్న వాడైనను ఇచట అపచారములనగా శాస్త్ర విరుద్ధముగా ఆచరించుట, విహిత ధర్మములను ఆచరింపకుండుట. ఈశ్వర అజ్ఞాతి లంఘనమే మదపచారము అని చెప్పబడుచున్నది. అకృత్య కృత్యాకరణములే పాపశబ్దముచే ఇంతకుముందు చెప్పబడినది.

అనంత మదీయాపచార యుక్తోపి అనంత అసహ్యాపచార యుక్తోపిః

నా వారైన భాగవతుల విషయములో అపచారములు చేసినవాడైనప్పటికి, సహింపరాని అసంఖ్యాకమైన అపరాధములు చేసినవాడైనప్పటికీ

ఏతత్కార్య కారణ భూతానాది విపరీతాహంకారః

ఈ విధముగా చెప్పబడిన పాపములకు కార్యము, కారణము అయిన అనాది సిద్ధ విపరీతాహంకారము.

పాపములే దేహాత్మాభిమానమునకు కారణము కావున ఇదే కార్యము.

పాపములు దేహాత్మాభిమానము చేతనే చేయబడును కావున ఇదే కారణము అయి ఉన్నది.

విపరీతాహంకారము అనగా నేను కాని శరీరము నందు నేను అను బుద్ధి కలుగుట. జ్ఞానానంద స్వరూపమై, ఏకరూపమై, ప్రకృతి కన్న విలక్షణమైన జీవ తత్వము, అహం శబ్దము చేత బోధించబడును. ఇది నేనుచే తెలియజేయబడును. కాని దుఃఖరూపమై జడరూపమై సతత పరిణామ శీలి అయిన ప్రకృతి యందు నేను అను బుద్ధి కలుగును. దీని వలన కలుగు ఫలితమేమి అన్నచో





విమూఢాత్మ స్వభావోపిః

ఆత్మ స్వభావము మరుగుపడిన స్థితిలో ఉన్నవాడైనను, ఇచట ఆత్మ స్వభావమేమి? అనగా శేషత్వము అని చెప్పుచున్నారు. శేషత్వము ఆత్మకు అంతరంగ స్వరూపము కదా! దానిని స్వభావమని ఎట్లు చెప్పవచ్చును.? అని మరల సందేహము వచ్చును. శేషత్వము స్వరూపమే. స్వరూపమైన శేషత్వము వలన వచ్చిన స్వభావము శేషోహం అని తలచుట. అది మరచి నేను స్వతంత్రుడను అనిపించుటయే ఇచ్చట విమూఢాత్మ7 స్వభావము.

ఏతత్కార్య కారణ భూతానాది విపరీత వాసనా సంబద్ధోపి

ఇప్పుడు చెప్పబడిన పాపములకు, అహంకారమునకు కార్యము, కారణము అయిన అది లేని విపరీతమైన వాసన సంబంధము కలవాడైనను అనేక జన్మల నుండి ఈ జీవునకు శరీర సంబంధము వలన ఎన్నో మానసిక భావనలు అనువర్తిస్తూ ఉంటాయి. వాటినే వాసనలు అంటారు.

చేసిన పాపముల వలన కొన్ని వాసనలు కలుగుతాయి.

వాటి వలన మళ్లీ మళ్లీ పాపములలో ప్రవృత్తులమవడం జరుగుతుంది. అహంకార వాసన వలన మళ్ళీ మళ్ళీ దేహమే నేననే భ్రాంతి కలుగుతుంది. పాపములు, అహంకారము ఈ వాసన వలననే కలుగుతాయి. కనుక వాసన పాపములకూ అహంకారమునకు కారణమవుతుంది.

పాపముల వలన అహంకారము వలన వాసన ఏర్పడుతుంది కనుక కార్యమవుతుంది.

అనేక జన్మల నుండి జీవుని అనువర్తించుచున్న మానసిక భావనలతో కొన్ని సత్త్వగుణ సంపన్నమైనవి ఉంటాయి. కొన్ని రజోగుణ, తమోగుణ సంపన్నములై ఉంటాయి.

ఈ రెండవ రకమైనవి దుర్వాసనలు. ఇచట విపరీత వాసన అనగా దుర్వాసన అని చెప్పుకొనవచ్చును.

ఇచట వాసన ప్రవాహ రూపేణ అనాది. తత్వము, హితము పురుషార్థము ఉన్నది ఉన్నట్లుగ బోధపడకుండ చేయునది కావున విపరీత శబ్దము వాడిరి.

ఏతదనుగుణ ప్రకృతి విశేష సంబద్ధోపిః

అపచార అహంకార, వాసనలు అను మూడింటికిని అనుగుణమైన రాజస, తామస, ప్రకృతి చేత ఆవరించబడియున్న వాడైననూ,

ఏతన్మూల ఆధ్యాత్మికాది భౌతికాధి దైవికః

ఈ ప్రకృతి సంబంధము వలన వచ్చు తాపత్రయములు చెప్పబడుచున్నవి. అవి ఆధ్యాత్మికము, ఆధి భౌతికము, ఆధి దైవికము అను త్రివిధములు. ఆధ్యాత్మిక తాపములు మానసికము, శారీరకము అని రెండు రకములు.

మానసికములుః

కామ, క్రోధ, భయ, ద్వేష, లోభ, మోహ, విషాదజః
శోకా ఽసూయావమానేర్ష్యా మాత్సర్యాదిమయ స్తథా

శారీరకముః

శిరోరోగ ప్రతిశ్యాయ జ్వర శూల భగన్దరైః
గుల్మార్శ స్వయధు శ్వాసచ్ఛర్ద్యాదిభిరనే కదా ।
తథా ఽక్షిరోగాతిసార కుషాఙ్గమయ సంజ్ఞితైః ॥

ఆధిభౌతికముః

పశుపక్షి మనుష్యాద్యైః పిశాచోరగ రాక్షసైః ।
సరీసృపాద్యైశ్చనృణాం జాయతే చాధిభౌతికః ॥
వీటి వలన కలుగనవి ఆధి భౌతికములు.

ఆదిదైవికములుః

శీతోష్ణ వాత వర్షామ్బు వైద్యుతాది సముద్భవః ।

సుఖదుఃఖ తద్ధేతుః

సుఖము, దుఃఖము వాటికి హేతువైనట్టి ఈ సుఖ దుఃఖములు కలుగుటకు కారణము విషయములతో సంసర్గమే కదా!.



తదితరోపేక్షణీయః

ఆ విషయములు మూడు రకములుగా ఉండును. తనకు సంబంధించినవి, పరులకు సంబందించినవి. మధ్యస్థులకు సంబంధించినవి. తన విషయములో కోరిక తీరుట సుఖహేతువు. తీరకపోవుట దుఃఖ హేతువు శత్రువుల విషయములో క్రోధము కలిగినపుడు ఎదుటి వారు మన వలన హానిని పొందితే అది సుఖహేతువవుతుంది. వారిని ఏమీ చేయలేకపోయినా లేక వారు తిరగబడినా ఆ క్రోధమే దుఃఖహేతువవుతుంది. మధ్యస్థుల విషయములో ఉపేక్ష చేయదగియుండును.

అనుభవజ్ఞాన సంకోచ రూపః

ఈ విషయముల యొక్క అనుభవము భగవత్ జ్ఞాన సంకోచరూపమై ఉండును. పర భక్తి, పరజ్ఞాన, పరమ భక్తులకు పూర్వముందే అనన్య ప్రయోజన భక్తి రూపావన్న జ్ఞానమునకు విషయానుభవము ప్రతిబంధకము.

మచ్చరణారవింద యుగళైకాన్తి కాత్యంతిక పరభక్తి, పరజ్ఞాన పరమభక్తి విఘ్న ప్రతిహతోపి

నా పాదపద్మముల యందు మాత్రమే నిత్యమై ఏకరూపమై ఉండు పరభక్తి పరజ్ఞాన పరమభక్తులనే మూడింటికి విఘ్నాన్ని పొందినవాడైనప్పటికి.

యేన కేనాపి ప్రకారేణః

ఏదో ఒక విధముగానైననూ ఇంతకు ముందు చెప్పినట్లుగా వేదాంత సిద్ధమైన కర్మ, జ్ఞాన, భక్తులు, లేకపోయినను వాటికి అంగములైన అమానత్వాది ఆత్మ గుణములు లేకపోయినను కైంకర్యానికి విరోధి అయిన సకల పాపములు ఉన్నను, విపరీత అహంకారము చేత మూఢుడు ఐనప్పటికీ, వీటికి కారణమైన విపరీత వాసనల చేత బంధింప బడినవాడైనప్పటికీ ఈ దుష్ట ప్రకృతితో సంబంధము కలిగియున్నప్పటికీ నా చరణారవిందముల యందు నిత్యమైన, ఇతర విషయ సంబంధము లేని పరభక్తి, పరజ్ఞాన, పరమభక్తులకు విఘ్నములు కలిగించు ఇతర విషయజ్ఞానముచే నిండిన వాడైనను ఏదో ఒక విధముగా అని తోచునట్లు



యేన కేనాపి ప్రకారఏన అని వాడినారు. ఆ విధములే ఏవి? దాని మీద హృదయము నిలుపకపోయినా, సహృదయముతో చేసినా, ఆర్తుడవై అనినా, దృప్తుడవై అనినా, అర్ధ సహితముగా అనినా, అర్థము తెలియక పలికినా నిర్బంధము లేదు. కాని పలుకవలసినదంత మాత్రమే.

ద్వయవక్తాత్వంః

ద్వయమును చెప్పిన వారలగు మీరు. ద్వయమంత్రమును మాత్రమే అనుసంధించవలెను. మంత్రాంతరములు కాదు. వ్యాప్తిని తెలియజేసిననూ ఇతర మంత్రములు కాదు. శ్రీ సంబంధము ప్రత్యక్షముగా తెలుపని మంత్రములు కూడ కాదు. ద్వయమంత్రమునే అనుష్ఠించవలెను. ద్వయ మంత్రమునందలి పూర్వార్ధము మాత్రమే కాదు. ఉత్తరార్ధము మాత్రమే కాదు. మొత్తము ద్వయమంత్రమునే అనుసంధించవలెను. భగవానుడే ఉపాయమని ప్రధమ వాక్యము. ప్రాప్యమైన భగవత్కైంకర్య రూప ఫలము రెండవ వాక్యములోను ప్రతిపాదింపబడినది. ఒక్క ప్రథమ వాక్యమును మాత్రము అను సంధానము చేసిన ఉపాయము భగవానుడే అని తెలియును కాని ఆ ఉపాయమును ఆశ్రయించిన పొందవలసినదేదో తెలియదు. ద్వితీయ వాక్యమును అనుసంధానము చేసిన మనము పొందవలసిన ఫలము తెలియును కాని దానికి ఉపాయమేమో నిష్కర్షగా తెలియదు. అందుచే ఈ రెండునూ తెలియజేయు పూర్వోత్తర ఖండములతో కూడిన ద్వయమంత్రాను సంధానమే చేయవలసినది.

కేవలం మదీయైవ దయయా నిశ్శేష వినష్ట సహేతుకః

కేవలం నా యొక్క కృప వలననే సంపూర్ణముగా దాని కారణమైన వాటితో సహా.

మచ్చరణారవింద యుగళైకాన్తి కాత్యంతిక పరభక్తి పరజ్ఞాన పరమభక్తి విఘ్నైః

నా యొక్క నిరతిశయ భోగ్యమైన పాదారవిందముల యందు నిత్యమైన, ఇతర విషయ సంబంధము లేని పరభక్తి పరజ్ఞాన పరమభక్తులకు ఏర్పడ్డ విఘ్నములన్నీ తొలగించబడినవాడవై.



ఇచట సహేతుక అని వాడిరి. అంటే ఇతర విషయ జ్ఞానము. ప్రకృతి సంబంధము, విపరీత వాసన, విపరీత అహంకారము, భగవదపచారాది సకల విరోధి పాపము, ఇవన్నియు కూడ తెలియజేసిరి.

మత్ప్రసాదలబ్ధః నా అనుగ్రహము వలన పొందబడిన

మచ్చరణారవిందయుగలైకాంతి కాత్యన్తిక పరభక్తి పరజ్ఞాన పరమభక్తిః

నిరతిశయ భోగ్యమైన పాదారవిందముల యందు ఇతర విషయ సంబంధములేని నిత్యమైన పరభక్తి, పరజ్ఞాన, పరమ భక్తులు కలవాడవై

మత్ప్రసాదాదేవః నా అనుగ్రహము కారణముగా

ద్వయవక్తాత్వం:

ద్వయమును చెప్పిన వారలగు మీరు. ద్వయమంత్రమును మాత్రమే అనుసంధించవలెను. మంత్రాంతరములు కాదు. వ్యాప్తిని తెలియజేసిననూ ఇతర మంత్రములు కాదు. శ్రీ సంబంధము ప్రత్యక్షముగా తెలుపని మంత్రములు కూడ కాదు. ద్వయమంత్రమునే అనుష్ఠించవలెను. ద్వయ మంత్రమునందలి పూర్వార్ధము మాత్రమే కాదు. ఉత్తరార్ధము మాత్రమే కాదు. మొత్తము ద్వయమంత్రమునే అనుసంధించవలెను. భగవానుడే ఉపాయమని ప్రధమ వాక్యము. ప్రాప్యమైన భగవత్కైంకర్య రూప ఫలము రెండవ వాక్యములోను ప్రతిపాదింపబడినది. ఒక్క ప్రథమ వాక్యమును మాత్రము అను సంధానము చేసిన ఉపాయము భగవానుడే అని తెలియును కాని ఆ ఉపాయమును ఆశ్రయించిన పొందవలసినదేదో తెలియదు. ద్వితీయ వాక్యమును అనుసంధానము చేసిన మనము పొందవలసిన ఫలము తెలియును కాని దానికి ఉపాయమేమో నిష్కర్షగా తెలియదు. అందుచే ఈ రెండునూ తెలియజేయు పూర్వోత్తర ఖండములతో కూడిన ద్వయమంత్రాను సంధానమే చేయవలసినది.

కేవలం మదీయైవ దయయా నిశ్శేష వినష్ట సహేతుకః

కేవలం నా యొక్క కృప వలననే సంపూర్ణముగా దాని కారణమైన వాటితో సహా.

మచ్చరణారవింద యుగళైకాన్తి కాత్యంతిక పరభక్తి పరజ్ఞాన పరమభక్తి విఘ్నః

నా యొక్క నిరతిశయ భోగ్యమైన పాదారవిందముల యందు నిత్యమైన, ఇతర విషయ సంబంధము లేని పరభక్తి పరజ్ఞాన పరమభక్తులకు ఏర్పడ్డ విఘ్నములన్నీ తొలగించబడినవాడవై.

ఇచట సహేతుక అని వాడిరి. అంటే ఇతర విషయ జ్ఞానము. ప్రకృతి సంబంధము, విపరీత వాసన, విపరీత అహంకారము, భగవదపచారాది సకల విరోధి పాపము, ఇవన్నియు కూడ తెలియజేసిరి.

మత్ప్రసాదలబ్ధః నా అనుగ్రహము వలన పొందబడిన

మచ్చరణారవిందయుగలైకాంతి కాత్యన్తిక పరభక్తి పరజ్ఞాన పరమభక్తిః

నిరతిశయ భోగ్యమైన పాదారవిందముల యందు ఇతర విషయ సంబంధములేని నిత్యమైన పరభక్తి, పరజ్ఞాన, పరమ భక్తులు కలవాడవై

మత్ప్రసాదాదేవః నా అనుగ్రహము కారణముగా

సాక్షాత్కృత యధావస్థిత మత్స్వరూపరూప గుణ విభూతి లీలోపకరణ విస్తారః

నా స్వరూపము, రూపము, గుణము, ఉభయ విభూతులు వీటన్నింటినీ గురించి ఉన్నది ఉన్నట్లు సాక్షాత్కారము కలిగిన వారలై ప్రసాదాదేవ అని ఏవకారము వేసిరి. ఈ స్వరూప రూప గుణ విభూతులు విస్తారముగా తెలియుట స్వామి యొక్క అనుగ్రహము చేత మాత్రమే అని తెలియజేయుటకు ఏవకారము వాడిరి. సహకారి కారణము మరొకటి అవసరము లేదు.

అపరోక్ష సిద్ధః పరోక్షముగా శ్రవణ మననాదుల చేత తెలియబడుట మాత్రమే కాకుండా సాక్షాత్కరింపబడిన

మన్నియామ్యతః నాకే నియమ్యమై ఉండుట

మద్దాస్యైకః నాకే దాస్యము చేయుట అనునవియే స్వభావముగా గల



ఆత్మస్వరూపః ఆత్మ స్వరూపమును గ్రహించిన వాడవై స్వరూప సాక్షాత్కారమైన తరువాత ఈశ్వరుని యొక్క నియామ్యత్వము. ఈశ్వరునకు దాసత్వము సాక్షాత్కరించినవి.

మదేకానుభవః నన్నొక్కనినే అనుభవింపగోరిన వాడవై, స్వరూప దర్శనమైన తరువాత ఆయనే శేషి అని, తాను శేషమని, ఆయనను దర్శించి, అనుభవించ బడవలసినది కూడ ఆయననే అని తెలిసి.

మద్దాస్యైక ప్రియః నా కైంకర్యము చేయుట యందే ప్రీతి కలవారలై.

ఒళివిల్ కాలమెల్లామే ఉడనాయ్ మన్ని అని నమ్మాళ్వార్లు ప్రార్థించినట్లు

పరిపూర్ణానవరతః పరిపూర్ణమైన క్షణమైనను విరామము లేని నిత్యమైన, మిక్కిలి విశదమైన, ప్రత్యక్ష సమానాకారమై ప్రయోజనాంతరముల యందు ఆసక్తి లేని, మితిలేని అతిశయము కల ప్రీతికి విషయమైన నా యొక్క అనుభవము కలవాడవై.

త్వం = నీవు

తథావిధ = ఆ విధమైన,

మదనుభవ జనిత = నాయొక్క అనుభవము చేత కలిగిన,

అనవధికాతిశయ = హద్దులేని అతిశయముగల,

ప్రీతికారిత = ప్రీతిచే చేయబడిన,

అశేషావస్థోచిత = అన్ని అవస్థలకు అనుగుణమైన,

అశేషశేషతైక రతిరూప= సర్వకైంకర్యముల యందు ఒకే రకమైన అభినివేశము గలవాడనై,

నిత్య కింకరో భవ = కైంకర్యము చేయువానిగా అగుదువు గాక,

ఏవంభూతోసి = అట్టివాడివే అయితివి.

ఈ చూర్ణికలో రంగనాధుడు భగవద్రామానుజుల ప్రార్థనను స్వీకరించి దానికి తగిన ప్రత్యుత్తరము అనుగ్రహించిరి.

స్వామిని పొందుటకు అడ్డుగానున్న సర్వ విధ అపచారములు క్షమించి, సర్వవిధ ప్రతిబంధకములు తొలగించి, పరభక్తి, పరజ్ఞాన, పరమభక్తులను అనుగ్రహించి తన స్వరూప రూప గుణ విభూతుల



అనుభవాన్ని కలిగించి నిత్య కైంకర్యాన్ని అనుగ్రహించారు. నీవు అట్టివాడవు అయితివి అని తెలియచేసినారు. దానికి కారణము ద్వయానుసంధానమే అని ఈ చూర్ణికలో తెలియచేసారు.

ఆధ్యాత్మికాధి భౌతికాధిదైవిక దుఃఖ విఘ్న గంధ రహితస్త్వమ్,
ద్వయమర్థానుసంధానేన సహ సదైవం వక్తా
యావచ్ఛరీరపాత మత్రైవ శ్రీరంగే సుఖమాస్వ

ఆధ్యాత్మికాది భౌతికాది దైవిక = ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆధిదైవికములనెడి,
దుఃఖ విఘ్న గంధ రహితః = దుఃఖ రూపమైన విఘ్నములు, వాసన లేనివాడనై,
త్వం = నీవు,
ద్వయం= ద్వయ మంత్రమును,
అర్థాను సంధానేన సహ = అర్థాను సంధానముతో కూడ,
సదా ఏవం వక్తా= ఎల్లప్పుడు ఇట్లు పలుకువాడవై,
యావచ్ఛరీర పాతం= శరీర వియోగమగు వరకు
అత్రైవ = ఇక్కడనే శ్రీరంగే = శ్రీరంగ క్షేత్రమున,
సుఖమాస్వ = సుఖముగా ఉండుము..

భయమును కలిగించే దేహేంద్రియములతో కూడుకొని ఉండగా కష్టాలు లేకుండా సుఖంగా ఉండడం సాధ్యమా?

తాపత్రయాల వలన కలిగే దుఃఖం భగవదనుభవానికి విఘ్నం కదా. తాపత్రయాలకు మూలకారణమైన శరీర సంబంధము అలాగే ఉంది. ఈ శరీర సంబంధము ఎప్పుడు వదులుతుందో తెలియదు. వదిలే వరకూ ఏ విధముగా కాలక్షేపము చెయ్యాలో తెలియదు, ఏ ప్రదేశములో ఉండాలో తెలియదు. అంధకార బంధురమైన ఈ లోకములో నిరపాయంగా కాలక్షేపము చేసే మార్గము తెలియడం లేదు. ఇలాంటి స్థితిలో కూడ ఏ కొరతా లేదు అంటున్నారు రంగనాధులు. ఇదేదో మర్యాదకు అన్న మాటలా ఉందని భగవద్రామానుజుల సందేహిస్తున్నారని భావించాడేమో భగవానుడు ఈ చూర్ణికలో సమాధానమిస్తున్నాడు.

తాపత్రయాలను ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆధిదైవికములు అని మూడు రకాలుగా చెబుతారు. వీటిని గూర్చి ఇంతకు ముందే వివరించుకోవడం జరిగింది. ఈ తాపత్రయాల వలన కలిగిన దుఃఖము నీ కంటదు అని చెప్పడానికి త్వం అని నిర్దేశించారు. ద్వయ అర్ధానుసంధాన తత్పరుడవైన నీకు ఏవం భూతోసి అని నేను చెప్పదగినట్లు ప్రవర్తించిన మీకు తాపము అంటదు అని ధైర్యాన్ని అందిస్తున్నారు.

భగవదనుగ్రహపాత్రులైన వీరికి భగవంతుని పొందే కాలము దగ్గరైందని కర్మ క్షీణిస్తోందని తెలుస్తోంది. కర్మ క్షీణించగా ప్రాప్యమైన భగవానుని పొందే రోజులు దగ్గరవుతున్నాయి. ఇక ఏ దుఃఖము వీరికి బాధించదు. పొందబోయే సుఖాన్ని తలచుకుంటూ ఉంటే కష్టము మనసుకు అంటకుండా అయిపోతుంది.

ఈ శరీరము ఉన్నన్ని నాళ్లు ఎలా గడపాలి అనే సందేహానికి సమాధానము చెబుతున్నారు. ద్వయ మంత్రాను సంధానముతో, అర్ధానుభవముతో కాలాన్ని గడిపివేయాలి.

నాట్టారోడియల్ వొళిన్దు నారణనై నణ్ణిన మే

నాట్టారోడు లోకులతొాడి, ఇయల్ వొళిన్దు సహవాసమును వీడి,

నారణనై నణ్ణినమ్  శ్రీమన్నారాయణుని ఆశ్రయింపగంటిమి.

ఈ అర్థము తెలిసినప్పుడు లోకులతో సంబంధము తగ్గిపోతుందని ఆళ్వారు చెబుతారు. ఆ స్థితిలో కాలము గడుస్తూంటుంది. భగవత్ప్రాప్తి కావాలంటే ద్వయ మంత్రాను సంధానమే చాలు. కానీ ఇక్కడ ఉన్న ద్వయవక్తా అని చెబుతూనే ద్వయమర్దానుసంధానేన అంటున్నారు.

యన్ముహూర్తం క్షణం వాపి వాసుదేవో న చింత్యతే ।
సా హానిః తన్మహచ్ఛిద్రం సాభ్రాంతిః సా చ విక్రియా ॥

ఏ క్షణమైన వాసుదేవుని గురించి చింతించకుండా ఉంటే ఆ సమయములోనే హాని కలుగుతుంది.

అదే చెడును మనలోనికి ప్రసరింపచేసే ఒక రంధ్రం.

అదే మనకు భ్రాంతి కలిగిస్తుంది. ఇదే చేయరాని పని.



సదైవం వక్తా ఇందులో ఏవం అంటే ఇప్పుడు చెప్పినట్లుగా అని అర్థం.

తాము ఆచరించిన దానినే వీరు ఉటంకిస్తున్నారు.

ఒక విధముగా కాదు రెండు విధాలుగా కాదు ఇరవై విధాలుగా అయినా శరణాగతి చేసి పొందవలసినదే కాని వేరొక విధాన్ని ఎరిగిన వారు కారు. భగవద్రామానుజులు.

శరణాగతి చెయ్యడం భగవదనుగ్రహం మనమీద ప్రసరించడానికి కదా! ఆ పని ఈ గద్య వలననే అని తెలుస్తోంది.

కనుక దీనిని అనుసంధించి, అనుసరించి భగవదనుగ్రహము పొందడం సులభం.

దీనినే అనుసంధిస్తూ కాలము గడపమని చెబుతున్నాడు. సర్వేశ్వరుడు. వక్తా అనడం వలన మనసు లోపల ఉన్నా లేకపోయినా నోటితో పలికితే చాలు ఫలితం ఉంటుంది అంటున్నారు.

ఏవం వక్తా, అర్థానుసంధానేన అనడం వల్ల ఈ గద్యను నోటితో ఉచ్చరిస్తూ మనసులో ద్వయమంత్రము యొక్క అర్థాన్ని భావిస్తూ ఉండమని చెప్పినట్లు తెలుస్తోంది. రెండింటికీ అర్థం ఒకటే. ద్వయాన్ని వివరించేదే ఈ గద్య.

సదా ఎల్లప్పుడూ - ఎల్లప్పుడూ ద్వయార్థాను భావన తోటే గడపాలి ఎందుకు?

భగవంతుని కంటే వేరైన ఉపాయాలు నడయాడే ఈ లోకములో అవి మనసులో దూరకుండా ఉండాలంటే ఈ ద్వయార్థము మనసులో ఎప్పుడూ ఉండవలసిందే. లేక సదా అనడానికి మరొక విధముగా కూడా చెప్పుకోవచ్చు.

సహజముగా ఈ లోకములో ఉన్న వారికి ప్రకృతి స్పర్శ వలన విషయాంతరాలపై బుద్ధిపోతుంది. కాని భగవద్రామానుజులు విషయాంతరము లంటే భయపడి భగవద్విషయాన్ని అవలంభించిన వారు. అందువలన ఇతర విషయ స్పర్శ లేదు. భగవత్కైంకర్యము



పరిపూర్ణంగా చెయ్యాలంటే పరమపదానికి వెళితే కాని వీలుపడదు. అందువలన ఉన్నన్ని రోజులు కాలక్షేపానికి చేసేదే ఈ ద్వయార్థానుసంధానము. ఎప్పుడూ ఇదే పని కనుక సదా అన్నారు.

ఈ విధముగా కాలము గడుపుతూ ఈ శరీరము అంతమయ్యే వరకు వేచి ఉండాలి. వీరు వేరొక ఉపాయాన్ని నమ్మిన వారైతే ఫలిస్తుందో లేదో అని బెంగ ఉంటుంది. వీరు భగవానునే ఉపాయమని నమ్మేరు కనుక ఆ దిగులు లేదు. సమయము కోసమే ఎదురు చూపులు శరీర వియోగము వరకూ కాలాన్ని నెట్టుకు రావాలి. ఇదే విషయాన్ని ఛాందోగ్యము తస్యతావదేవ చిరం యావన్న విమోక్ష్యే భగవత్పాదార వింద సన్నిధిని శరణాగతి చేసిన వానికి శరీర వియోగమే ఆలస్యము తరువాత వెంటనే మోక్షము లభిస్తుంది అని చెప్పింది. పాంచరాత్ర సంహిత ప్రారబ్ద మాత్రం భుక్త్వాత్ర తత్వనిత్సుఖ మాప్నుయాత్ ప్రారబ్ధ కర్మ మాత్రం అనుభవించక తప్పదు. ఆ ప్రారబ్దానుభవం పూర్తవగానే తత్వమెరిగిన వాడు సుఖమును పొందుతాడు. అని చెప్పింది. అంతే కాక ప్రారబ్దమేవ భోక్తవ్యం కర్మ బ్రహ్మ విదామపి బ్రహ్మవేత్త అయినా ప్రారబ్ద కర్మ అనుభవించక తప్పదు అని తెలియజేసింది. బ్రహ్మ సూత్రాలలో అనారబ్ద కార్యే ఏవమపూర్వే తదవధేః ఇంకా అనుభవములోనికి రాని కర్మ మాత్రమే నశింపచేయబడుతుంది అని చెప్పబడింది. వాక్యాలన్నీ, ప్రారబ్ద కర్మ పూర్తవడం అన్నది కొన్ని జన్మల అనుభవంతో అవుతుంది. అది పూర్తయ్యాక మోక్షం లభిస్తుంది. అని వీటి తాత్పర్యం. కాని ప్రపన్నునికి వేరు. ఆళ్వార్లు చెప్పినట్లుగా మరణమానాల్ వైగున్దమ్ కొడుక్కుం పిరాన్ ఈ శరీరము పోగానే వైకుంఠం లభిస్తుంది. ఇదే విషయాన్ని భారతములో కృతకృత్యాః ప్రతీక్షంతే అనే చోట కూడ వివరించేరు. ఇక్కడ ఆర్తిలో ఉపాసకునికి, ప్రపన్నునికి తేడా ఉన్నందువల్ల ఫలములో కూడ ఈ కాల విలంబ, అవిలంబాలు సిద్ధిస్తున్నాయి.

ప్రాప్యత్వర వలన కాలము ఎంతో పొడవుగా ఉన్నట్లు తోచి ఏ కొరతాలేని ఉపాయాన్ని స్వీకరించి కూడ విలంబాన్ని సహించలేక తల్లడిల్లే ప్రపన్నుని ఆర్తి చూచి సహించలేక స్వామే ఒక ధైర్యాన్ని కలిగిస్తూ కాలావధిని తెలియచేస్తున్నారు.

శ్రీరంగే సుఖమాస్వః ఈ శ్రీరంగములోనే శరీర అవసానంలో సుఖముగా గడపమని ఆదేశిస్తున్నాడు శ్రీరంగనాథుడు.

శ్రీరంగమంటే మాములు స్థలము కాదు. భగవంతుడు కూడ పరమపదాన్ని కాదని చేరి నిలచిన స్థలమిది. అక్కడ ఉంటే సుఖమే ఉంటుంది. అక్కడ ఉన్నవారు.

ముక్తులతో సమానమైన స్థితి కలిగి ఉంటారు.

కనుక సుఖమాస్వ అంటున్నాడు సర్వేశ్వరుడు.

లీలా విభూతి సంసారులు ఉండే దేశము.

నిత్య విభూతి ముక్తులు ఉండే ప్రదేశము.

ఈ శ్రీరంగము ముముక్షువులు చేరే ప్రదేశము. ఇక్కడ శ్రీరంగాన్ని చెప్పడం తాను మెచ్చిన దివ్య క్షేత్రములన్నిటికి ఉపలక్షణమని వేదాంత దేశికుల వారి మాట.

ఏవం భూతోసి ఇంత వరకు శరీర సమనంతరము లభించే ఫలము శరీరముతో ఉన్న రోజులలో కాలక్షేపము చేయవలసిన విధానము, ఎక్కడ ఉండాలనే విషయము చెప్పేరు. ఇంకా అవసరమైన విషయాన్ని తరువాత చూర్ణికలో ప్రస్తావిస్తున్నారు.

అంతిమ స్మృతి మరణించే ముందు భగవంతుని స్మరించినపుడే భగవత్ప్రాప్తి లభిస్తుంది అనేది శాస్త్ర సిద్ధమైన విషయము.

ఆ అంతిమ స్మృతి ఎలా కలుగుతుంది?

భగవద్రామానుజులు సందేహిస్తున్నారేమో అని రంగనాథుడు ఇక ముందు సమాధానం చెప్పబోతున్నాడు.



శరీరపాత సమయేతు కేవలం మదీయమైవ
దయయా అతి ప్రబుద్ధో మామేవావలోకయన్
అప్రచ్యుత పూర్వ సంస్కార మనోరథః
జీర్ణమివ వస్త్రం సుఖేనేమాం ప్రకృతిం స్థూల సూక్ష్మరూపాం విసృజ్య
తదానీమేవ మత్ప్రసాద లబ్ధ మచ్చరణారవింద యగలైకాన్తి కాత్యన్తిక
పరభక్తి పరజ్ఞాన పరమ భక్తి కృత పరిపూర్ణానవరత నిత్య విశదతమానన్య
ప్రయోజనానవధికాతిశయ ప్రియ మదనుభవ జనితానవధికాతిశయ
ప్రీతి కారితా శేషావస్థోచితాశేష శేషతైక రతిరూప నిత్య కింకరో భవిష్యసి.

శరీరపాత సమయేతు = మరణకాలమందు,

కేవలం = కేవలము,

మదీయమైవ దయయా = నా యొక్క దయచేతనే,

అతి ప్రబుద్ధః = మిక్కిలి జ్ఞానము కలవాడనై,

మామేవావలోకయన్= నన్నే చూచుచూ అనగా సాక్షాత్కరించుకొనుచు,

అప్రచ్యుత = పూర్వ సంస్కార

మనోరథః = పూర్వ సంస్కారమునకు భంగములేని కోరిక కలవాడవై,

జీర్ణమివ వస్త్రం = చిరిగిపోయిన వస్త్రము వలెనే,

స్థూలసూక్ష్మ రూపాం= స్థూల సూక్ష్మ రూపమైన,

ఇమాం ప్రకృతిం = ఈ ప్రకృతిని,

విసృజ్య = విడచి,

తదానీమేవ = అప్పుడే,

మత్ప్రసాదలబ్ధ = నాదయ వలన లభించిన,

మచ్చరణారవింద యుగళైకాంతి కాత్యంతిక పరభక్తి పరజ్ఞాన పరమభక్తి = నా పాద పద్మముల యందలి ఇతర విషయములేని పరభక్తి పరజ్ఞాన పరమ భక్తులచే,

కృత పరిపూర్ణ = చేయబడిన పరిపూర్ణమైన,

అనవరత = అవిచ్ఛిన్నమైన,

నిత్యవిశదతమ = నిత్యమైన, మిక్కిలి స్పష్టమైన,

అనన్య ప్రయోజన = ఇతర ప్రయోజనము లేని,

అనవధికాతిశయ = హద్దులేని అతిశయము గల,

ప్రియ = ప్రీతి పాత్రమైన,

మదనుభవజనిత = నా అనుభవము చేత పుట్టిన,

అనవధికాతిశయ = అవధిలేని అతిశయము గల,

ప్రీతికారిత = ప్రీతిచేత చేయబడిన,

అశేషావస్థోచిత = అన్ని అవస్థలకు తగిన,

అశేష శేషతా = సర్వ దాస్యముల యందలి,

ఏకరతిరూప = అభినివేశమే స్వరూపముగా గల,

నిత్య కింకరః = నిత్య కైంకర్యపరుడవు,

భవిష్యసి = కాగలవు.

శరీర పాత సమయములో అనగా మరణ సమయములో మీకొక విశేషముండును. స్వస్థ దశలో ఏరకమైన జ్ఞానముండునో ఆరకమైన జ్ఞానము మీకు కలుగును అని భగవద్రామానుజులకు రంగనాధుడు తెలియజేయుచున్నాడు. మరన సమయమున సహజముగా బుద్ధి చలించి స్థిరమైన జ్ఞానముండదు. కాని భగవత్పాదారవింద సన్నిధిన శరణాగతి చేసిన మహాపురుషులకు మాత్రము శరీరము స్వస్థముగా ఉన్నప్పుడు ఏవిధముగ మనసు, బుద్ధి పనిచేయునో అట్లే, ఈ అంత్యదశలో కూడ పని చేయును. అట్లు పని చేసిననే భగవానునిపై అంతిమ స్మృతి నిలుపగలడు. ఈ అదృష్టమును రామానుజులకు కలిగింతునని రంగనాధుడు చెప్పిన మాట.

అంత్యకాలమందు ఏ విషయమును గురించిన బావముండునో ఆ భావమునకు తగిన శరీర ధారణము జరుగును. సామాన్య మానవులకు కఫవాత పిత్తాది దోషములతో కూడిన ఈ శరీరము మరణ సమయములో




కాష్ఠ పాషాణ సన్నిభమైనప్పుడు ఈ అంత్య కాలస్మృతి కలుగుటకు అవకాశమున్నదా?

అంత్యకాలమందు ఏ రూపు చింతించుచు మరణించునో తదనంతరము ఆ రూపమును పొందునని కృష్ణ భగవానుడు చెప్పినాడు.

దానికి సమాధానముగా శరీరావసాన కాలములో కేవలము నా యొక్క స్వభావమైన దయ చేతనే మిక్కిలి జ్ఞానము కలవారలు అగుదురు అనెను.

ఉపాసకునకు కర్మ యోగము, జ్ఞానమునకు హేతువగును.

కర్మ జ్ఞానములు రెండు భక్తికి కారణములగును. భక్తి పరభక్తిగా, పరభక్తి పరజ్ఞానముగా, పరజ్ఞానము పరమభక్తిగా అవస్థా బేధము పొందును. ఈ విధముగా ముందటి అవస్థ తరువాతి అవస్థకు హేతువుగాఉండును. స్వామి యొక్క దయయే ఈ అవస్థకు కారణమని తెలియజేయుచున్నారు.

విషయీకార దశ యందు, విషయీకృత దశయందు, విరోధి దశ యందు, అనుకూల్య దశ యందు భేదము లేకుండా ఎప్పుడూ ఆయన యొక్క దయయే ఉపకారకము.

విషయీకార దశ యనగా భగవంతుని చేత అనుగ్రహింపబడుటకు తాను అంగీకరించిన దశ.

విషయీకృత దశ యనగా భగవంతుడు తనను వాని వానిగా అంగీకరించని దశ.

విరోధి దశ యనగా భగవంతుని పొందుటకు అనేకమైన అడ్డంకులను తాను కలిగి ఉన్న దశ.

అనుకూల్య దశ యనగా భగవంతుని వైపు అభిముఖుడై భగవంతుని సంబంధము తనకు అనుకూలమని నమ్మి ఉన్నదశ.

ఈ నాలుగు దశలలోనూ కూడ భగవంతుని దయయే వెన్నంటి ఉండి ముందుకు నడిపించగా శరణాగత నిష్ఠులైన వారు భగవద్రామానుజులు.

**అతి ప్రబుద్ధిః** పూర్వ దశలో కలిగిన జ్ఞానము అటులనే భాసించినవాడవై.

మామేవావలోకయన్: నన్నే సాక్షాత్కరించుకొనుచు ఇంతకు ముందు రెండు విషయముల యొక్క సంబంధము ఉండెడిది.

1) ప్రకృతి సంబంధము

..

2) భగవత్సంబంధము

కాని ఇప్పుడు భగవంతుని అనుగ్రహముచే ఒకే విషయ స్పర్శ ఏర్పడినది. అనగా ఎల్లప్పుడునూ భగవంతునే స్మరించు స్థితి కలిగినది.

అప్రచ్యుత పూర్వ సంస్కార మనోరథః

పూర్వ సంస్కారమునకు భంగములేని కోరిక కలవాడై, అనగా భగవానుడే నాకు పరమ ప్రాప్య భూతుడు అను శాస్త్ర జన్యమగు సంస్కారమును. భగవత్ ప్రాప్తి రూపమైన కోరికను ఎంత మాత్రము విడిచిపెట్టని మనోరథమునకు భంగము లేని స్థితి కలిగి

స్థూల సూక్ష్మ రూపాం ఇమాం ప్రకృతిం జీర్ణమివ వస్త్రం సుఖేన విసృజ్య

స్థూల సూక్ష్మ రూపములుగా ఉన్న ఈ ప్రకృతిని జీర్ణమైన వస్త్రమును వదిలిపెట్టినట్లుగా సులభముగా వీడి. ఇచట ఈ శరీరమును జీర్ణమైన వస్త్రముతో పోల్చి సుఖముగా విడుచుటను చూపిరి. కాని మనకు లోకములో ఈ శరీరములను వదలు విషయములో శంకలు ఉదయించుచున్నవి.

మనుష్య శరీరము వదలినంతనే కొత్త వస్త్రమును ధరించునట్లు ఉత్తమ దేహము ధరించుట చూచుట లేదు. ఈ దేహములన్నియూ పాతబట్టల వంటివి కావు. మరణించిన వారిలో యౌవన వంతులు అనేకులు ఉన్నారు. ఎట్లు సుఖముగా వదలుట? ఈ శరీరములు కర్మానుభవమునకే ఏర్పడినవి?

ఆకర్మ ముగిసిన తోడనే అవి వయో నియమము లేకనే జీర్ణ శరీరములుగనే వాటిని మనము భావించవలెను. ఎట్లు చిరిగిపోయిన వస్త్రమును అసహ్యముగా తీసి పారవేతుమో ఆ విధముగనే ఈ శరీరము కూడ రక్తమాంసములతో కూడి జుగుప్సను కలిగించునదే కనుక దానిని వస్త్రముతో పోల్చిరి.

కృత కృత్యాః ప్రతీక్షంతే శరణాగతి నిష్ఠులు చేయవలసిన పని చేసినవారు కనుక మృత్యువునకై ప్రియమైన అతిథి కొఱకు ఎదురు చూచినట్లు చూతురు. బంధు జనులు చుట్టూ చేరి ఉండగా మధ్యన పడియున్న ఈ శరీరమును ఉత్తమగతికి చేరిన జీవుడు తలవనే తలవడు

నోపజనం స్మరన్నిదం శరీరం

అను దాని వల్ల తెలియుచున్నది. అనగా ఈ విధముగా తెలిసినవారు ఈ శరీరాన్ని వీడుట కష్టము కాదని ఎరిగిన వారు కనుక తృప్తులై ఉందురు.

మరణము సమీపించుచున్నందున భగవత్సన్నిధికి చేరు సమయము ఆసన్నమైనదనీ, భగవత్కింకరులగు, అతివాహిక పురుషులను పుణ్యమూర్తులు ఎదురు వచ్చి తనను పరమ పదమునకు నడిపింతురనీ తెలిసియుండుట వలన తృప్తుడై ఉండును.

తదానీమేవ అప్పుడే ఆలశ్యము లేక

మత్ప్రసాదలబ్ధ నా అనుగ్రహముచే లభించిన స్వామి యొక్క ప్రసాదముచే లభించునది ఏది? నిత్య కైంకర్య సామ్రాజ్యమును పొందిన వారు కాగలరు అని అనుగ్రహించుట

మచ్చరణారవిందః చెప్పబడినవన్నీ ఇంతకు ముందు చూర్ణికలలో చెప్పబడినవే కనుక ఇచట వివరించుట లేదు.

పైన చెప్పబడిన మాటలన్నియూ వాస్తవమేనా? అను అనుమానము రాకుండా

మాతేభూదత్ర సంశయః ఈ విషయములో మీకు సంశయము అక్కరలేదు. మా విషయములో శరణాగతి చేసిన మీకు సంశయము వలదు అని చెప్పిరి. లోకమున క్షుద్ర ఫలములను పొందుటకు గొప్ప ఉపాయ అనుష్ఠానములను చూచుచున్నాము. పురుషార్థములలో శ్రేష్ఠమైన మోక్ష పురుషార్థము పొందుటకు ఎంత దుష్కరమైన ఉపాయముండ వలెను. ఈ శరణాగతి మాత్రమున అంత ఫలము కలుగునా అని కొందరికి సందేహమేర్పడును.



మాతే భూదత్ర సంశయః

సంశయము వలదు అని తెలియజేసిరి.

ఇప్పటి వరకూ చెప్పిన దానిని స్థిరీకరించుటకు తానే ఇంతకు ముందు పలికిన వాటిని ఇకపై చూర్ణికలో తెలియజేయుచున్నారు.

అనృతం నోక్త పూర్వం మే నచవక్ష్యే కదాచన ।
రామో ద్విర్నాభిభాషతే ।
సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతిచ యాచతే ।
అభయం సర్వభూతేభ్యో దదామ్యే తద్వ్రతం మమ ॥
సర్వ ధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ ।
అహం త్వా సర్వ పాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః ॥
ఇతి మయైవ హ్యుక్తమ్

తాను రామాయణములోను, గీతలోను అసత్యమాడను అని నిశ్చయమును కలిగించుటకు ఒక్కసారి ఈ పై మాటలను చెప్పెను. అసత్యమును నేనిది వరకు చెప్పలేదు. ఎప్పుడునూ చెప్పను. రాముడు రెండు మాటలాడడు.

విభీషణుని వ్యాజముగా చేసుకొని సకృదేవ ప్రపన్నాయ అను చరమ శ్లోకములను చెప్పితిని. కేవలము ఒక్కసారి ప్రపత్తి చేసిన వారికి, నీ వాడను అని పలికిన వారికి సర్వ ప్రాణులకు అభయము నిత్తును. అది నా వ్రతము.

అర్జునుని వ్యాజముగా చేసుకొని
సర్వధర్మాన్ పరిత్యజ్య ....
అను చరమశ్లోకమును తెలియజేసితిని.

సర్వ ధర్మములను భావమును పరిత్యజించి నన్నొకడినే శరణు పొందుము.

నేను నిన్ను సర్వ పాపముల నుండి విడిపించగలను, శోకింపకుము అని నా చేతనే చెప్పబడినది.

ఇతిహాస శ్రేష్ఠమైన రామాయణములోను, పంచమ వేదముగా కీర్తింపబడిన భారతములోను చెప్పబడిన ఈ మాటలు ఇతి మయైన హ్యుక్తమ్ అని అనుటలో ఇవి తన నుంచే వెలువడిన శ్రుతుల వంటివే అనగా వేదము వంటివే అని తెలియజేసినాడు.

అతస్త్వం తత్త్వతో మద్ జ్ఞాన దర్శన ప్రాప్తిషు నిస్సంశయస్సుఖమాస్వ

ఇది ముందు చెప్పినదానిని ధృడపరచి చెప్పుటకు, సంతోషమును కలిగించుటకు.

అతః = అందువలన నేను చెప్పిన వాక్యములు మిక్కిలి విశ్వసింపదగినవి.

తం = నీవు, నన్నే విశ్వసించియున్న నీవు

తవ = నీ యొక్క నా చే స్వీకరింపబడిన సకల భారములను గల నీ యొక్క

తత్త్వతః మద్జ్ఞాన దర్శన ప్రాప్తిషు =

యథార్థముగా నన్ను తెలుసుకొనుట, చూచుట, నిత్య కైంకర్యము చేయుట అను వీటి యందు

నిస్సంశయః = సంశయము లేని వాడవై

సుఖమాస్వ = సుఖముగా ఉందువు గాక

నిస్సంశయేషు సర్వేషు నిత్యం వసతి వై హరిః ।
ససంశయాన్ హేతుబలాన్నాధ్యావసతి మాధవః ॥

సంశయము కలిగిన వారి మదిలో మాధవుడు నిలువడు.

ఇంతవరకు భగవానుడు భగవద్రామానుజులతో పలికిన మాటలు.

అన్త్యకాలే స్మృతిర్యాతు తవ కైంకర్య కారితాః ।
తామేనాం భగవన్నద్య క్రియమాణాం కురుష్వమే ॥

నీ కైంకర్యమునే చేయవలెనను అంత్యకాల స్మృతి ఏది కలదో దానిని నేడే పొందు వానినిగ అనుగ్రహింపుము.

ఈ అంత్యకాల స్మృతి పూర్వము ఏ విషయమున మనకు అభ్యాసమున్నదో అదే కలుగుతుంది. కావున అంత్యకాలమున భగవానుని కొత్తగా స్మరించవలయునన్నచో అప్పటికప్పుడు అది కలుగదు కనుక మొదటి నుండియు భగవద్విషయికమైన, స్మరణ కావలయునని భగవత్కైంకర్య భావన చివరి కాలమున నిరంతర ద్వయాను సంధానము వలన తమకు కలుగునట్లు అనుగ్రహించమని భగవద్రామానుజులు ప్రార్థించుచున్నారు.

జై శ్రీమన్నారాయణ

# శ్రీరంగ గద్య

కస్తూరీ కలితోర్ధ్వ పుండ్ర తిలకం, కర్ణాన్తలోలేక్షణం
ముగ్ధ స్మేర మనోహరాధరదళం ముక్తా కిరీటోజ్జ్వలమ్ ।
పశ్యన్మానస పస్యతో హరరుచం పర్యాయ పంకేరుహం
శ్రీరంగాధిపతేః కదాను వదనం సేవేయ భూయోఽ పృమహమ్ ॥

కస్తూరీ తిలకాలంకృతమై, చెంపకు చేరడేసి కన్నులతో చిరునవ్వులు చిందులాడే అంధర శోభతో ముక్తా కిరీటోజ్వలమై, చూచిన వారందరి మనసులను కొల్లగొట్టే ఆ శ్రీరంగనాథుని మాటి మాటికి ఎప్పుడు సేవిస్తానో కదా అంటారు పరాశర భట్టరు.

ఈ విధంగా దృష్టి చిత్తాపహారి అయిన, అర్చామూర్తిగా మనకందుబాటులో ఉండేవాడు ఆ పరమపదనాథుడు. ఈ స్వామి కంటే పరదైవం మనకెక్కడ దొరుకుతాడు కనుక!.

భగవద్రామానుజులు శాస్త్రీయంగా, ప్రతివాది భంజకంగా ఉండడానికి శ్రీభాష్యంలో భక్తియే మోక్షోపాయమని నిర్ధారించారు. కాని హృదయం ఆర్ద్రమై భగవంతుండంటే దుష్ట శిక్షణ, శిష్టరక్షణ కూడ చేసేవాడని కాక, శిష్టరక్షకుడని మాత్రమే విశ్వసింతి తమ భారాన్ని భగవంతునిపై నుంచి నిర్భరులై ఉండే జ్ఞానుల కొరకై శరణాగతి అనే చిట్టచివరి సాధనాన్ని అందించ నిశ్చయించారు. దీనినే సిద్ధభక్తి అంటారు. అంటే నీవు ఆర్జించిన జ్ఞానము చేతో, నీవు అభ్యసించిన భక్తి వలనో నీవు ఆచరించిన కర్మ కారణంగానో కాక కేవలము భగవదనుగ్రహము వలననే ఉత్తమ ఫలితమైన భగవత్సేవాభాగ్యం లభిస్తుందనే ఆ విషయాన్ని శరణాగతి గద్య, శ్రీరంగ గద్య, వైకుంఠగద్య అనే మూడు గద్యలలోను లోకానికి అందించారు.

శరణాగతి చేయాలి అని శరణాగతి గద్యలో చెప్పి, ఆ శరణాగతి సర్వసులభుడై, సమస్త ఫలప్రదాత అయిన అర్చా మూర్తి సన్నిధిని చేయడమే యుక్తమని శ్రీరంగ గద్యలో తెలియచేస్తున్నారు. మనందరికి ప్రతినిధిగా మార్గ నిర్దేశకులుగా, తమ ఆర్తిని కలబోసి భగవద్రామానుజులు అందించిన శ్రీరంగ గద్యను కాస్తయినా అనుభవించే ప్రయత్నము చేద్దాము.

ఈ గద్యలో కనిపించే భావాలేమిటో తెలుసుకుందామా ! ముందు మనం పొందవలసినది ఏమిటో తెలియాలి. ఏమది? భగవత్ కైంకర్యము. ఇది పొందాలంటే ముందుగా మనలో ఉన్న దోషాలను భగవంతుని వద్ద విన్నవించుకొని, ఏం చేయనయ్యా , కాసేపు మనసు నిలవదు, బుద్ధి మాట వినదు, ఇంద్రియాలో వాటి దారి అవి చూసుకుంటున్నాయి.



నేనేమో చేతకాని అశక్తుడనయ్యా అని నిర్మోహమాటంగా స్వామి సన్నిధిని విన్నవించి స్వామి! నీ పాదపద్మాలే శరణు! అని భగవద్పాదారవిందాలే భగవంతుని పొందించడానికి ఉపాయమని, ఆ ఉపాయాన్నే స్వీకరించి, ఆ శ్రీరంగనాథుడిని అర్థిస్తే చాలు ఉత్తమ ఫలితాన్ని అందిస్తాడన్న విశ్వాసము కలిగి ఉండాలి.

నిజమే! కాని ఇది మాత్రము మన ఇష్టమా! అందుకని, స్వామీ, నా తండ్రీ! సమస్త కళ్యాణగుణాకరుడవైన నీవే నాకీ విశ్వాసాన్ని కలిగించాలి అని ప్రార్థన చేశారు భగవద్రామానుజులు.

అంతేకాదు, స్వామి నీకు చెందిన ఈ ఆత్మ వస్తువును, దానికి తగిన రీతిలో ప్రవర్తించేలా నువ్వు అనుగ్రహించు అని ప్రార్థించారు. భగవానుడు అలా దిద్దుబాటు చేయకపోతే మన వంటి స్థితిలో ఉన్న వారికి పొందవలసినది భగవత్కైంకర్యమనే బుద్ధే కలుగదు కదా! ఈ శరణాగతి నిష్టులు ఎలా ఉంటారో పరిశీలిద్దాము.

మొదటిరకము వారుః

భగవానుడు అభిమానించి తాను అర్చామూర్తియై వెలసి ఉండే శ్రీరంగము, కంచి మొదలైన దివ్యదేశాల్లో ఉంటూ, ఆ దైవానికి నమస్కరించి, పూజించి, సేవచేసి కాలాన్ని గడుపుతూ ఉంటారు.

రెండవ రకము వారుః

ఆరాధనానాం సర్వేషాం విష్ణోరారాధనం పరమ్ ।
తస్మాత్ పరతరం ప్రోక్తం తదీయారాధనం పరమ్ ॥

దేవతారాధనలన్నింటిలోనూ విష్ణువును ఆరాధించడం శ్రేష్ఠమైనది. అంతకంటే గొప్పది విష్ణుభక్తులను ఆరాధించడం అన్న సత్యాన్ని నమ్మి భగవద్భక్త కైంకర్యము చేస్తూ ఉంటారు.

మూడవ రకము వారుః

భగవంతుని గుణాలను మాటి మాటికి స్మరిస్తూ ఆ అనుభూతితో పరవశించి పోతూ కాలాన్ని గడుపుతూ ఉంటారు.

నాల్గవ రకము వారుః

ద్వయం యొక్క అర్థాన్ని అనుసంధానము చేస్తూ కాలం గడుపుతూ ఉంటారు. ఇందులో చివరి పద్ధతిలో అనుసంధానము చేస్తూ కాలము గడపాలని భావించిన భగవద్రామానుజులు ద్వయార్థాన్ని విస్తారంగా శరణాగతి గద్యలో చెప్పి, శ్రీరంగ గద్యలో కొస్త సంగ్రహముగా తెలుసుకునే వారికి సదుపాయంగా, భగవానునికి వినడానికి విసుకు లేకుండా ఉండేలా అనుగ్రహిస్తున్నారు.



మూలము:

స్వాధీన త్రివిధ చేతనాచేతన స్వరూప స్థితి ప్రవృత్తి భేదం, క్లేశకర్మా ద్యశేష దోషాసంస్పృష్టం, స్వాభావికానవధికాతిశయ జ్ఞాన బలైశ్వర్య వీర్య శక్తితేజః సౌశీల్య వాత్సల్య మార్దవార్జవ సౌహార్ద సామ్య కారుణ్య మాధుర్య గామ్భీర్యౌదార్య చాతుర్య స్థైర్య ధైర్య శౌర్య పరాక్రమ సత్యకామ సత్య సఙ్కల్ప కృతిత్వ కృతజ్ఞతాద్యసంఖ్యేయ కల్యాణగుణగణౌఘ మహార్ణవం, పరబ్రహ్మభూతం పురుషోత్తమం, శ్రీరఙ్గశాయినం, అస్మత్స్వామినం ప్రబుద్ధ నిత్యనియామ్య నిత్యదాస్యైకరసాత్మ స్వభావోఽహం, తదేకానుభవః తదేకప్రియః., పరిపూర్ణం భగవన్తం విశదతమానుభవేన నిరన్తర మనుభూయ, తదనుభవజని తానవధికాతిశయ ప్రీతికారితా శేషావస్థోచితా శేషశేషతైకరతిరూప నిత్యకిఙ్కరో భవాని ॥

ముందుగా తమ కోరిక ఏమిటో చెబుతున్నారు. భగవానుడైన రంగనాధుని వద్ద తాము నిత్య కైంకర్యము చేయాలి అని కోరుకుంటున్నారు. ఆ భగవానుడెటువంటి వాడో ముందుగా తెలియచేస్తున్నారు.

భగవానుడు చేతన, అచేతముల కన్న వేరైనవాడు. వాటిని నియమించేవాడు అని అంటున్నారు. చేతనులు అంటే జీవులు. వీరు మూడు రకాలుగా ఉంటారు. మనవలె జన్మపరంపరా వలయములో పరిభ్రమించేవారిని బద్ధులు అంటారు. కొంతవరకు ఈ లోకములో ఉండి భగవదనుగ్రహము వలన మోక్షాన్ని పొందిన వారిని ముక్తులు అంటారు. ఆళ్వారాదులు అటువంటి వారు. ఇంక ఈ జన్మ మరణాదులనే ఎరుగక, ఎల్లప్పుడూ పరమపదములో ఉండే వారిని నిత్యులు అంటారు. అనంతుడు, గరుడుడు, విష్వక్సేనుడు, మొదలైనవారు. బద్ధుల స్థితి దుర్భరం. వీరికి జ్ఞాన సంకోచము కలిగి ఉంటుంది. ప్రకృతి సంబంధము వలన సహజముగా జ్ఞానానంద స్వరూపమైన వారే అయినా ఈ బద్ధ జీవుల యొక్క జ్ఞానానికి హద్దులు ఏర్పడతాయి. కంటితో కొంతదూరమే చూడగలగడం, చెవితో కొంత పరిధిలో ఉన్న శబ్దాన్నే వినగలిగి ఉండటము. ఇదే బద్ధజీవుల స్వరూపము.

ఇంత నిత్యులు అసలు సంసార సంబంధమే ఎరుగనివారు. ముక్తుల వలె క్రొత్తగా వచ్చిన వారు కారు. అనాదిగా అనంతమైన కైంకర్యమనే సామ్రాజ్యాన్ని అందుకున్నవారు. అదే వారి స్థితి. సదా భగవద్దర్శనం చేయడం, నిత్యస్తుతి శీలురై ఉండడం వీరి ప్రవృత్తి. అందుకే వీరిని నిత్యులు అంటారు. అవి జీవులలోని భేదాలు వారి లక్షణాలు తెలుసుకున్నాము.

ఇంక ప్రకృతిని కూడా మూడు రకాలుగా విభజించవచ్చు. మొదటిది శుద్ధ సత్వమైన అచిత్తు. అది పరమపదములో ఉండే ప్రాకార, మండప, వృక్షాది రూపేణ బయటకు ద్యోతకమవుతుంది. ఇది పంచోపనిషత్ మయమై ఉంటుంది. మన శరీరము పంచభూతాలతో తయారైనట్లే పంచోపనిషత్తుని వ్యవహరింపబడే ద్రవ్యాలతో తయారవుతుంది.

ఉపనిషత్తులంటే మనకు తెలిసి గ్రంధాలు కావిక్కడ. ఈ అచిత్తు తమో గుణం, రజో గుణం అనే వాటితో కలవని శుద్ధ, సత్వ గుణం కలిగి ఉంటుంది. ఎల్లప్పుడూ ఒకే విధముగా ఉంటుంది. నిత్యులు, ముక్తులు కైంకర్యము చేయడానికి తాను సాధనమై ఉంటుంది. భగవానుని రక్షణకు అనుకులంగా దిగి వచ్చినా ఆ స్వామి ధరించే దివ్యదేహముగా, పరిణమించేది కూడా, ఈ శుద్ధ సత్వరూపమైన అచిత్తే! ఇది దాని స్థితి. ఎల్లప్పుడూ ప్రకాశమే దీని లక్షణము.

ఇంక రెండవది ప్రకృతి. ఇది సత్వ రజ స్తమో గుణములు మూడు కలసిన ఒక కలయిక. ఇది ఎల్లప్పుడూ మారుతూనే ఉంటుంది. ఇదే దాని స్వరూపము. ఈ చేతనుల యొక్క కర్మానుగుణంగా మారుతూ ఉండడమే దాని స్థితి. చేతనులకు తమ స్వరూపాన్ని, భగవత్స్వరూపాన్ని కూడా కనబడనీయకుండా చేస్తుంది. ఇది దీని ప్రవృత్తి

ఇంక మూడవది కాలము. ఇది ప్రకృతి కంటే వేరైనది. ఎప్పుడూ ఏకరూపముగా ఉ ండడం దీని స్వరూపము. నిమిషాలుగా అందులో ఇంకా కాష్టలు మొదలైన చిన్న చిన్న భాగాలుగా ఇది విభజింపబడి ఉంటుంది. ఇదే దీని స్వరూపము. ప్రాకృత పదార్థములు వానితో తయారుచేయబడిన చేతనులు. వాటిని నియమించేది కాలమే. వాటి ఉత్పత్తి, వినాశము, కాలాన్ని బట్టే జరుగుతుంది. కనుక అదే దాని ప్రవృత్తి. ఈవిధముగా ఉన్న మూడు రకాల జీవులను మూడు రకాలుగా ఉన్న ప్రకృతి తన స్వాధీనములో ఉంచుకున్నవాడు పరమాత్మ. అంటే వీటన్నిటికీ తాను అంతరాత్మగా ఉండి నియమిస్తాడు అని అర్థము.

సకల చేతనా చేతనముల సత్త, స్థితి, ప్రవృత్తి భగవదధీనము అని చెప్పారు. కనుక, అవన్నీ శరీరముల వంటివి. భగవానుడు ఆత్మ అని తెలుస్తుంది. శరీరము యొక్క సత్త, స్థితి, ప్రవృత్తి ఆత్మాధీనమై ఉంటాయి. దీని వలన భగవానుని సంపద తెలుస్తుంది. చేతనా చేతనములన్నీ ఆ సర్వేశ్వరుని సంపదే కదా!.

వెనుక చేతనా చేతనములు స్వామికి శరీరములు అని చెప్పారు కదా! మరేమున్నది. ఆ శరీరానికి ఉన్న దోషాలు ఆత్మకు అంటవా? అని మనకు సందేహము కలిగే అవకాశమున్నది. ఆధేయము, విధేయము, శేషము అయి ఉన్నది శరీరము అనేది ఉపనిషత్ సిద్ధాంతము.




చేతనా చేతనములన్నీ భగవానునిపై ఆధారపడి, వానికి లొంగి ఉండి వానికే చెంది ఉంటాయి. కనుక, ఇవి స్వామికి శరీరములే మన శరీరములో ఉన్న మనము అంటే జీవాత్మ కూడా జ్ఞానానందాది లక్షణములు కలది. అయినా శరీరమ సంబంధము వలన దాని కుండే జ్ఞానము సంకోచిస్తుంది. అలాగే ఈ చేతనాచేతనములు భగవానునికి శరీరమైనప్పుడు వాటి కుండే దోషములు స్వామికి కూడా అంటూతాయేమో అని తోస్తుంది కాదంటున్నారు. ఎంబెరుమానార్. జీవునికుండే దుఃఖాలు ముఖ్యంగా అయిదు రకాలు.

1)క్లేశములుః

అవిద్య, అస్మిత, అభినివేశ, రాగద్వేషాదులు

అవిద్యః అజ్ఞానము, ఇది మళ్ళీ మూడు రకాలు.

అజ్ఞానముః అసలే తెలియకపోవడం, దేహము కంటే వేరైన ఆత్మతత్త్వం ఉన్నదని ఎరుగక పోవడం

అన్యధా జ్ఞానముః ఒకలా ఉన్న పదార్థము వేరొకలా కనుపించడం. ఈ జీవాత్మ భగవానునికే చెందినది. కాని అది వేరొకరికి చెందినది అని భాసించడం.

విపరీత జ్ఞానముః వరుసకు చెందిన (పరతంత్రమైన) తనను స్వతంత్రునిగా భావించడం. ఇవి మూడు అవిద్య వలన కలుగుతాయి.

అస్మితః దేహాత్మ భ్రాంతి, ఈ శరీరమే నేను అనుకోవడం

అభినివేశముః దేనికైనా కోరుకొని అది లేకపోతే ఉండలేని కోరికని పెంచుకోవడం

రాగముః దేనియందైనా విపరీతమైన ప్రేమ

ద్వేషముః ఎవరియందైనా విపరీతమైన ద్వేషము.

2) కర్మః ఈ క్లేశములకు కారణమేమిటి?

మనము చేసిన కర్మ. ఇది పుణ్యపాపరూపమైనది. ఇవి కాక వీటికి సంబంధించి మరి రెండు విషయాలున్నాయి. మొదటిది

విపాకంః ఈ కర్మ వలన వచ్చే చేప,మనుష్య,తిర్యక్, స్థావరరూపాలు,ఎన్నాళ్ళు ఆ శరీరముతో ఉంటారో తెలియచేసే ఆయుష్షు.

ఆశయముఃఆయా జాతులకు తగిన బుద్ధి విశేషము. ఈ దోషాలేవీ సర్వేశ్వరునిలో లేవు. మూలంలో అశేష అనే పదము వాడారు కనుక జీవునిలో ఉండే దోషాలు కాక ప్రకృతిలో ఉండే దోషము సంతత పరిణామ శీలత, అది కూడా తన కంటనివాడు పరమాత్మ. జీవునికున్న దోషాలు, ప్రకృతి కున్న దోషాలు కూడా ఏనాడు పరమాత్మని స్పృశించలేవు. చెడుగుణాలు లేకపోవడం మాత్రమేనా, అన్ని మంచి గుణాలు రాశీభూతమై ఉన్నవాడు పరమాత్మ.

సర్వేశ్వరుని యొక్క గుణాలను చెప్పడానికి సిద్ధపడుతూ అవి ఎటువంటివో తెలియచేస్తున్నారు. ఆ గుణాలలో కొన్ని అందరికీ ఉపయోగ పడేవి. కొన్ని ఆశ్రితుల విషయములో ప్రవర్తించేవి. కొన్ని ఆశ్రిత విరోధుల విషయములో ఉపయోగపడేవి. ఇవన్నీ స్వాభావికమైనవి. అంటే సహజంగా ఉన్నవి. నీటికి చల్లదనంలాగా సహజంగా ఉండేవి ఈ గుణాలు. అంటే భగవానుడున్నాడు అంటే ఈ గుణాలు ఉండి తీరుతాయి. ఈ గుణములు అంతులేనివి, అంతకంటే మించినవి. మరి ఎక్కడా కానరాని విధముగా ఉండేవి. ఏకైక గుణావధీప్సయా సదా స్మితా అంటారు. యామునాచార్యుల వారు తమ స్తోత్రరత్నములో ఒక్కొక్కటే అంతులేనివి. ఆశ్చర్యము కలిగించేవి ఈ గుణాలు. ఇంకా ఈ గుణాలను వివరిస్తున్నారు.

జ్ఞానముః యో వేత్తి యుగపత్సర్వం ప్రత్యక్షేణ సదా స్వతః అన్నట్లుగా సర్వ కాలములందు సర్వ పదార్థముల గురించి ఒకేసారి తెలుసుకోగలగడమే జ్ఞానము. అనేక రకాలుగా ఉండే ఈ సృష్టిలో ఉన్న అసంఖ్యాకమైన ఆత్మల యొక్క స్వరూప భేదము. నామభేదము ఎరిగి ఉండే శక్తే జ్ఞానము.

బలంః సృష్టించబడిన సకల పదార్థాలను తన సంకల్ప లేశము చేత నిలబెట్టగల సామర్థ్యం

ఐశ్వర్యముఃతననే నిలబెట్టబడిన అన్ని ఆత్మలకు వారి వారి కర్మలను అనుసరించి నడిపించే నియమన సామర్థ్యం



వీర్యః సృష్టి మొదలైన సకల వ్యాపారములు చేసేటప్పుడు అనాయాసముగా చేయడం, ఏమీ మార్పు లేకుండా ఉండడం.

యథా సన్నిధి మాత్రాయ గన్ధః క్షోభాయ జాయతే
మనసో నోప కర్తృత్వాత్తథాసీ పరమేశ్వరః

సువాసన తాను ఏమీ మారకుండానే, ఆ వాసన పీల్చిన వారిని ఆహా, ఓహో అనేలా చేస్తుంది. అదే విధముగా తాను చలించకుండానే యుద్ధములో శత్రువీరులను కకావికలము చేసేది వీర్యము.

శక్తిః సృష్టింపబడిన జీవులు వారి వారికి తగిన ప్రవృత్తులలో అన్వయించడానికి తగిన శక్తిని వారికి అందించే సామర్థ్యము లేదా అఘటిత ఘటనా సామర్థ్యం. అంటే మాములుగా ఎవరూ చేయలేని పనిని చేయగలగడం.

తేజస్సుః పరాభిభవన సామర్థ్యం అంటే ఎదుటి వారిని లొంగ దీసుకోగల శక్తి. ఆనాడు కౌరవుల వద్దకు రాయబారానికి వెళ్ళిన శ్రీకృష్ణుడు.

కురూన్ ప్రచ్ఛాదయన్ శ్రియా అన్నట్లుగా తన కాంతితో వారిని ఆక్రమించేశాడు కదా ! ముండకోపనిషత్తు చెప్పింది.

తమేవ భాన్తం అనుభాతి సర్వం అన్నింటిని తన తేజస్సు చేత ప్రకాశింప చేసేవాడు ఆ పరమాత్మే.

పైన చెప్పిన జ్ఞాన బలైశ్వర్య వీర్య శక్తి తేజస్సు అనే ఈ ఆరుగుణాలు సృష్టిలో ఉన్న అన్నిటికీ, అందరికీ ఉపయోగించేవే ! ఇంక ఆశ్రితుల విషయములో ప్రవర్తించే 12 గుణాలను ఇప్పుడు వివరిస్తున్నారు.

సౌశీల్యంః సౌశీల్యము అంటే తెలుసుకునే ముందు శీలమంటే ఏమిటో తెలుసుకోవాలి.

మహతః మందై స్సనీరంధ్రేణ సంశ్లేషః

గొప్పవారు, తక్కువ వారితో అరమరికలు లేకుండా కలసి ఉండడాన్ని శీలము అంటారు.

ఆ కలసినప్పుడు మనసులో కూడా ఆ కలసిన వారు తన కన్న తక్కువ వారు అనే భావన కూడా లేకుండా ఉండడాన్నే సౌశీల్యము అంటారు.



రామచంద్ర ప్రభువు నర, వానర, రాక్షసులతో చెలిమి చేసుకోవడమే కాక నువ్వు సాక్షాత్తుగా నారాయణుడయ్యా అని దేవతా శ్రేష్ఠులు విన్నపము చేసినా, కాదు కాదు తాను భగవానుడనని భావింపకుండా నేను మానవుడిని నా పేరు రాముడు. మా తండ్రిగారు దశరథుడు అంటూ చెప్పాడు.

వాత్సల్యంః ఆశ్రితుల యొక్క దోషాన్ని ఇష్టంగా స్వీకరించడమే వాత్సల్యము. అప్పుడే పుట్టిన దూడ మీద ఆవుకున్న ప్రేమను వాత్సల్యము అంటారు.

దూడ యొక్క మురికిని ముందుగా శుభ్రం చేస్తే కాని, ఎంత మంచి ఆహారాన్నైనా స్వీకరించదు. అలాగే స్వామి ఆశ్రితుల దోషాలను తొలగించడమే ఇష్టంగా స్వీకరించాడు. వాత్సల్యమంటే ఆశ్రితుల దోషాలు కనుపించకుండా ఉండే ప్రీతి.

గోపాలత్వం జుగుప్సితమ్ గోపాలత్వమనేది హేయమైనది అని భావిస్తారు. అటువంటి నిహీనమైన జాతి తనదిగా స్వీకరించాడు స్వామి. ఇదీ వాత్సల్యము.

మార్దవంః మృదువుగా ఉండడమనేది శరీరానికి సంబంధించిన గుణమే అయినా ఇక్కడ ఆత్మగుణములను సంబంధించిన ప్రకరణం కనుక ఇక్కడ మార్దవం అంటే, కఠినత్వం లేని స్వభావము కలిగి అందుబాటులో ఉండడం, ఆశ్రిత విశ్లేషాన్ని సహించలేని గుణం ఈ మర్దావం. శ్రీరామచంద్రుడు సీతమ్మను ఎడబాసి ఉన్నప్పుడు వాల్మీకి వర్ణిస్తాడు.

అనిద్ర స్సతతం రామః రాముడు ఎప్పుడు నిద్ర లేకుండా ఉండేవాడట. అదీ మార్దవం అంటే.

ఆర్జవంః మనోవాక్కాయము లేక రూపముగా ఉండడం. భగవానుడు ఆశ్రితులతో కలియడానికి మనోవాక్కాయములన్నిటితోనూ ప్రయత్నిస్తాడు. ఆశ్రితుల అనార్జవమే ఆర్జవమా అన్నట్లుగా వారి విషయములో తాను ఋజువుగా ఉంటాడు స్వామి.

సౌహార్దంః అందరి హితాన్ని కోరేవాడు సుహృత్, వాని యొక్క భావము సౌహార్ధం, సు=శోభనం (మంచి) శంసతీతి= కోరుకొనేవాడు, సుహృత్ = అతని యొక్క భావం సౌహార్ధం.

సౌమ్యంః సమత్వం, జాతి, గుణము, ప్రవర్తలో ఉండే తక్కువ ఎక్కువలను పట్టించుకోకుండా, తనవైపు అభిముఖులైతే చాలు. ఎవరికైనా ఆశ్రయించడానికి అనుగుణంగా ఉంటాడు.

ఈ లక్షణాలన్ని రామచంద్రుని వద్ద చూస్తాం.

గుహేన సహితో రామో లక్ష్మణేన చ సీతయా

వనవాసానికి వచ్చినపుడు సీతా లక్ష్మణులతో కలసిన ఆనందాన్ని పొందేడట రాముడు. గుహుడు ఆటవిక జాతివాడైనా రామునికి అమితమైన అభిమానం ఉన్నది. అదేవిధంగా శబర జాతి వనిత అయిన శబరి ఆరాధనను ప్రీతిగా స్వీకరించాడు. (శబర్యా పూజిత స్సమ్యక్) అంటాడు వాల్మీకి.

కారుణ్యంః స్వార్ధనిరపేక్ష పరదుఃఖా సహిష్ణుత్వమ్

ఏ మాత్రం తనకు లాభం లేకుండానే ఒకరి దుఃఖాన్ని పోగొట్టాలనే కోరిక. అంతే కాదు, స్వార్ధ నిరపేక్షంగా, ఇతరుల దుఃఖాన్ని పోగొట్టక నిలువలేని గుణం కారుణ్యం.

ఈ లక్షణము మనము రాముని దగ్గర చూస్తాము. రాముని చూస్తూ అయోధ్యాపురపౌరులు పరవశించి రాముని గుణాలను వర్ణించే సందర్భములో చెబుతారు.

వ్యసనేషు మనుష్యాణాం భృశం భవతి దుఃఖితః ఎవరైనా దుఃఖిస్తే వారి కంటే ఎక్కువగా విచారించే వాడు రాముడు.

మాధుర్యంఃస్వామి స్వభావము చూసిన, రూపం చూసినా, ఆ స్వామి గుణాలు చూసినా, వాని ఐశ్వర్యాన్ని చూచినా సర్వతోముఖమైన స్వారస్తము ఉంటుంది. చంపడానికి వస్తున్నా ఆ అందం మనలను అలరిస్తూనే ఉంటుంది. దీనికి ఉదాహరణే భీష్ముని చెప్పుకోవచ్చు. రథం మీద నుండి చక్రము చేతపట్టి చంపవస్తున్నప్పుడు భీష్ముడంటాడు.

ఏహ్యేహి పుల్లాంబుజ పత్ర నేత్ర నీరజ పత్ర నేత్ర రావయ్యా రా!

ఆంటూ ఆ అందానికి పరవశించి పోయి పిలుస్తున్నాడు భీష్ముడు. శ్రీకృష్ణుడు పాండవదూతగా కౌరవసభకు వెళ్ళినపుడు అక్కడ వారందరికి కలిగిన ఆనందాన్ని ఈ విధముగా వర్ణిస్తాడు.



అసూర్య మివ సూర్యేణ నివాత మివ వాయునా ।
కృష్ణేన సముపేతేన జహర్షే భారతం పురమ్ ॥

సూర్యుడు లేని ప్రదేశము లోనికి సూర్యుడు వచ్చినట్లు, గాలిలేని చోట వాయువు ప్రసరించినట్లు నగరమంతా ఆనంద తరంగితమైనది. ఆ విధంగా రసావహుడై ఉంటాడు స్వామి.

సర్వ సుగంధ సర్వరసః అన్నది ఉపనిషత్తు అన్ని పరిమళాలు, అన్ని రుచులూ ఆ స్వామిలోనే ఉంటాయి. కనుక ఆ నందావహుడయ్యే ఉంటాడు.

గాంభీర్యంః గాంభీర్యము అంటే లోతు. లో లోపల మనోభావాలను బయటకు వ్యక్త పరచకపోవడం. భగవానుడు ఆశ్రితులకు ఏమేమి చేయాలనుకుంటున్నాడో దానిని ఒకరికి తెలుసుకునేందుకి వీలు లేకుండా ఉండడమే! తన గొప్ప తనాన్ని ఆశ్రితుని తక్కువతనాన్ని ఎరుగకుండా ఉండడం. ఆశ్రితులకు ఎన్నో చేసినా ఏమి చేయనట్లే ఉంటాడు. అదేగా గాంభీర్యం.

యం ఆత్మదా బలదా ఉంటుంది ఉపనిషత్తు, తనను తాను ఇచ్చుకుంటాడు. తనను అనుభవించ గలిగిన శక్తిని కూడా స్వామే అందిస్తాడు.

ఔదార్యంః ఆశ్రితులకు కావలసిన వానిని వారిని బ్రతిమాలి మరీ అందించేవాడు. పుచ్చుకొనేవాడు తగిన యోగ్యత గలవాడు కాకపోయినా తానిచ్చేది చాలా విలువనైనదైనా, పుచ్చుకున్నవారు ప్రత్యుపకారము చేయగలిగిన వారు కాకపోయిన ఇవ్వడమే ఔదార్యము.

అయోధ్యాకాండలో రామచంద్రుడు దానాలు చేసిన సందర్భములో చెబుతారు. స సర్వానర్థినో దృష్ట్వా సమేత్య ప్రతినన్ద్య చ అడిగే వారిని చూచి వారిని ఆదరించి ఆనందింపచేసి వారికి కావలసినది అందించేవాడు రాముడు. భగవానుడు గీతలో అంటాడు. ఉదారస్సర్వ ఏవైతే నన్నడిగిన వారందరూ ఉదారులే అంటాడు. తనను అడగడమే ఔదార్యమని భావించేటంత ఔదార్యము కలిగినవాడు స్వామి.

చాతుర్యంః నేర్పు, ఆశ్రితుల దోషాలను లక్ష్మీదేవికి కూడా కనిపించకుండా దాచేవాడు స్వామి. ఆశ్రితులు తన రక్షణ విషయములో సందేహము కలిగి ఉంటే ఆ సందేహాన్ని పోగొట్టి రక్షించడం కూడా చాతుర్యమే! ఈ చాతుర్యం మనం సుగ్రీవ రక్షణములో చూస్తాము. వాలిని చంపి నిన్ను కాపాడుతానయ్యా! అని చెబితే పూర్తిగా నమ్మకం కలుగలేదు సుగ్రీవునకు, ఆనాడు మీ అన్న చంపిన దుందుభి కాయాన్ని 10 యోజనాల దూరం విసిరివేస్తాను చూడు అని విసిరివేసినా నమ్మకం కలుగలేదు. అప్పుడు సప్తసాల వృక్షాలను ఒకే భాణంతో కొట్టి వానికి నమ్మకం కలిగించి మరీ సుగ్రీవుని కాపాడాడు రామచంద్రుడు ఇదీ చాతుర్యం.

స్థైర్యంః ఎన్ని అడ్డంకులు వచ్చినా ఆశ్రితుని రక్షించే ప్రతిజ్ఞలో కొరత లేక ఉండడం, విభీషణుడు శరణు కోరినప్పుడు, సుగ్రీవాదులు వలదని వారించినా వినక సత్యజేయం కథంచన నేను వదలలేను అని స్వీకరించడం దీనికి ఉదాహరణ. పైన చెప్పిన 12 గుణాలు ఆశ్రితులకుపయోగపడేవి.

ఇప్పుడు చెప్పబడే మూడు గుణాలు ఆశ్రిత విరోధుల విషయములో ఉపయోగపడేవి.

ధైర్యంః శత్రువులను లెక్కచేయకపోవడం, లంకలో రావణుడు, వాని సైన్యము కనికందకుండా ఉండగానే వాని తమ్ముడైన విభీషణునికి సముద్రపు ఇవతలనే ఉండగానే పట్టాభిషేకము చేసేసాడు కదా! రావణుని మూలబలం ఎదిరించినప్పుడు ఏ మాత్రం మనసులో తల్లడపాటు లేకుండా మార్పు లేకుండా ఉన్నాడు.

శౌర్యమ్ః అసహాయంగా శత్రుసైన్యంలో ప్రవేశించినా స్వంత సైన్యంలో ప్రవేశించినట్లు ప్రవేశించడం శౌర్యము. రామచంద్రుని పైకి పరసైన్యాలు వచ్చి బాణ పరంపరను గుప్పించినపుడు, తిరిగి తాను బాణాలను ప్రయోగించి ఛిన్నం భిన్నం శరైర్దగ్ధమ్ అన్నట్లుగా ఎదుటి వారి శర పరంపరలను విరిచి ముక్కలు చేసి నశింపచేసిన రామచంద్రునిది శౌర్యము అంటారు.

పరాక్రమమ్ః ఆ స్వామి విల్లుచేత బట్టి బాణపరంపరను గుప్పిస్తున్నప్పుడు చూడాలి. ఆ స్వామి ఆయుధధారియై సంచరిస్తూ ఉంటే శత్రువులు దర్శించి వశపడి పోతారు.

ప్రహర్తారం శరీరేషు అని రాముని గురించి చెబుతున్నారు.

ఇంక ఆశ్రితులకు ఉపేయము (పొందవలసినది)

ఉపాయము (పొందించేవాడు) భగవానుడే అనే విషయాన్ని తెలియజేసే విశేష గుణాలను నాలుగింటిని తెలియచేస్తున్నారు.

సత్యకామః కామమంటే అనుభవింప వలెనని కోరుకొనే విషయము. ఆ స్వామి కావాలనుకొనేవి నిత్యమై ఉంటాయి. ఏమిటవి?

ఆశ్రిత రక్షణ విషయములో ఆ స్వామి కుండే కోరిక. అది ఎప్పుడూ నెరవేరుతూనే ఉంటుంది కనుక సత్యకాముడు ఆ స్వామి.

సత్యసంకల్పః కోరుకున్న వాటిని ఏ అడ్డంకి లేకుండా అనుభవించగలిగిన వాడు స్వామి. ఏమిటవి? ఆశ్రితులు వింత వింత కోరికలు కోరుకుంటూ ఉంటారు. ఏదో నన్ను రక్షించేస్తే చాలదయ్యా కాణవారాయ్ నాకు కనబడేలా ఎదురుగా వచ్చి దర్శనమీయవయ్యా! అని కోరుకున్న వారిని అనుగ్రహించడానికి దేవతలలో దేవతగా, మనుష్యులలో మనుష్యుడుగా ఇంకా ఎన్నో విధాలుగా అవతరిస్తాను అనుకుంటాడు. అంతే, అసాధ్యం సాధ్యమై పోయింది. స్వామి అవతరించి వారిని తరింపచేశాడు.

కృతిత్వముః కృతిత్వమంటే పరోపకారిత్వము. ఒకరికి పనిచేసి తాను పొంగిపోవడం. ఆశ్రితుల కోరిక పూర్తి అయ్యి ఉంటే పొంగిపోయేవాడు స్వామే !

ఈ గుణాన్ని రామాయణము మనకు చక్కగా దర్శింపచేస్తుంది. విభీషణునికి పట్టాభిషేకము చేసిన తరువాత

అభిషిచ్య చ లంకాయామ్ రాక్షసేంద్రో విభీషణః
కృత కృత్య స్తదా రామో విజ్వరః ప్రమోదహః ॥

లంకకు విభీషణుని పట్టాభిషిక్తుని చేసి రాముడు తాను కృతకృత్యుడను అనుకున్నాడు. తాను తాపాన్ని పోగొట్టుకున్నాడు. అదీ స్వామి యొక్క గుణం. అది కృతిత్వము. ఆశ్రితులు చేయవలసిన పనులను, తన మీద పెట్టుకొని తానే చేసి పెట్టడం.



కృతజ్ఞతః ఎవరైనా చేసిన మంచి పనిని మరచిపోకపోవడం, ఎవరైన ఒకసారి స్వామి నీ శరణాగతుడను అంటే చాలు, తరువాత వారు చేసిన దోషాలను చూడకుండా ఆ శరణాగతిని రక్షించడం కృతజ్ఞత ఆశ్రితులకు తానెంత చేశానన్నది మరచిపోయి, ఒక్కసారి ఆశ్రితుడు శరణు అన్నాడు అనే విషయాన్నే గుర్తుపెట్టుకొనేవాడు.

భరతుడు వచ్చి వెనుకకు రమ్మని యాచించినప్పుడు తిరిగి వెళ్ళలేక పోయేనే అంటూ శిరసాయా చితస్తస్య వచనం న కృతం మయా తలవంచి కోరాడు, వినయంగా ప్రార్థించాడు. నేను ఆ చిన్ని తమ్ముని కోరిక నెరవేర్చలేక పేయానే ! అని వాపోతాడు శ్రీరామచంద్రుడు.

ఈ విధములైన గుణములు గలవాడు పరమాత్మ. ఆ గుణములెన్ని? ఎటువంటివి అనే విషయాన్ని ఇంకా తెలియచేస్తున్నారు.

స్వామి ! నా మనసుకు అందిన కొన్ని కల్యాణగుణములను చెప్పాను. అన్నీ కల్యాణ గుణములే! అందరికీ మేలు చేసేవే ! నీ గుణములు. నేను చెప్పలేక మిగిలిపోయిన గుణాలు ఎన్నని చెప్పను? అంటున్నారు రామానుజులు. ఒక పెద్ద సముద్రంలో జలపరమాణువులు ఎన్ని అని చెప్పగలిగితే భగవంతుని గుణాలను గురించి చెప్పగలమట. భారతములో కర్ణపర్వములో దుష్ట చతుష్టయములో ఒకడైన కర్ణుని నోట వచ్చిన మాట చూద్దాము.

వర్షాయుతైః యస్య గుణాః న శక్యాః
వక్తుం సమేతైరపి సర్వలోకైః మహాత్మనః
శంఖ చక్రాసి పాణేః విష్ణో జిష్ణోః వసుదేవాత్మజస్య

శంఖ చక్రాది ఆయుధధారి అయిన వసుదేవ నందనుని గుణాలను చెప్పాలని సర్వలోక వాసులూ కలసి పదివేల సంవత్సరాలు చెప్పదలచుకున్నా చెప్పడానికి సాధ్యం కానివి స్వామి కల్యాణగుణాలు. వరాహ పురాణములో చతుర్ముఖాయుర్యది కోటి వక్త్రః చతుర్ముఖుని కున్నంత ఆయుష్షు ఉండి, ఆ వ్యక్తికి కోటి ముఖాలు ఉన్నా భగవంతుని గుణాలను చెప్పలేము అని తెలియజేసింది. అందువలన స్వామి కల్యాణ గుణములు అసంఖ్యేయములంటున్నారు రామానుజులు.





పైన చెప్పిన కళ్యాణ గుణములు కలవారు ఎవరు?

ఆ కళ్యాణ గుణ విశిష్టుడై ఉపనిషత్తులలో పరబ్రహ్మ అనీ పురుషోత్తముడనీ తెలియచేయబడినవాడు.

పరంబ్రహ్మ భూతంః

బ్రహ్మ అంటే ముందుగా తెలుసుకుందాం! బృహతి, బృంహయతి అనే రెండు నిర్వచనాలను తెలియచేశారు. పెద్దగా ఉండేవాడు. పెద్దగా చేసేవాడు పరమాత్మ.

తాను అంతః బహిశ్చతత్సర్వం వ్యాప్య నారాయణః స్థితః అన్నట్లుగా అంతటా వ్యాపించి ఉండేవాడు కనుక బ్రహ్మ. అంతేకాదు తనను ఆశ్రయించేవారికి మమ సాధర్మ్యమాగతాః అని గీతలో చెప్పినట్లుగా, తమతో సమానమైన స్థితిని కల్పిస్తాడు కనుక బృంహయతి. మళ్ళీ జన్మ లేకుండా తనంత వారినిగా చేస్తాడు. అంటే పెద్దగా చేస్తాడు. కనుక బృంహయతి అని చెప్పవచ్చు. అంతేకాక ప్రళయకాలములో నామరూప విభాగము లేకుండా తనలో చేరి ఉన్న జీవ, ప్రకృతులను సృష్టి కాలము వచ్చాక శరీరాన్ని, ఇంద్రియాలను ఇచ్చి పెద్దగా చేస్తాడు . కనుక ఈ స్వామి బ్రహ్మ, నిరుక్తకారుడు. (నిరుక్తము అంటే వేదములో ఉన్న పదాలకు అర్థము చెప్పిన డిక్షనరీ వంటిది).

బ్రహ్మ పరిభృదం సర్వత్ర అంతట వ్యాపించి పెద్దగా ఉండేదే బ్రహ్మ అని నిర్వచించింది.

బ్రహ్మ అంటేనే ఈ విధముగా అర్థము నిర్ణయించబడినా, లోకములో ఇంకా కొన్నిటికీ కూడ బ్రహ్మ అనే వ్యవహారము ఉండడం వలన వాటి కంటే పెద్దది అని చెప్పడానికి పరంబ్రహ్మ అని ఇక్కడ వ్యవహరిస్తున్నారు.

పురుషోత్తమః భగవానుడు పురుషోత్తముడు. ఈ విషయాన్ని భగవద్గీతలో తెలియచేశాడు.

యస్మాత్ క్షరమతీతోహం అక్షరాదపి చోత్తమః

అతోస్మి వేదే లోకేచ ప్రథితః పురుషోత్తమః

నశించే ప్రకృతి కన్నా, నశించని జీవునికన్నా వేరైనవాడిని నేను. అందువలన నన్ను వేదము, లోకము కూడా పురుషోత్తముడంటుంది. పురుషోత్తమ శబ్దానికి నిర్వచనము చూద్దాం! పురు అంటే ఎక్కువ అని అర్థము.

శ్రీరంగశాయినమ్ః

శాస్త్రాలలో చెప్పబడడం మాత్రమే కాక శ్రీరంగ మందిరములో అందరికీ దర్శనమిచ్చేలా వేంచేసి ఉన్నవాడు. కనులు మొగిడించి స్వామి యొక్క సౌలభ్యానిన తలచుకొని పరవశిస్తున్నారు భగవద్రామానుజులు.

అస్మత్స్వామినంః

కిడన్తదోర కిడక్కె అన్నట్లుగా ఒకేవిధముగా ఆశ్రితుల కొరకై పవళించి ఉండి, అందంతో, సౌశీల్యములోను, నాకు తనతో ఉండే సంబంధాన్ని స్థిరపరచాడు ఆనాడు లక్ష్మణుడు.

గుణైర్దాస్య ముపాగతః అన్నట్లు గుణములకు వశపడి దాసుడనయ్యేలా చేశాడు అంటూ పరవశిస్తున్నారు రామానుజులు.

ఇంతవరకు ఎవరివద్ద సేవ చేయాలి అనే విషయాన్ని చెప్పారు. ఇప్పుడు కైంకర్యము చేసే జీవ స్వరూపమెలా ఉంటుందో తెలియచేస్తున్నారు. తమ స్వభావము చెబుతున్నారు. స్వామి కైంకర్యాన్ని చేయబూనిన తమ స్థితిని తెలియచేస్తున్నారు రామానుజులు.

ప్రబుద్ధమ్ ప్రకర్షేణావగతమ్ః

బాగా తెలిసిన నియమింపబడి ఉండేది ఆత్మ. నిత్య నియామ్యము ఆత్మ. ఎప్పుడు భగవానునిచే నియమింపబడేది ఆత్మ. ఎల్లప్పుడు భగవంతునికి దాసుడై అందులోనే ఆనందాన్ని అనుభవించడమనే లక్షణం ఎప్పుడూ జీవాత్మకుండాలి. ఇటువంటి లక్షణములు కలిగినది నా ఆత్మ అని రామానుజులు తెలియచేస్తున్నారు.



నిత్యము దాస్యములోనే ఆనందమును అనుభవించే లక్షణము ఆత్మకు సహజము. దానిని తాము కలిగి ఉన్నామని రామానుజులు తెలియచేస్తున్నారు. దీని వలన స్వాతంత్ర్యము. ఇతర విషయ ప్రావణ్యము ఉంటే ఆత్మ నశించినట్లే లెక్క అని తెలియచేస్తున్నారు. భగవద్విషయికమైనదే జ్ఞానము. జ్ఞానానికి విషయమై అదే భక్తికి విషయమై ఉండే స్థితి వీరిది. అంటే భగవదనుభవానికి కారణమైన పరభక్తి, పరజ్ఞాన, పరమభక్తులు. వీరికి నిండుగా ఉన్నాయి అని తెలుస్తున్నది.

పరభక్తిః ప్రత్యక్ష సమానముగా భగవానుని అనుభవించడం పరభక్తి, అంటే ఇంద్రియాలలో అనుభవించినంత స్పష్టంగా భగవంతుని దర్శన స్పర్శాదులు కలగడం.

పరజ్ఞానంః జ్ఞానాన్ని స్థిరీకరించుకోవడం

పరమాభక్తిఃవిచ్ఛేదం లేని భగవదనుభవం, అనుభవించాలనే తపన.

ఇందులో మొదటిది విశదమైన అనుభవం

రెండవది విశదతరమైన అనుభవం

మూడవది విశదతరమైన అనుభవం

మూడవ స్థితే పరిపూర్ణానుభవం. ఈ స్థితిలో మరి ఏ ఇతర విషయములు మధ్యన వచ్చి మనసును కల్లోల పరచకుండా భగవద్భావనే సంతతం సాగుతుంది. ఇది కలిగి ఉండాలి అని కోరుకుంటున్నారు భగవద్రామానుజులు. ఇదే మనందరము కోరుకోవలసిన విషయం.

పైన చెప్పిన భగవదనుభవం కలగగానే అపురూపమైన ఒక ప్రీతి కలుగుతుంది. దానితో స్వామికి ఏదో ఒక సేవ చేయాలనే ఆర్తి మొదలవుతుంది.

ఇప్పుడు ఏ సమయములో సేవ చేయాలి అనే నియమముండదు. అన్తఃపురములోనైనా, సభామండపములోనైనా, పూదోటలోనైనా, నీటి బావి వద్దనైనా సరే ఏదో ఒక విధమైన సేవ చేయాలి. పర, వ్యూహ, విభవ, అర్చ ఎవరి వద్దనైనా చేయాలి అనే కోరిక కలుగుతుంది.



ఆ కోరికనే భగవానుని వద్ద ఆవిష్కరిస్తున్నారు. భగవాన్ నేను ఓ విధమైన కైంకర్యము చేయగల వానిని అగుదునుగాక అనేది ఇప్పుడు వీరి ఆకాంక్ష. ఆ చేసే కైంకర్యములో తృప్తిలేక, ఏవేవో, ఎన్నెన్నో సేవలు చేసేయాలనే తపన కలుగుతుంది.

పరమపదములో ఆదిశేషుడు స్వామికి కైంకర్యము చేసే విధానము చూడాలి. నివాస శయ్యాసన పాదుకాంశు కోపధాన అన్నట్లుగా తానే ఆవాసమై తానే పవళించే శయ్య అయ్యి, ఆసనములు, పాదుకలై, ఇలా ఇలా ఎన్ని రకాలుగా సేవలు చేయగలిగితే అన్ని రకాలుగా చేస్తాడు. అదే ఇప్పుడు మన రామానుజుల కోరిక. ఆ పరమపదములో ఉండే ముక్త పురుషాదులు. ఒకసారి చక్కని పూవుల చెట్లు, స్వామి విహారయాత్రగా వచ్చినపుడు జల్లున పూవులు కురిపించి స్వామి్లసినపుడు తామే వింజామరలయ్యి వీచి, సేద తీరుస్తారు. ఇదే విధమైన సేవ చేయాలనేదే మన ఎంబెరుమానార్ వాంఛితం.
రామాయణములో దశరథునికి కౌసల్య చేసే సేవలు వర్ణిస్తూ చెప్తారు.
యదా యదాహి కౌసల్యా దాసీవచ్చ సఖీవచ
భార్యావత్ భగనీవచ్చ మాతృవచ్చో పతిష్ఠతిల

ఇందులో కౌసల్య భార్యలా, దాసీలా, సేవలు చేసింది అంటూ చెల్లెలులా సేవ చేసింది అని కూడా అన్నారు. చెల్లెలులా సేవ ఏమి చేసి ఉంటుంది అని వ్యాఖ్యాతలు పరిశోధించి ఒక నిర్ణయానికొచ్చారు. దశరథుడు అనేకమందిని భార్యలుగా స్వీకరించాడు కదా! క్రొత్త భార్య వచ్చినప్పుడల్లా హారతిచ్చి, దిష్టి తీసి లోపలికి తీసుకొని వెళ్ళేది. అది విచిత్రమైన సేవ. భర్తకు ఆనందాన్ని కలిగించే ఏ సేవ అయినా అది కౌసల్యకు ఇష్టమే! అదేవిధంగా భగవానునికి ఆనందావహమైన సేవ చేయాలి అనేది వీరి కోరిక.

అయితే ఈ కైంకర్యము ఎంతకాలము సాగుతుందని, సాగాలని వీరభిమతమో, చెబుతున్నారు. దీనికి ఒక అవధి ఉండకూడదు. అలా ఆలా ఈ కైంకర్యము సంసేవనము జరుగుతూనే ఉండాలి అనేది వీరి కోరిక.

శరణాగతి నిష్ఠులకైనా, ఉపాసకులకైనా ఫలమీ కైంకర్య ప్రార్థనయే! దీనిని ద్వయములోని రెండవ భాగము (శ్రీమతే నారాయణాయ నమః) లో తెలియచేయబడింది. అదే విషయాన్ని ఇంతవరకు ఈ గద్యంలో చెప్పబడింది.

మూలంః

స్వాత్మనిత్య నియామ్య నిత్యదాస్యైక రసాత్మ స్వభావ అనుసన్ధాన పూర్వక భగవదనవధికాతిశయ స్వామ్యాద్యఖిల గుణగణానుభవ జనిత అనవధికాతిశయ ప్రీతికారితా శేషావస్థోచిత అశేష శేషతైకరతిరూప నిత్య కైఙ్కర్య ప్రాప్తి ఉపాయ భక్తి తదుపాయ సమ్యగ్ జ్ఞాన తదుపాయ సమీచీన క్రియా, తదనుగుణ సాత్త్వికతాస్తిక్యాది సమస్తాత్మగుణవిహీన, దురుత్తరానన్త తద్విర్యయజ్ఞాన క్రియాను గుణ అనాది పాపనాసనా మహార్ణవాన్తర్నిమగ్నః, తిలతైల వద్దారు వహ్ని వద్దుర్వివేచ త్రిగుణ క్షణ క్షరణస్వభావచేతన ప్రకృతి వ్యాప్తిరూప దురత్యయ భగవన్మాయా తిరోహిత స్వప్రకాశః, అనాది అవిద్యా సఞ్చితానన్తాశక్య విస్రంసన కర్మపాశ ప్రగ్రధితః అనాగత అనన్తకాల సమీక్షయాఽ ప్యదృష్టసన్తారోపాయః,
నిఖిలజన్తుజాత శరణ్య! శ్రీమన్నారాయణ!
తవ చరణారవిన్ద యుగళం శరణ మహం ప్రపద్యే.

తాము పొందవలసినదేమిటో చెప్పారు. సరే దానిని పొందాలంటే బోలెడన్ని అర్హతలుండద్దూ! అవేవీ తమలో లేవే! ఎలాగ అవి భయం వేసింది సరే వైద్యుని దగ్గరకు వెళ్లి నాకు ఈ విధమైన అనారోగ్యముంది అని చెప్పకపోతే ఎలాగ ? చెప్పాలి. పొందవలసినది పొందడానికి వేరొకదారి లేదు. అనన్యగతిని, పోనీ నేనేమైనా స్వంతముగా సంపాదించుకో గలవాడినా, నా శక్తి అంటూ నాకేమీలేదు. అకించనుడను. అంతేనా చేసిన పాపాలా బోలెడన్ని. మరీ ఇన్ని అవకరాలున్నవాడిని నీవుగాక మరెవరయ్యా రక్షిస్తారు? అంటూ భగవత్పద సన్నిధిన శరణాగతి చేస్తున్నారు భగవద్రామానుజులు.

అయితే అసలు సిసలైన ఆత్మ తత్త్వం మనసున మెదలి అబ్బ నా ఆత్మ (నేను) ఎంత మంచి లక్షణాలు గలది అనిపించింది కాబోలు, ఒక్కసారి ఆత్మ లక్షణమేమిటో తలంచుకొని మురిసిపోతున్నారు భగవద్రామానుజులు.

ఆత్మ ఎప్పుడూ భగవనిన్నయమనానికి లోబడి ఉండేదీ ఈ ఆత్మ అని తృప్తితో ఉన్నారు. ఇంక శరణాగతి చేసేస్తే, ఆత్మకు గల సహజ లక్షణాలు అభివ్యక్తమై ఫలితాన్ని పొందుతామనే ఆనందంతో స్వాత్మ నా ఆత్మ అంటున్నారు. ఇంక ఆ అనుభవం ఎవరి వలన

కలుగుతుందో ఆ స్వామిని తలచుకొని ఆ స్వామిలో ఉన్న కల్యాణగుణాలు మనసున నిండిపోయి తృప్తితో వానికి చెందిన తమ ఆత్మ ఒక్కసారి తలంచుకుంటున్నారు. ఇటువంటి జీవునకు, అటువంటి పరమాత్మకు ఉన్న సంబంధం తలంచుకొని నా ఆత్మ నిత్యనియామ్యము అంటూ తృప్తితో వెనుక చెప్పిన విషయాన్నే మళ్ళీ ఉటంకిస్తున్నారు. అబ్బ ఎన్ని మంచిగుణాలు కలవాడో కదా! పరమాత్మ అనుకుంటే ఆనందం. ఆస్వామికే చెందినది కదా అని తన ఆత్మను తలచుకుంటే ఆనందం కలుగుతుంది. వీరికి, ఇందులో ఆత్మను గురించి చెబుతూ నిత్య నియామ్య నిత్య దాస్యైకరసాత్మ స్వభావ అంటూ నిత్య శబ్దాన్ని వాడారు. భగవంతుని ఆశ్రయించి వేరే ఏవేవో ఫలితాలను కోరేవారు కూడా. ఒకప్పుడు నియామ్యులే.

ఒకప్పుడు దాసులే! కాని, అలా కాకూడదు. ఎప్పుడూ ఆ లక్షణాలు విడనాడని లక్షణం ఆత్మ స్వరూపం. అది తమ స్వంతం కావాలని కోరుకుంటున్నారు భగవద్రామానుజులు, భగవానుడే తమకు స్వామి. తాము ఆ స్వామికి సొత్తు అనే విషయాన్ని చెబుతూ, ఆ స్వామి యొక్క స్వామిత్వమెటువంటిదో చెబుతున్నారు. అనవధికాతిశయమైన స్వామిత్వం భగవానునిది. ఒక ఉపాధి వలన అంటే శరీర సంబంధము వలన కలిగిన స్వామిత్వమై ఆ శరీరమంతమై పోతే పోతుంది. ఎంతటి మహారాజులైనా, చక్రవర్తులైనా జీవితమంతమైపోతో మరి ఆ సామ్రాజ్యం వారిది కాకనే పోతుంది కదా! వారు ఆ సామ్రాజ్యానికి ఎల్లప్పుడు స్వాములై ఉండరు. అందువలన అనవధికాతిశయ అంతులేని అన్నిటికన్న మించిన స్వామిత్వము అని ఎంబెరుమానార్ తెలియచేస్తున్నారు. ఇటువంటి భగవానుని కైంకర్యము లభించడమే ముఖ్యమైన ఫలం. దీనికి కావలసినదేమిటి? భక్తి ఉండాలి. భక్తి అంటే ఏమిటి' భగవంతుని యందు నిరవధికమైన ప్రీతి.

తైలభారవత్ అవిచ్ఛిన్న స్మృతి సంతానమే భక్తి అంటారు. మధ్యలో విచ్ఛేదం లేకుండా నూనెధార పడ్డట్టుగా తలంపులన్నీ భగవంతునిపైకే ప్రసరించడమే భక్తి, శమము, దమము అనే బాహ్యేంద్రియ, అంతరింద్రియ నిగ్రహాలతో మొదలై ఆస్తిక్యం వరకు సాగేది భక్తి ఇది కలిగితే వెంటనే ఈ భక్తి ద్వారా భగవదనుభవం లభిస్తుంది.

సరే, ఈ భక్తి కలగాలంటే ఏముండాలి? సమ్యక్ జ్ఞానముండాలి. సమ్యక్ జ్ఞానమంటే మంచి జ్ఞానము. ఏమిటీ జ్ఞానము? భగవంతుని స్వరూప స్వభావాదులు. తన యొక్క (ఆత్మ) స్వరూప స్వభావాలు స్పష్టముగా తెలియడం, భగవంతుని వైశిష్ట్యమం, తన దాసత్వం ప్రస్ఫుటంగా తెలియడం. ఆ స్వామిపై అవధిలేని ప్రేమ ఏర్పడుతుంది. అదే భక్తి. అందువలన భక్తి కలగాలంటే దానికి ముందు ఉండవలసినది మంచి జ్ఞానమన్నమాట.

ఈ జ్ఞానము ఎలా మన స్వంతమవుతుంది. దీనికి ముందుగా కర్మాచరణ దోషరహితమై సాగాలి. అంటే, ఆత్మ యొక్క యథార్థ స్వరూపాన్ని ఎరిగి, నేను చేస్తున్నాను. దీని ఫలం నాదే, ఈ చేసే పనిలో నాకు సంబంధమున్నది. అనే మూడు భావాలను వదలివేసి, మనం చేయవలసిన పనిని చేస్తూ నిశ్చితంగా ఉండడమే కర్మయోగం.

ఈ కర్మాచరణ అలవడాలంటే ముందుగా సత్త్వగుణం పెంపొందాలి. దాని వలన భగవద్గీతలో చెప్పినట్లుగా శమో దమస్త పశ్శౌచం క్షాంతిరార్జవ మేవ చ జ్ఞాన మాస్తిక్యమ్ బాహ్యేంద్రియ నిగ్రహం, మనస్సును అరికట్టుకోగలగడం, భోగానుభవములందు ఆసక్తి తగ్గి ఉండడమనే తపస్సును అవలంభించడం, లోనా బయటా కూడా శుచి అయి ఉండడం, ఓర్పు, మనసు, మాట, చేత ఏకరూపంగా ఉండడమనేది ఆర్జవం, భగవద్విషయికమైన జ్ఞానం, వేదములపైనా వేదవేత్తమలపైనా పరిపూర్ణమైన విశ్వాసం కలిగి ఉండడం మొదలైన మంచి గుణాలు అలవడి ఉండాలి.

కానీ, ఇవేవీ లేకపోవడమే కాక దోసాకరులం మనం, మనందరి స్థితిని తమపై ఆరోపింప చేసుకొని తమలో ఉన్న దోషాలను స్వామి ముందు విన్నపం చేస్తున్నారు భగవద్రామానుజులు. ఇది వరకు కర్మ జ్ఞానాదులేవీ స్వతంత్రంగా సంపాదించుకోలేని అశక్తుడను. అకించనుడను అని చెప్పారు. ఇప్పుడు తమలోని దోషాలను తెలియచేస్తున్నారు.

అహిర్బుధ్న్య సంహితలో శరణాగతి చేసే పద్ధతిని తెలియ చేశారు.

అహ మస్మ్యపరాధానాం ఆలయః అకించనో అనన్య గతిః

త్వమేవోపాయ భూతేషు భవేదితి ప్రార్థనామతిః శరణాగతిః

అంటూ తాను అపరాధాలకు నెలవు అనీ వేరొక దిక్కులేని వాడనని భగవానుడే తనకు ఉపాయమని బుద్ధి కలగడమే శరణాగతి అని చెప్పబడింది. అదే పద్ధతిలో రామానుజులు కూడా ఇక్కడ తమ దోషాలను భగవత్సన్నిధిని ఆవిష్కరిస్తున్నారు. వెనుక చెప్పిన కర్మ జ్ఞానాదులు లేవు సరికదా! వాటికీ వ్యతిరేకమైన లక్షణాలున్నాయే! అవేవీ కూడా స్వప్రయత్నం చేత దాటడానికి సాధ్యమైనవి కావు. సామాన్యులకే కాదు, సనకాది మునీశ్వరులకు కూడా భగవదనుగ్రహము చేత మాత్రమే దాటడానికి సాధ్యమవుతాయి. కాని స్వప్రయత్నం చేత సాధ్యమవవు. అటువంటి వ్యాపారాలు చేస్తూ అనాది అయిన పాపముల చేత ఆక్రమింపబడి అదే పెద్ద సముద్రంలా

ముంచేస్తూ ఉంటే అందులో పడి మునుగుతున్నామంటారు. భగవద్రామానుజులు. మనం చేసిన కర్మ వలన లభించిన చెడు ఫలితమే పాపము. ఈ పాపము వచ్చిందంటే మళ్లీ పాపాలను సంపాదించే పనులను చేయిస్తూనే ఉంటుంది. ఈ విధముగా విషయవలయములో మునిగిపోయి పాపాల కడలిలో మునిగిపోతున్నాను తండ్రీ అంటున్నారు రామానుజులు.

అసలు ఆత్మ స్వరూపం జ్ఞానానందమయం కదా! మరి దీనికి పాపాలతో సంబంధ మేర్పడిందేమిటి? ఏముంది ఈ ప్రకృతిలో చేరి ఉండడం వలనే పాపాలతో సంబంధం ఈ ఆత్మకు ఏర్పడింది. ఈ సంబంధం ఎటువంటిది?

తిల తైలవత్, దారువహ్నివత్ నువ్వులలో నూనె ఉన్నట్లు, కర్రలో నిప్పు దాగి ఉన్నట్లు, ప్రకృతి చేత ఆవరింపబడి జీవుడున్నాడు.

ఉపాయం ఎరిగిన శక్తిమంతుడు తప్ప వేరేవ్వరూ ఆ రెండింటినీ విడదీసి చూడలేదు. అలాగే భగవదనుగ్రహం వలన మాత్రమే ఈ ప్రకృతి నుండి జీవుని వేరుగా దర్శించదరు. మనం చేసిన పాపాలననుసరించి భగవానుడు తన మాయను నియమిస్తాడు. ఆ మాయే ప్రకృతి. “మమ మాయా దురత్యయా” నా మాయ దాటరానిది అంటూ భగవద్గీతలో చెప్పాడు. మాయాంతు ప్రకృతిం విద్ధి మాయినం తు మహేశ్వరమ్ అంటూ శ్వేతాశ్వతరోపనిషత్ కూడా మాయ అంటే ప్రకృతి  అని చెప్పింది.

ఈ ప్రకృతికున్న లక్షణమేమిటి‘ సత్త్వరజస్తమో గుణములు కలిగి ఉంటుంది. సంతతము మారుతూ ఉంటుంది. ఇది జడము అంటే చైతన్య రహితము. ఆత్మకు ఈ ప్రకృతితో సంబంధము ఉండడం వలన ఆత్మను అజ్ఞానము ఆవరిస్తుంది. దానితో కర్మపాశాలు బంధిస్తాయి. ఇంక తాను కాని, ఇతరులు కాని ఆ బంధాన్ని ఛేదించలేరు. సహజంగా తన కుండే జ్ఞానం మరుగ పడి పోతుంది జూవులను బంధించే కర్మ పుణ్యపాపరూపంగా ఉంటుంది. పుణ్యకర్మ అనుభవించాలి. సుఖపడాలి అన్నా, మళ్ళీ జన్మ, మళ్ళీ కర్మాచరణ, దాని ఫలం అనుభవించడానికి మళ్లీ జన్మ ఇలా చక్రం పరిభ్రమిస్తూనే ఉంటుంది. కాలమంతా వెచ్చించి ప్రయత్నించినా దీనిని దాటే ఉపాయం వేరొకటి లేదు.

ఈ స్థితిలో తామున్నట్లుగా భావిస్తూ, మనందరి పరిస్థితి ఇదే సుమా అని సూచిస్తూ చేయవలసిన పనిని తాము చేసి చూపిస్తున్నారు. భగవద్రామానుజులు, శ్రీరంగనాథుని సన్నిధిని శరణు కోరుతున్నారు. ఎవరా స్వామి నిఖిల జన్తుజాల శరణ్యుడు అయ్యో ఈ ఆశ్రయిస్తున్న

వానిలో మంచి లక్షణాలు లేవే! చెడ్డ లక్షనాలే ఉన్నాయే! వీడిని కాపాడడమేమిటి ? అనుకోడు. పాపం ఈ శరీర సంబంధం వీడికి కలిగింది. వీరా ఈ కష్టాన్ని తొలగించుకోలేరు. వీరిలో ఎవరైనా ఆశ్రయిస్తే చాలు రక్షిద్దామని సిద్ధమై ఉన్నవాడు. సుబాలోపనిషత్ చెప్పింది.

సర్వస్య శరణం సుహృత్ అని సర్వులకు శరణ్యుడా స్వామే! అంటు జితన్తా స్తోత్రం చెప్పిం సర్వలోక శరణ్యుడని విభీషణుడాశ్రయించాడు.

అంతేకాదు, రాముడు స్వయంగా చెప్పిన మాట చూద్దాం! విభీషణ శరణాగతి సందర్భములో, ఆశ్రయింప వచ్చిన తనదరికి తీసుకు రమ్మని సుగ్రీవునితో చెబుతూ

విభీషణోవా సుగ్రీవయదివా రావణ స్వయమ్

సుగ్రీవా! వచ్చినవాడు, విభీషణుడు కాక రావణుడే అయినాడనుకో వెనక్కు వచ్చేయకు, వానికైనా నేను శరణిస్తాను అంటాడు. అందువలన అఖిల జన్తు జాత శరణ్య అంటున్నారు భగవద్రామానుజులు.

అయితే ఇంతటి కరుణార్ద్ర హృదయుడే అయినా ఈ జీవులు చేసిన తప్పుల వలన ఒక్కొక్కప్పుడు ఆ స్వామి కూడా ఆగ్రహం పొడచూపే ప్రమాదమున్నది. గీతలో చెప్పాడే తానహం ద్విషతః క్రూరాన్ సంసారేషు నరాధమాన్ ఇటువంటి సమయంలో ఏం చెయ్యాలి? కాస్త ప్రక్కకి చూస్తే మనసులో ఆరాటం తగ్గుతుంది. తల్లి శ్రీదేవి చల్లని చూపుతో స్వామిలో కలిగిన తాత్కాలికాగ్రహం వెనుకకు పోతుంది. శ్రీమన్నారాయణుడు కనుక ఆ స్వామిని ఆశ్రయించడానికి మనకు జంకు అవసరము లేదని తెలుస్తున్నది.

నారాయణః నారాయణలో ఉన్న సమాసానికి రెండు రకాలుగా విగ్రహ వాక్యాలు చెప్పినపుడు రెండు రకాలు అర్థాలు సిద్ధిస్తాయి. నారములు ఆధారముగా గలవాడు. నారములకు తాను ఆధారమైనవాడు, నారములు అంటే సర్వజీవ పదార్థాలు భగవానునిలో చేరి ఉంటాయి. కనుక, నారములకు ఆయననూ, స్వామి, సృష్టి జరిగిన తరువాత, మన శరీరమనే ప్రకృతిలోన ఉన్న జీవుడు ఆ జీవుని ఆధారముగా చేసుకొని లోన పరమాత్మ. ఇప్పుడు నారములు ఆయనముగా గలవాడు పరమాత్మ. అందువలన ఎంబెరుమానార్ నారాయణ అంటున్నారు. ఈ జీవులు భగవద్విముఖులై ఉన్నా వారి ఉనికిని వారు స్థిరపరచుకోలేని ప్రళయదశలో కూడా వెన్నంటి ఉండేవాడు. ఆ నారాయణుడే! శ్రీమన్నారాయణ ప్రక్కనున్న మీ ఆవిడను చూచినా, నీ పేరులోనే ఉన్న సౌలభ్యాన్ని చూచినా నిన్నే ఆశ్రయించాలి అని స్పష్టంగా తెలుస్తోందయ్యా! సౌలభ్యాన్ని చూచినా నిన్నే ఆశ్రయించాలి అని స్పష్టంగా తెలుస్తోందయ్యా!





స్వామీ! నీ పద సన్నిధిన శరణాగతి చేస్తున్నాను అంటున్నారు రామానుజులు. ఇక్కడ శ్రీమన్నారాయణ తవ చరణార విన్దయుగళం శరణమహం ప్రపద్యే అంటున్నారు శ్రీమత్ లో లక్ష్మీ సంబంధం.

చరణములు అనడం వలన, సులభముగా ఆశ్రయిందగినవని, ఒకదానికొకటి సరిజోడు అని తెలుస్తుంది. అరవిందములు అనడం వలన అప్పుడే విచ్చుకున్న జంటతామరలవలె సౌందర్య విరాజితములా పాదములని సౌకుమార్య నిదానములా పాదములని, సుగంధ నిర్భరములు ఆ పాదములని తెలుస్తోంది. అటువంటి పాదములనే ఉపాయముగా స్వీకరించిన వాడను నేను అంటున్నారు రామానుజులు.

మూలముః

ఏవన్ మవస్థితస్యాపి అర్థిత్వమాత్రేణ పరమకారుణికోభగవాన్ స్వానుభవ ప్రీత్యోపనీత ఐకాన్తిత కాత్యంతిక నిత్యకైంకర్యైక రతిరూప నిత్యదాస్యం దాస్యతీతి విశ్వాసపూర్వలకం భగవంతం నిత్యకింకరతాం ప్రార్థయే ॥

భగవానుడు తప్పక మనను రక్షిస్తాడు అనే విశ్వాసముంటేనే శరణాగతి ఫలిస్తుంది. అయితే ఆ విశ్వాసము కలగడానికి కారణమేమిటి? మనకున్న శక్తిని బట్టి మనకు ధైర్యము కలిగితే అది ఫలహేతువు. అందువలన భగవద్రామానుజులు చెబుతున్నారు.

తండ్రీ! రంగనాథా! నేను అపరాధాలే చేసేవాడిని. ఏ స్వశక్తిలేని వాడిని. అయినా, నా ప్రార్థనకే దయతలచే వాడవయ్యా! నాకు నిన్ను పొందాలనే తొందరకాని, అడ్డంకులను దూరము చేసుకోవాలనే తపన కాని లేవు. కాని ఒక్కటే ఉన్నది. నీ కైంకర్యాన్ని పొందక పోయిన ఫరవాలేదు అనే భావము లేదు. కావాలి అని నోటితో అన్నాను. వాటినే ఆధారముగా తీసుకొటని నన్ను అనుగ్రహించే కరుణాంతరగుడివి. కనుక నన్ననుగ్రహించి, నీ దాస్య లాభాన్ని అందిస్తావనే విశ్వాసముతో ఉన్నానంటున్నారు. స్వామీ! నేనీ జన్మపరంపరావలయములో పరిభ్రమిస్తున్నాను. నన్ను చూస్తే జాలి కలిగి కాపాడుతావయ్యా! అంటున్నారు.

రామాయణంలో అయోధ్యాపురవాసులు రాముని కళ్యాణగుణములు కీర్తిస్తూ అంవరు. వ్యసనేషు మనుష్యాణాం భృశం భవతి దుఃఖితః ఎవరికైనా ఆపద వస్తే వారి వ్యక్తిత్వాన్ని కాని, వారితో తనకు గల సంబంధాన్ని కాని చూడలేదు. సాటి మనుషులైతే వారి కష్టానికి, వారికన్నా ఎక్కువగా బాధపడే వాడు రామచంద్రుడు. అటువంటి కరుణాంతరంగుడు కనుకు తమను కాపాడతాడని విశ్వాసం కలిగి ఉన్నారు భగవద్రామానుజులు.

ఆ స్వామిని భగవన్ అని సంబోధిస్తున్నారు.

భ = జ్ఞానము, శక్తి, గ = బలము, ఐశ్వర్యము, వ = వీర్యము తేజస్సు అనే ఆరుగుణాలు కలవాడు పరమాత్మ. చివరనున్న అన్ అనే పదము వలన హేయగుణరహితుడు అని తెలుస్తోందిట. ఇటువంటి వాడు కనుక శరణాగతునికి కావలసిన దానిని తెలుసుకొనగలడు. అందించగలడు అనే ధైర్యంతో తమ విశ్వాసాన్ని భగవద్రామానుజులు ఇక్కడ తెలియజేయడానికి భగవశ్ఛబ్దాన్ని వాడారు. కారుణికుడు కనుక నాకు అర్హత లేకపోయినా ఫలితాన్ని అందిస్తాడు. భగవానుడు కనుక నా పనిచేసి పెట్టగలడు అంటూ తృప్తిగా ఉన్నారు.

అయితే తమ కోరిక ఏమిటో స్పష్టముగా చెబుతున్నారు. నేను అనబడే ఈ ఆత్మ తత్వమున్నంత వరకు (అంటే ఎల్లప్పుడూ) భగవద్దాస్యం తమకు లభించాలనేది వీరి కోరిక. దానినే భగవత్సన్నిధిని విన్నవిస్తున్నారు. అయితే ఈ దాస్యము జీతానికి పనిచేసే మన పని వారి దాస్యంలా ఉండకూడదు. ఒకరి నుండి ఏదైనా పొందాలని వారి కింద దాస్యము చేయడం ఒక పద్ధతి. ఏవేవో కోరికలతో స్వామిని ఆశ్రయించేవారు ఈ రకం వారు. ఇవేవీ కాదు. నాకు కావలసినది కైంకర్యము చేయడం. నాకు ప్రీతి పూర్వకమవ్వాలి. ఆ దాస్యం ఇతర విషయాలలో ఉండకుండా భగవద్విషయములోనే ఉండాలి. ఈ దాస్యము చేశాను కనుక ఈ లోక సుఖములు లభించాలి అనే కోరికతో కాకుండా కేవలము అందులోనే అనందానుభూతిని పొందేలా ఉండాలి. అటువంటి దాస్యాన్ని నాకు అనుగ్రహించు స్వామి! అని అర్థిస్తున్నారు.

మూలంః

తవానుభూతి సంభూత ప్రీతికారిత దాసతామ్ ।
దేహి మే కృప యానాథ! న జానే గతిమన్యథా ॥
సర్వావస్థోచితాశేష శేషతైక రతిస్తవ ।
భవేయం పుండరీకాక్ష! త్వమేవైనం కురుష్వమామ్ ॥

ఇంతవరకు తాముగా మాట్లాడిన రామానుజులు ఇప్పుడు ఇతిహాసాలలో పెద్దలు ప్రార్థించిన శరణాగతి స్ఫోరకమైన మాటలను ఉటంకిస్తున్నారు. ఇందులో మొదటి శ్లోకములో భగవంతునితో నీ అనుభవం వలన కలిగిన ప్రీతి వలన చేసే దాస్యాన్ని నాకనుగ్రహించు అంటున్నారు. ఎవరికి? మే! నాకు నీ దాస్యము నందు రుచి తప్ప వేరే అర్హతలు లేని నాకు అనుగ్రహించు! న జానే గతిరన్యథా కరుణాసింధువులైన నీవు తప్ప వేరొకగతిలేదు నాకు. నాథ నీవు తప్ప వేరొక ఉపాయము లేని వాడిని. నీవా ప్రభువును. నేను దాసుడను. నీవు తప్ప వేరెవరు నాకు రక్షకులు? అంటున్నట్లుగా సాగుతుందీ శ్లోకము.



ఇక రెండవ శ్లోకములో భగవద్దాస్యంలో రుచి, ప్రీతి కూడా నీవే కలిగించవయ్యా! అని ప్రార్థిస్తున్నారు. ఇందులో పుండరీకాక్ష శబ్దం సాభిప్రాయం. ఆ కనుల అందముతో తన వైపు కనుల అందంతో తనవైపు ఆకర్షించుకొని, చల్లని చూపుతో అనుగ్రహించమని ప్రార్థిస్తున్నారు.

జాయమానం హి పురుషమ్ ఎవరు జన్మించినపుడు స్వామి కడగంటి చూపులు వాని మీద పడతాయో, వాడే భగవద్భక్తుడవుతాడని భారతము చెప్పింది.

జితన్తా స్తోత్రములో జితన్తే పుండరీకాక్ష అంటారు. ఆ తామరల వంటి నేత్రాల సొగసుకు ముగ్ధులై వశపడిపోతారు. భగవద్భక్తులు.

మూలం:

ఏవంభూత తత్త్వయాథాత్మ్యావబోధ
త దిచ్ఛారహితస్యాపి ఏ త దుచ్చారణ
మాత్రావలంబనేన ఉచ్యమానార్థ పరమార్థ
నిష్ఠంమే మనస్త్వమేవ అద్యైవకారయ ॥

ఈ ప్రార్థన విని భగవానుడు ఈ విధంగా ప్రశ్నించే అవకాశమున్నదని భావిస్తున్నారు భగవద్రామానుజులు. సరేనయ్యా! రామానుజా! నీ కోరిక తెలిసింది. కాని, నీకు దానిని అందించాలంటే, పొందవలసిన భగవదనుభవం గురించి పరిపూర్ణంగ తెలుసుకొని ఉండాలి. దాని మీద ప్రీతి ఉండాలి. అవేమీ లేకుండా ఎలా ఇచ్చేయను? అంటాడని భావించి చెబుతున్నారు.

పెద్దలు చెప్పిన సూక్తులను నేను విని వాటిని తిరిగి నోటితో ఉచ్ఛరించినంత మాత్రాన దీనిలో ఉన్న భావములో నా మనసు లగ్నమయ్యేలా చేయవా తండ్రీ! నాకు తత్త్వ స్వరూపము ఏమీ తెలియదు. పోనీ తెలుసుకోవాలనే కోరిక కూడా లేదు. కాని కేవలము నీ అనుగ్రహము వలన నాకు తత్త్వ యాథాత్మ్య జ్ఞానము కలిగేలా చేయమని ప్రార్థిస్తూ, ఎప్పుడూ చేస్తానంటే కుదరదు. ఇప్పుడే అనుగ్రహించమని రంగనాథుని సన్నిధిన విన్నపం చేస్తున్నారు. భగవద్రామానుజులు.

మూలంః

అపార కరుణామ్బుదే! అనాలోచిత విశేష అశేష లోకశరణ్య! ప్రణతార్తిహర! ఆశ్రిత వాత్సల్యైక మహోదధే! అనవరత విదిత నిఖిల భూతజాతయాథాత్మ్య! అశేష చరాచర భూత! నిఖిల నియమన నిరత ! అశేష చిదచిద్వస్తు శేషిభూత! నిఖిల జగదాధార అఖిల జగత్ స్వామిన్! అస్మత్ స్వామిన్ సత్యకామ! సత్యసఙ్కల్ప! సకలేతర విలక్షణ ఆర్థి కల్పకః ఆపత్సఖ! కాకుత్స్థ! శ్రీమన్నారాయణ! పురుషోత్తమ!

శ్రీరఙ్గనాథ! మమనాథ! నమోఽస్తుతే.

రంగనాథుని కరుణాసముద్రుడా అని సంభోదిస్తున్నారిక్కడ.

కరుణః పరదుఃఖా సహిష్ణుత్వమ్ ఇతరుల దుఃఖాన్ని చూచి ఓర్వలేక పోవడం, ఆ కరుణ ఇంత అని చెప్పలేము. కనుక, కరుణాంబుధే సముద్రముతో పోల్చారు.

ఆ సముద్రము అపార అంతులేనిది అన్నారు. ఆశ్రితుల విషయములో కాక మనుష్య మాత్రులైతే చాలు. వారి కష్టానికి వారి కంటే ఎక్కువ దుఃఖపడేవాడు పరమాత్మ.

ఈ విషయము రామాయణంలో భృశం భవతి దుఃఖితః అన్నప్పుడు తెలుస్తోందని వెనుకనే చెప్పుకున్నాం కదా! ఆ కరుణా సముద్ర ప్రవాహము హద్దులు దాటి ప్రవహిస్తోంది కనుక, అది అపారము.

ఆ కృప ఉండడం వలన ఆ స్వామి .... సర్వలోక శరణ్యుడయ్యాడు.

ఉత్తమ వంశములో జన్మించాడా, అధమ కుల సంజాతుడా, జ్ఞాన పరిపూర్ణుడా, జ్ఞానహీనుడా అనే తేడా లేకుఇఁడా ఎవరు తన పద సన్నిధిన చేరి, శరణు అంటే వారికి శరణ్యుడై ఉండేవాడు పరాత్పరుడు.

శరణు పొందే వారి దుఃఖాలను తొలగించేవాడు ఆ స్వామి.

వాత్సల్య జలధే అంటున్నారు. అప్పుడే పుట్టిన దూడ మీద ఆవుకుండే ప్రేమను వాత్సల్యము అంటారు.

రుచికరమైన ఆహారము తన ముందున్నా దాని కన్నా ముందు దూడ మురికిని నాకి శుభ్రం చేస్తుంది ఆవు. అలానే ఆశ్రితుల దోషాలను తొలగించడంలో ముందుండేవాడు పరమాత్మ.

దీనిని దోషభోగ్యత దోషాన్ని ఇష్టంగా స్వీకరించడం అంటారు వెనుక చెప్పిన కరుణ కంటే గొప్ప గుణమిది.

ప్రాణి సమూహాలన్నిటి యొక్క యథార్థ తత్త్వాన్ని ఉన్నది ఉన్నట్లుగా ఎరిగిన వాడు. ఏ కాలములో నైనా ఇదే లక్షణం గలవాడు పరాత్పరుడు. ఆ స్వామి సత్యకాముడు. అంటే ఆ సర్వేశ్వరునకు తీరని కోరిక అంటూ ఏమిలేదు. కోరిక కలిగిందా తీరిపోయిందే! అందువలన భక్తులు ఏవేవో కానుకలిస్తేనే వారి కోరిక తీరుస్తాడేమో అనే అనుమానం అక్కరలేదు. ఆ స్వామి సత్య సంకల్పుడు.

తాను సంకల్పించిన పనిని తప్పక పూర్తి చేయగల ధీమంతుడా స్వామి.

ఆ స్వామి ఆపత్సఖుడు ఆపదలను పోగొట్టే స్నేహితుడు మనకీ మనము కొన్ని ఆపదలను కొని తెచ్చుకుంటాము. ఇతరుల వలన కొన్ని ఆపదలు వస్తాయి. వాటన్నిటిని పోగొట్టేవాడు భగవానుడు. అందువలన ఎప్పుడైనా ఆ స్వామే శిక్షింపదలచినా,మళ్ళీ తానే ఒడిలో చేర్చుకొని కాపాడుతాడు. క్షమామూర్తి అయిన లక్ష్మీదేవి కూడా మన తప్పుల కెప్పుడైనా విసుక్కుంటే.

ఎన్నడియార్ అదుశెయ్యార్ నా భక్తులు అలా చెయ్యరు అని వెనకేసుకుని వస్తాడు స్వామి. తాను కలిగించిన ఆపదను కూడా తానే తొలగించి కాపాడుతాడు అనడానికి నిదర్శనమైన పేరుతో కాకుత్థ్సా అని సంభోదిస్తున్నారు రామానుజులు.

కకుత్థ్స వంశములో పుట్టిన రామచంద్రుడు తప్పుచేసిన కాకాసురునిపై బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించి మళ్ళీ ఆ కాకి వచ్చి కాళ్ళమీద వాలినపుడు వధార్హమపి కాకుత్థ్సః కృపయా పర్యపాలయ్ చంపదగినవాడే అయిన దయతో కాపాడాడు రామచంద్రుడు. ఆ స్వామి ఎప్పుడూ లక్ష్మీ వశిష్టుడై ఉంటాడు.

అందువలన దోష భూయిష్టులమైన మనం దరిచేరినపుడు అమ్మ ఆయనకు నచ్చ చెప్పి స్వామి అనుగ్రహాన్ని మనకు అందింప చేస్తుంది. ఆ స్వామి నారాయణుడు.

మనందరితో సహజ సంబంధము కలవాడు. కనుక ఒకప్పుడు అమ్మాగ్రహించినా ఆ స్వామి దరిచేర్చుకుంటాడు.

ఇటువంటి దంపతులకు బిడ్డలమైన మనకేమి కొరత అనే ధైర్యముతో భగవద్రామానుజులు రంగనాథుని సన్నిధిని శరణాగతి చేస్తున్నారు. ఆ స్వామి పురుషోత్తముడు. పురు సునోతేతి పురుషః అధికముగా ఇచ్చువాడు పురుషుడు. జీవుడు కూడా పురుషుడే అయినా పరమాత్మ అంత కన్నా అధికుడు కనుక పురుషోత్తముడు. ఆయన ఔదార్యానికి ఋజువు భగవద్గీతలో కనిపిస్తుంది.

ఉదారాః సర్వ ఏవైతే నా దగ్గర పుచ్చుకున్న వాళ్ళందరూ ఉదారులే ! అంటాడు. ఇందువలన పుచ్చుకున్న వాళ్ళనే ఉదారులనే స్వభావము మా స్వామిది.



ఇన్ని గుణాలు కలిగి కంటికి అందనంత దూరములో పరమపదములో ఉంటే శాస్త్రాల వల్ల మాత్రమే తెలుసుకోవాలి. కాని కంటికి కనిపించేలా దేవాలయంలో వచ్చి పవళించి, అనుగ్రహిస్తున్న రంగనాథా! అని తృప్తిగా సంభోధిస్తున్నారు రామానుజులు.

చివరగా రంగనాథా! నమోస్తుతే అంటున్నారు. కంటికి కనపడేలా వచ్చి నీకూ మాకు ఉన్న సంబంధాన్ని తెలియచేస్తున్నావా తండ్రీ! అని తృప్తితో రంగనాథా! నా ప్రభూ అని సంబోధించారు. ఎప్పుడైతే సంబంధ జ్ఞానము కలిగిందో అప్పుడు పలకవలసిన మాట నమః తండ్రీ నాకు నేను చెందినవాడను కాను. నేను నీకే స్వంతమని తమ సర్వభారాలను భగవంతునిపై ఉంచి మనందరి తరపున శరణాగతి చేసారు భగవద్రామానుజులు.

ఈ ఫలితాన్ని మనమందరము అందుకుందాము.

భగవదనుగ్రహానికి పాత్రులమవుదాము.

శ్రీమతే రామానుజాయ నమః

# శ్రీవైకుంఠ గద్య

యామునార్య సుధామ్భోధిమవగాహ్య యథామతి ।
ఆదాయ భక్తియోగాఖ్యం రత్నం సందర్శయామ్యహమ్ ॥

(యామునాచార్యులవారుగా చెప్పబడే ఆళవందార్ అనే అమృతసాగరములో అవగాహించి నా బుద్ధికి అందినంత వరకు భక్తియోగమనే రత్నమును ఎత్తి లోకమునకు నేను చూపుచున్నాను).

అవతారికః

శ్రీభాష్యకారులు ఇదివరకే రెండు గద్యలను సాయించినప్పుడు మూడవ గద్యని సాయించాలని ఎందుకు అనుకున్నారు? అంటే, మొదటి రెండు గద్యలున్నూ శ్రీభాష్యకారులు తమంతట తామే అనుసంధించినట్లు ఉన్నది. ఈ విధముగా తమ మనోభావము చేత నిశ్చయించుకొని ఈ శరణాగాతి అనే అర్థము. తాటిచెట్టు నీడ దాని మూలంతోటే ఉన్నట్టుగా తమ ఒక్కరి వరకే ప్రసరించి ఆగిపోకుండా, కల్పకవృక్షఛాయలాగ అందరికీ ఉపకరించేదిగా ఉండాలి. అందరూ కూడా ఉపాయోపేయాలని గురించిన అనుష్ఠానాన్ని పొందాలి అని భావించి, ఈ గద్యలో ఇతరులకి ఉపదేశము చెయ్యనారంభించారు. పెద్దదైన శరణాగతి గద్యలో సామాన్యంగా సర్వేశ్వరుడిని గురించిన తమ ప్రార్థనగా సాయించారు. శ్రీరంగ గద్యలో సౌలభ్యానికి పరాకాష్ఠ చివరి మెట్టు అయిన సర్వేశ్వరుడిని గురించి ఆయన ఎదురుగా తాము ప్రార్థించినట్లు సాయించారు. ఈ శ్రీవైకుంఠగద్యలో పరత్వానికి చివరి హద్దైన శ్రీవైకుంఠనాథుఢిని గురించి తన శిష్యులకీ, దాసులకీ వాళ్ళు చెయ్యవలసిన వాటిని ఉపదేశము చేస్తున్నారు.

---

శరణాగతి గద్య ప్రారంభమందును, శ్రీరంగగద్య ప్రారంభమందును ప్రారంభ శ్లోకమువలెనే ఈ శ్లోకము కూడా తనియన్ కాదు. సందర్శయామ్యహమ్ (నేను చూపుచున్నాను) అని పూర్తిచేయుటచే ఇది భాష్యకారుల శ్లోకమే. పెరియవాచ్చాన్పిళ్ళై వ్యాఖ్యానించకపోయినను, శ్రీవేదాంతదిశికులు దీని భావమును వివరించి యున్నారు. ఇచ్చట భక్తియోగము అని చెప్పబడినిది. స్వయంప్రయోజనముగా సర్వేశ్వరుని అనుసంధించు భక్తిని చెప్పునదే. అట్లు చెప్పుకొననిచో ఈ గద్యములోనే పైన సర్వేశ్వరుని పొందుటకు ఆయన యొక్క శ్రీపాద కమలముల యందు ప్రపత్తి తప్ప వేయి కల్పకోటుల కాలమైనను నాకు వేరు సాధనము లేదు అని తలంచినవాడై అని సాయించినది వ్యతిరేకించును. అని వేదాంత దేశికులు సాయించి యుండుట చేత ఈ శ్లోకము శ్రీభాష్యకారులదే అని నిశ్చయించవచ్చును.

శ్రీభాష్యంలో భక్తిని ఉపాయంగా నిర్ణయించి, ఈ గద్యల్లో ప్రపత్తిని ఉపాయంగా చెప్పడం ఒకదానికొకటి వ్యతిరేకం కాదా అనే ప్రశ్న వస్తోంది. శ్రీభాష్యంలో భక్తిని ఉపాయంగా నిర్ణయం చెయ్యడం – లోకంలో న్ను వేదబాహ్యములైన మతాలకి చెందినవాళ్ళు ఉపాయాలని గురించి ఎన్నో విధాలుగా చెప్పడం చేత, బ్రహ్మసూత్రాలను అనుసరించి వేదాన్త సిద్ధమైన ఉపాయమనేది అనే దాన్ని చూపించటం కోసమే. ఆ మతాలకి చెందినవాళ్ళు కొందరు (శాస్త్రవిరుద్ధమైన) స్త్రీ పురుష సంయోగము, నిర్వాణ స్త్రీ పూజ మొదలైన వాటిని మోక్షానికి ఉపాయం అంటున్నారు. మరికొంత మంది శివుడు మొదలైన దేవతలని ఉపాసించటమే మోక్షానికి ఉపాయము అని అంటారు. పూర్వ మీమాంసకులు దేవతలు అవసరము లేదు. కర్మమే మోక్షోపాయము అంటారు. మాయావాదులు నిర్విశేషజ్ఞానమైన బ్రహ్మమును గురించిన జ్ఞానమే మోక్షపాయము అంటారు.

ఈ విధముగా ఎన్నోరకాలు చెప్పే వేదవిరోధులని, అపార్థాలని చెప్పేవాళ్ళనీ నిరసించడానికి మీరు చెప్తున్న శాస్త్ర వాక్యాలకి అర్థం మీరు చెప్తున్నట్లు కాదు.

యుక్తులతోను, స్మృతులు మొదలైన ఇతర ప్రమాణాలతో చూచినప్పుడు కర్మయోగము, జ్ఞానయోగము అనే అంగాల చేత ఉపకారం పొందిన భక్తియే మోక్షానికి ఉపాయము చెప్పటమే ఉపనిషత్తులలో అధికంగా కనబడుతున్న నిర్ణయము అని సాధించవలసి ఉన్నందున, భక్తియోగాన్ని ఉపాయముగా చూపించారు. తమ మనోభావమైన ప్రపత్తిని కూడ అక్కడక్కడ తెలిసినప్పటికీ, బాగా ఎక్కువగా చెప్పబడిన బ్రహ్మవిద్యలని ముఖ్యంగా తీసుకొని అలా వివరింజబీచారు. దీనిని గమనించని మందబుద్ధులకి అనుష్ఠించడానికి కష్టసాధ్యమైన ఉపాసన రూపమైన భక్తి ఒక్కటే మోక్షానికి ఉపాయమని భ్రమించి వదలి వెళ్ళకుండా ఈ మూడు గద్యలలో వారికి ఉపాయమై యున్నది.

ప్రపత్తియే  అని చూపుతున్నారు. అందులో మొదటి గద్యయైన శరణాగతి గద్యల ఉపనిషత్తులలో బాగా ఎక్కువగా చెప్పబడిన భక్తి కలగటానికి, బ్రహ్మ ప్రాప్తి అయిన పురుషార్థము లభించడానికి చివరి ఉపాయము ప్రపత్తే అనే విషయాన్ని వివరించారు. భక్తి పరిపూర్ణమవడానికి ప్రపత్తియే అవసరమని ప్రపత్తి యొక్క గొప్పదనాన్ని ఈ గద్యలో చెప్పటాన్ని చూచిన కొందరు ప్రపత్తి భక్తికి అంగమై భక్తియే ముఖ్యమైన ఉపాయమౌతుందా? అని సందేహించడానికి అవకాశము ఉన్నది.





అట్లు సంశయించకుండా ఉండటానికి రెండవ గద్యయైన శ్రీరంగ గద్యలో అనుష్ఠించడానికి సులువైనదై జీవాత్మ యొక్క అత్యంత పరతంత్ర స్వరూపానికి తగినదై మరొకదాన్ని దేన్నీ అంగంగా ఎదురుచూడని, స్వతంత్రమైన ప్రపత్తియే ఉపాయము అనే విషయాన్ని తెలియచేశారు. ఇక ఈ విధముగా ఉపాయాన్ని గురించిన నిర్ణయము కలిగిన తరువాత, శ్రీవైకుంఠగద్యలో ఈ ఉపాయము చేత పొందబడే పరమపదము తాలూకు గొప్ప తనాన్ని, ఆ దేశపు స్వామియై అనుభావ్యుడైన శ్రీవైకుంఠనాథుడి గొప్పతనాన్ని అయనని అనుభవించినందువలన కలిగే కైంకర్యాన్ని, అడిగే వారికి అభినివేశం కలగడానికి ప్రసాదించి ఈ విషయములో అభినివేశం పొందే భాగ్యశాలులు ఈ అరుదైన ప్రయోజనాన్ని పొంది సుఖముగా జీవింతురు గాక!

మొదటి రెండు గద్యలలో విస్తారంగా చెప్పబడిన ఉపాయాన్ని సంగ్రహంగా చెప్పి, పొందవలసిన ఉపేయాన్ని విస్తారంగా ప్రసాదించి పూర్తి చేస్తున్నారు. ఈ గద్యము ఆరు చూర్ణికలతో నున్నది.

మొదటి చూర్ణికతో శరణ్యుడైన పరమాత్మ స్వరూపము, రూపము, గుణము, విభూతి (ఐశ్వర్యము) అనే వాటి విశిష్టతనీ శరణు పొందే వాడైన తాను శేషత్వాది లక్షణాలను గలిగిన వాడనీ అనుసంధించుకొని ఇటువంటి నాకు ఆ పరమాత్మని పొందటానికి ప్రపత్తి తప్ప ఎప్పటికీ వేరు ఉపాయము లేదు అనే నిశ్చయంతో పరమాత్మ యొక్క సౌశీల్యము, సౌలభ్యము మొదలైన గుణాలనే తనకి పట్టుకొమ్మలుగా, ఆయన శ్రీపాదాలను శరణు కోరవలెను అంటున్నారు.

రెండవ చూర్ణికలో ఈ విధంగా శరణు పొందడం, ప్రయోజనాన్ని పొందటానికి ఒకసారే శరణు పొందితే చాలినప్పటికీ, మనస్సు ఇతర విషయాల్లో మునిగిపోకుండా ఉండటానికి, తమకి కాలక్షేపము కావడానికి ఈ శరణాగతిని ప్రతినిత్యమూ అనుసంధానము చేసుకొనవలెనని అన్నారు.

మూడవ చూర్ణికలో ఈ శరణాగతి నిష్ఠుడికి పరమపదాన్ని పొందడం కోసం అర్చిరాది గతి ద్వారా వెళ్ళి ప్రకృతి మండలాన్ని దాటే ప్రకారాన్ని, మూల ప్రకృతిని దాటి వెళ్లిన తరువాత పొందే నిత్య విభూతి అనబడే పరమపదం తాలూకు గొప్పదనాన్నీ, ఆ దేశము ఎలా అమరి ఉన్న విషయమున్నూ అక్కడున్న అలంకారాలనీ ఆ విధముగా అలంకరించబడిన ఆ దేశములో లోకాలకి స్వామినులైన లక్ష్మీదేవీ, భూదేవీ, నీళాదేవిలతో వేంచేసి యుండటాన్నీ, వారి చేత





శ్రీపాద కైంకర్యము చెయ్యబడుతున్న శ్రీవైకుంఠనాథుడినీ ఆ నాయ్చ్చిమారులచే అనుభవించబడే ఆయన యొక్క అవయవ సౌందర్యాన్నీ, ఆ అందానికీ ఒక గొప్పదనాన్నిచ్చే దివ్యాభరణముల శక్తినీ వీటిని రక్షించడానికి ఏర్పడిన శంఖ చక్రాది దివ్యాయుధ సమూహాన్నీ, వీటన్నింటినీ దర్శించి అనుభవించి, ఆ అనుభవం చేత కలిగిన ఆనందముతో అనేకవిధములైన దివ్య దేహములని పొందుతూ కైంకర్యము చేసే నిత్యసూరుల సమూహాన్నీ, వారి చేత సర్వకాలముల యందూ శ్రీపాదముల యందు కైంకర్యము లభించినవాడై వేంచేసియున్న చేర్తినీ, అనుసంధించుకొని ఈ లభించబోయే ప్రయోజనాన్ని మనం సర్వకాలాల్లోనూ పొందబోతున్నాం.

అని ఆశించి ఆ కోరికకి తగినట్లుగా పరమాత్మని మనస్సులో దగ్గరగా చేరి స్వామీ! నాచేత నిత్యమైన కైంకర్యాన్ని నీవు చేయించుకొనటం దాసుడికి ప్రసాదించ ప్రార్థన అని కోరి తన ఆత్మను ఆయన శ్రీపాదముల యందు సమర్పించుకొనవలెను అని ఉపదేశిస్తున్నారు.

నాలుగవ చూర్ణికలో ఇతడి కోరికకి తగినట్లుగా ఆయన యొక్క అంగీకారము పొంది కైంకర్యం చెయ్యవలెను అని చెప్పబడింది.

ఐదవ చూర్ణికలో ఈ మహాప్రయోజనాన్ని చాలా కాలం పోగొట్టుకొన్న లోటు తీరిపోయేటట్లు మనస్సు ఇతరమైన వాటిలో వేటిలోనూ వెళ్లకుండా పరమాత్మను ఎల్లప్పుడూ కన్ను రెప్ప వేయకుండా దర్శించి అనుభవించుచూండే దశని చెప్పుతున్నది.

ఆరవ చూర్ణికలో పరమాత్మ ఈతడితో మాటలు చెప్పి చల్లగా కటాక్షించి తన శ్రీపాదములను ప్రపన్నుడో శిరస్సు మీద ఉంచడం చేత, దాస సామ్రాజ్య పట్టాభిషిక్తుడు (పెరుమాళ్ తిరుమొళి 10-7) అన్నట్లు ఇతడు కైంకర్య సామ్రాజ్యాన్ని పొంది అనాదికాలముగా కర్మవశ్యత అనే దశలోంచి విడిపించబడి నిత్యసూరుల దేశాన్ని నిర్వహించే వారిలో ఒకడుగా ఉండే దశని చెప్పుతున్నది.

ప్రవేశ వివరణము సంపూర్ణమ్

1. స్వాధీన త్రివిధ చేతనా చేతన స్వరూపస్థితి ప్రవృత్తిభేదం

1. మొదటి చూర్ణిక అవతారికః

అందులో మొదటి చూర్ణికలో స్వాధీన అని ఆరంభించి నారాయణమ్ అన్నంత వరకూ పరమాత్మ, స్వేతరచేతనాచేతనముల కంటే భిన్నమైన స్వరూపాన్ని, ఆ స్వరూపానికి తగిన గుణాలను గలవాడని చెప్తుతున్నది.

తరువాతి భాగములో ప్రవేశములో చెప్పిన ప్రకారం ఆయన శ్రీపాదాలను శరణు పొందాలి అంటున్నారు.

వ్యాః స్వాధీన ఈ పదము చేత చెప్పబడే మూడు విధములైన చేతనాచేతనాలు ఈయనికి వశపడియుంటాయని భావము. దీని చేత సర్వేశ్వరుడికి వశపడియుండే సమస్త దశలనీ గల చేతనా చేతనాల వలె కాకుండా ఈయన తన చేష్టలన్నింటినీ తన వశంలో ఉండే స్థితులు గల వాడు అని చెప్తుతున్నది.

ససురాసుర గంధర్వం సయక్షోరగ రాక్షసమ్ ।
జగద్వశే వర్తతేదం కృష్ణస్య చరాచరమ్ ॥ వి.స.స్తోత్రమ్ 133

దేవతలు అసురులు, గంధర్వులతో కూడినదియు, యక్షులు, నాగులు, రాక్షసులుతో చేరినదియు చరాచరములతో చేరినదియు అగు ఈ జగత్తు కృష్ణుని వశములో నున్నది అని చెప్పినట్లుగా, స్వేతర (తన కంటే ఇతర) మైన సమస్త వస్తువులును తన ఇష్ట ప్రకారమే నడుచుకునేవి అని చూపుతున్నది. ఈ విధంగా ఈయనవశంలోనే ఉండే వస్తువులు ఏవి? అంటే (త్రివిధ చేతనా చేతన) సంసారములో కట్టబడి ఉండే బద్ధులు, సంసారము నుండి విడుదల పొందిన ముక్తులు, పిరాట్టిమారులు మొదలైన నిత్యులు అనే మూడు విధములైన ఆత్మలున్ను, ప్రకృతి వికారమైన లీలా విభూతి, శుద్ధసత్త్వమైన నిత్య విభూతి, కాలము అని మూడు విధములైన అచేతనములు అనే ఇవి. ఈయనకి వశపడియుండేవి ఇవి మాత్రమేనా అంటే

(స్వరూప స్థితి ప్రవృత్తి భేదమ్) వీటి యొక్క ధర్మి స్వరూపమున్నూ, ధర్మములైన లక్షణాలున్నూ, వీటి వ్యాపారాలైన క్రియలున్నూ ఈయన ఇష్ట ప్రకారమే ఉంటాయి అని చెప్పబడుతున్నది. (స్థితి) అవస్థ యొక్క లక్షణాలని చెప్తుతున్నది.

నిత్యో నిత్యానాం చేతనాశ్చేతనానాం ।
ఏకో బహూనాం యో విదధాతి కామాన్ ॥ కఠ 2-5-13, శ్వే.6-13




క్లేశకర్మ విపాకాది ఎవడు నిత్యుడును పరమచేతనుడును అయి నిత్యులైన ఎంతోమంది జీవుల యొక్క, కోరికలను తీర్చుచున్నాడో అని చేతనుల లక్షణాలను,

అచేతనా పరార్ధా చ నిత్యా సతతవిక్రియా ।
త్రిగుణా కర్మిణాం క్షేత్రం ప్రకృతే రూపముచ్యతే ॥ పరమసంహిత-2

(జ్ఞానము లేనిదనియు, ఇతరుల కోసమే యున్నదనియు, స్వరూపనాశము లేనిదనియు, ఎల్లప్పుడును మార్పును చెందుచునే యున్నదనియు, సత్త్వరజస్తమోగుణములను గలదనియు, కర్మములను చేయు జీవులు దానిని అనుభవించు స్థానముగా నున్నదనియు చెప్పబడు ప్రకృతి యొక్క స్వరూపమును చెప్పబడుచున్నది) అని అచేతనాల లక్షణాలు నిత్యమైనవి అని చెప్పబడింది గదా!.

స్వరూప శబ్దం చేత ప్రథమ లక్షణ సంస్థానము. స్థితి శబ్దము చేత రెండవ క్షణము నుండి ప్రారంభమై, తరువాతి క్షణముల యొక్క స్థితిని చెప్పడం ఉన్నది. చేతనా చేతనాలు నిత్యాలు గనుక ఆ అర్థం ఇక్కడ కుదరదు. స్వరూపభేదం అని మాయావాదులు చెప్పినట్లు ఒకే ఆత్మకాదు. ఆత్మలు ఒక్కొక్కటీ వేరు వేరు అని చూపుతన్నది. ఇంతకు ముందు 134వ ప్రమాణంలో కూడా జీవులను నియమించే ఏకైకుడైన పరమచేతనుడై ఉన్నవాడు పరమాత్మ అని సూచించబడిందనిన్నీ.

నానాత్మానో వ్యవస్థాతః । వైశేషిక సూత్రం 3-2-20

సుఖదుఃఖాది భేదం కనబడుతున్నందున ఆత్మలు అనేకములున్నవి అని సిద్ధించుచున్నది. అని వైశేషిక సూత్రములో ఆత్మలు వేరు వేరు అని నిరూపించబడటం ఇచ్చట గమనీయం.

కనుక, సుఖదుఃఖములు వేరు వేరుగా ఉండటం చేత ఆత్మలు అనేకములుగా ఉండటమే స్వరూపం అని సిద్ధించినది. స్వభావభేదమనగా ఈ ఆత్మలు తెలుసుకొనేవిగా (జ్ఞాతలు) ఉండటం, కర్తలుగా ఉండటం, అనుభవించునవిగా ఉండటం మొదలైన ఎన్నో లక్షణాలు గలవి అవుతాయి.

ప్రవృత్తి భేదమంటే ప్రతీ ఒక్క వస్తువును గురించిన్నీ తెలిసికొనడం, ప్రతీ కర్మనీ ఆరంభించాలనే కోరిక, ప్రతీ కర్మనీ చెయ్యడం మొదలైనవి. అప్రాకృతమైన అచేతనానికి స్వరూపభేదమంటే ప్రకృతి, దాని నుండి పుట్టే మహత్తు. దాని నుండి పుట్టే అహంకారము

దాని నుండి వచ్చే తన్మాత్రలు, పంచభూతాలు, ఏకాదశేంద్రియాలు అనే భేదాలు గలదిగా ఉండటం, కాలము అనబడే అచేతనానికి స్వరూపభేదమంటే ఒకదానికొకటి కార్యకారణాలుగా ఉండే కలా, కాష్ఠ, ముహూర్తం, పక్షం, మాసం మొదలైన అనేకవిధాలైన దశలు గలదిగా ఉండటం, ప్రాకృతమైన అచేతనానికి స్వభావ భేదమంటే తానుగా ప్రకాశించని జడంగా ఉండటం, పరిణమించేదిగా ఉండటం, నిత్యమైనదిగా ఉండటం, పరార్థంగా ఉండటం, సత్త్వరజస్తమోగుణాలకి స్థానంగా ఉండటం అనేది లేదు. దానికి బదులుగా ఈ మూడు గుణాలు లేకుండా ఉండటం అనే గ్రహించాలి. అన్నీ అచేతనాలకీ ప్రవృత్తి భేదమంటే కర్మలని ప్రారంభించడం అన్నమాట. మట్టి కుండకి వలె తన కార్యవస్తువుకి తాను ఉపాదానంగా ఉండటం కర్మలని ప్రారంభించడం అన్న మాట. మట్టి కుండకి వలె తన కార్యవస్తువుకి తాను ఉపాదనంగా ఉండటం ఆత్మ పరమాత్మలని కప్పి వేసేదిగా ఉండటం, తనంతట తానుగా ప్రకాశించకపోవడం మొదలైనవి.

రాజు మొదలైనవాళ్లకి, తమ అంతఃపురం, శ్వేతచ్ఛత్రం, చామరం మొదలైన ఉపకరణాలు, సేవకులు మొదలైన వాటి స్వరూప స్వభావ వ్యాపారాలన్నీ వశంలో ఉన్నాయా ? అంత మాత్రమేనా? అంటే వాళ్ళకి లేని మరొక గొప్ప తనం పరమాత్మకి ఉన్నది అంటున్నది తరువాతి పదం.

(క్లేశకర్మ (విభాగా) ద్యశేషదోష అసంస్పృష్టం)

వారికి క్లేశము (లోటుపాటులు), పుణ్యపాపాలనే కర్మలు మొదలైన దోషాలుంటాయి. ఈయనకి అవి లేవు అనంటున్నది.

137. క్లేశకర్మవిపాకాశయైరపరామృష్టః పురుష విశేషః ఈశ్వరః (పాతఞ్జలయోగసూత్రం 1-24)
(క్లేశం,కర్మం, విపాకం, ఆశయం అనే వాటి వల్ల స్పృశింపబడని పురుషవిశేషం (ఈశ్వరుడు) అని పతంజలి యోగసూత్రంలో చెప్పబడినట్లు క్లేశం, కర్మ, విపాకం ఆశయం అనే దోషాల చేత స్పృశింపబడని వాడు సర్వేశ్వరుడు. (క్లేశ)

114. అవిద్యాస్మితాభినివేశరాగద్వేషాః పఞ్చక్లేశాః (పాతఞ్జల యోగ సూత్రం 2-3)
(అవిద్య, అహంకారము, పేరాశ, కోరిక, కోపము - ఈ అయిదున్నూ క్లేశములు) అని యోగసూత్రాల్లో చెప్పినట్లు, అజ్ఞానము, అహంకారము, పేరాశ, శబ్దాది విషయాల మీద కోరిక, కోపము అనే అయిదు క్లేశములు అనబడుతున్నాయి.

(కర్మ) పుణ్యం, పాపము అనే రెండు క్రియలున్నూ కర్మమనబడుతాయి

(విపాక) అంటే.

138. సతి మూలే తద్విపాకా జాత్యాయుర్భోగాః (పాతంజలయోగ సూత్రం 2-13)
(క్లేశరూపమైన కారణమున్నపుడు దాని ఫలమైన జాతి, ఆయుష్షు, భోగం అనబడేవి కలుగుతాయి) అని చెప్పినట్లు క్లేశం తాలూకు ఫలములైన జాతి, ఆయుష్షు, భోగము అనేవి విపాకమని చెప్పబడుతాయి (ఆది) శబ్దం ఆశయం అని యోగసూత్రం (1-24)లో చెప్పబడిన వాసననే చెప్పుతున్నది.

139. ఆశయో నామ వాసనా (ఆశయమనేది వాసనయే యగును) అని చెప్పబడింది గదా ! ఈ దోషాలకి వశపడని వాడు సర్వేశ్వరుడు అని భావము. ఇక్కడ క్లేశం మొదలైన నాలుగు దోషాలని చెప్పటం అన్ని దోషాలకీ ఉపలక్షణం.

140. ఏవం ప్రకారమమలం నిత్యం వ్యాపకమక్షయమ్ ।
సమస్త హేయరహితం విష్ణ్వాఖ్యం పరమం పదమ్ ।   (వి.పు 1-22-53)
(ఇటువంటి విష్ణువు యొక్క పరమప్రాప్యమైన స్వరూపం, మాలిన్యం లేనిది, నిత్యమైనది, సర్వవ్యాపియై దోషములు లేనిదై హేయత్వమేదీ లేనిదిగా నున్నది) అనే శ్లోకములో కూడా వెనుక శరణాగతి ప్రారంభంలో చెపిపన శ్లోకాల్లోనే విష్ణుపురాణములో పరమాత్మ సమస్త హేయములకూ ప్రత్యనీకుడని చెప్పబడటం ఇక్కడ అనుసంధేయం.

ఈవిధంగా సమస్త హేయ ప్రత్యనీకుడుగా ఉండటం తప్ప వేరు గొప్పతనాలేమీ లేవా? అంటే సమస్త కల్యాణగుణాలకీ ఏకైక స్థానమైనవాడు అనే గొప్పతనం ఉన్నది అంటున్నారు తరువాతి పదము చేత (స్వాభావికానవధికాతిశయ జ్ఞానబలైశ్వర్య వీర్యశక్తితేజః) ఆయన యొక్క కల్యాణ గుణాలు చెప్పబడ్డాయి.

141. పరాస్యశక్తిర్వివిధైవ శ్రూయతే । స్వాభావికీ జ్ఞానబలక్రియా చ ॥ (శ్వే. 6)
(ఈ పరమాత్మకు ఎన్నోవిధములైన, గొప్పదైనటువంటి శక్తియు, సహజమైన జ్ఞానము, బలము (సృష్టించడం మొదలైన) కార్యములున్నూ ఉన్నవని తెలియుచున్నది).

142. త ఇమే సత్యాః కామాః ॥ (ఛాం. 8-3-1)
(అటువంటి ఈ భగవద్గుణాలు ఎప్పటికీ యున్నవి) అని ఉపనిషత్తులలో చెప్పబడినట్లుగా, ఒక సాధనమును అనుష్ఠించడంచేతనో ఒక దేవత యొక్క ప్రసాదం చేతనో వచ్చినవి కావు. ఒకప్పుడు నశించిపోయేవీ కావు. సహజమైనవి అనే విషయాన్ని స్వాభావిక శబ్దం చూపుతున్నది. ఈ గుణాలు భగవత్స్వరూపము ఉన్నకాలమంతా దానితో కలిసే ఉండేవి అని భావము. ఈ విధంగా సహజమైన ఈ గుణాలు పరిమితంగా ఉంటాయా అంటే (అనవధికాతిశయ)

తేజః ప్రభృతి

143. యతో వాచో నివర్తన్తే అప్రాప్య మనసా సహ ।
ఆనందం బ్రహ్మణో విద్వాన్ న బిభేతి కుతశ్చనేతి ॥

(ఏ బ్రహ్మము నుండి మనసుతో బాటు కూడిన వాక్కులు (దాని హద్దులు కనిపెట్టలేక) వెనుకకు తిరిగి పోయినచో ఆ పరమాత్ముని ఆనందమును తెలిసినవాడు దేనివలనను భయపడడు) అని ఉపనిషత్తులోనూ, ఉయర్వఱ ఉయర్నలమ్ ఉడైయవన్ యవనవన్ తిరువాయ్‌మొళి 1.1.1 అని ద్రావిడ వేదములో కూడా చెప్పబడినట్లు అనంతములైన అనేక గుణములు గలవాడుగా నున్న వాడు పరమాత్మ అంటున్నది ఉన్న గుణాలకి హద్దు లేకపోయినా లేని గుణాలు కొన్ని ఉంటాయా ? ఉన్న గుణాలేవి? అనే ప్రశ్నవస్తే, చెప్తున్నది – (జ్ఞానబల ఐశ్వర్య వీర్యశక్తి తేజః ప్రభృతి అసంఖ్యేయ కల్యాణగుణగణౌఘ మహార్ణవమ్) ఈ గుణాల్లో జ్ఞానము అంటే మరొక దానికి అధీనము కాకుండా తానే ప్రకాశించే పదార్థం. ఈ జ్ఞానమే ఆనందాన్ని కలిగించినప్పుడు ఆనందము అని చెప్పబడుతున్నది. ఈ విధముగా నాథమునులు న్యాయతత్వశ్లోకము ప్రకారము సర్వకాలమందును సర్వపదార్థములను ప్రత్యక్షంగా చూడటం ఆనందం అవుతుంది)

144. స దాధార పృథివీం ద్యాముతేమామ్ (తై.సం. 4-2)

ఆ పరమాత్మ ఈ భూమినీ, దేవలోకాన్నీ ధరించియున్నాడు) అని వేదములోనూ,

145. అథవా బహునోక్తేన కిం జ్ఞానేన తవార్జున ।
విష్టభ్యాహమిదం కృత్స్నమేకాంశేన స్థితో జగత్ ॥ గీ.10-42

(అర్జునా! ఈ జ్ఞానమును గురించి ఎంతో చెప్పటం ఎందుకు. నేను ఈ లోకాన్నంతటినీ నా శక్తిలో ఒక చిన్న భాగంతో ధరించి యున్నాను) అని గీతలో కూడా చెప్పినట్లు రెండు విభూతులనీ అనాయాసంగా ధరించగలది బలము ఐశ్వర్యమంటే –

146. క్షరం ప్రధానమమృతాక్షరం హరః । క్షరాత్మనావీశతే దేవ ఏకః (శ్వే. 1-10)

(క్షరమనబడునది ప్రకృతియే, అమృతము గనుక అక్షరమనుబడువాడు జీవుడే. ప్రకృతి జీవులను ఒక దేవుడు నియమించుచున్నాడు) అని చెప్పినట్లు మూడు విధాలుగా ఉన్న చేతనాచేతనాలని తన ఏకఛత్రచ్ఛాయలో ఉంచి పాలించగల సామర్థ్యము, శక్తి వీర్యమనగా

147. న శ్రమో న చ ఖేద స్తే జగద్ధారణ శాసనే

(జగత్తుని ధరించుటలోనూ నియమించటంలోనూ మీకు శ్రమ లేదు, దుఃఖమును లేదు) అని చెప్పినట్లు లోకాన్ని ధరించడంలనూ నియమించడంలోనూ శరీరమున్న ఇతరులకు కలిగే శ్రమలు ఇతడికి ఎప్పుడూ లేకనే ఉండుట. శక్తి అనగా, ఈ పదవ్యాఖ్యాన ప్రారంభంలో ఎత్తుకొనబడిన 141వ ప్రమాణమైన ఉపనిషద్వాక్యం (పరాస్య శక్తి...)లోనూ

అసంఖ్యేయ

148.నహి పాలనసామర్థ్యం ఋతే సర్వేశ్వరం హరిమ్ ।

స్థితౌ స్థితం మహాప్రాజ్ఞ భవత్యన్యస్య కస్యచిత్ ॥ (వి.పు. 1.22.21)

(మహాబుద్ధిమంతుడా! రక్షణలో స్థిరముగా ఉండే సర్వేశ్వరుడైన హరిని తప్ప వేరెవరికిని రక్షించగల సామర్థ్యము లభించదు గదా!) అనే విష్ణుపురాణ శ్లోకంలోనూ.

149.చేష్టా తస్యాప్రమేయస్య వ్యాపినోవ్యాహతాత్మికా –

(కొలుచుటకు సాధ్యము కాని సర్వవ్యాపియైన ఆయన యొక్క చేష్ట అడ్డులేనిదే యగును) అనే ప్రమాణంలోనూ చెప్పినట్లుగా తాను ఎత్తుకొనిన చేష్టను అడ్డులేకుండ పూర్తిచేయగల సామర్థ్యం తేజస్సనగా

150.రకారాదీని నామాని రామత్రస్తస్య రావణ ।

రత్నాని చ రథాశ్చైవ త్రాసం సంజనయన్తి మే ॥ (రా.అర 39.17)

(రావణా రాముడికి భయపడుతున్న నాకు ర అనే అక్షరంతో ఆరంభమయ్యే రత్నములు మొదలైన నామాలు కూడా భయాన్ని కలిగిస్తాయి) అని శ్రీరామాయణములో మారీచుడు చెప్పినట్లు ఇతడు ఏమీ చేయకున్నప్పుడు కూడా ఇతడి పేరు వినగానే శత్రువులు కడుపులో ఆవేదన పడేటట్లుగా నున్న గొప్పతనము (గౌరవం). అలా కాకుండా చాలా ప్రయత్నం చేసి చెయ్యవలసిన కార్యాన్ని అల్ప ప్రయత్నం చేతనే పూర్తిచేయగల సామర్థ్యం చెప్పేదని కూడా చెప్పవచ్చు, అలా కాకుండా.

151.న తస్యేశే కశ్చన తస్య నామ మహద్యశః (తై.నా. 1-9)

(ఆ పరమాత్మను నియమించే వాడు ఎవడు లేడు. ఆయనకొక్కడికే గొప్ప యశస్సు (కీర్తి) యున్నది అని ఉపనిషత్తులో చెప్పినట్లు వీర్యము, శక్తి మొదలైన గుణముల చేత కలిగే కీర్తిని తేజస్ శబ్దం చెప్తుందని కూడా చెప్పవచ్చు. ఈ ఆరు గుణాలేనా ఉన్నాయి ఈయనకి అంటే (ప్రభృతి) మొదలైన

152.తవానన్తగుణస్యాపి షడేవ ప్రథమే గుణాః ।

యైస్త్వయైవ జగత్ కుక్షావన్యేప్యన్తర్నివేశితాః ॥

(భగవానుడా! లెక్కలేని గుణాలను గలవాడివిగా నున్నప్పటికీ మీకు ఆరే గుణాలు ముఖ్యమైనవి. దేవరవారు లోకాన్ని కడుపులో పెట్టుకున్నట్లుగా ఈ గుణాలు మిగతా గుణాలని తమలో పెట్టుకొని యున్నాయి గదా! అని చెప్పిన ప్రకారము ముఖ్యమైన గుణాలు గనుక వీటిని ఎత్తి చూపించడం జరిగింది. వీటితో ఆరంభమైన గుణాలు అనేకములు వీటి లోపల ఉన్నాయంటున్నారు. ఈ విధంగా అనేక గుణాలు ఉన్నప్పటికీ ఎన్ని అని వాటికి లెక్క ఉన్నదా అంటే (అసంఖ్యేయ)

కల్యాణ గుణగణౌఘ

153. సంఖ్యాతుం నైవ శక్యన్తే గుణా దోషాశ్చ శార్ఙ్గిణః ।
ఆనన్త్యాత్ ప్రథమో రాశీరభవాదేవ పశ్చిమః ।
(శార్ఙ్గమను వింటిని ధరించిన వాని గుణములను, దోషములను లెక్కించలేము. వెనుక చెప్పిన గుణములు లెక్కకు మించినవి గనుక లెక్కించలేనివి. తరువాత చెప్పిన దోషములు లేవు గనుక లెక్కించుటకు సాధ్యము కాదు) అనే ప్రమాణములోనూ

64. చతుర్ముఖాయుర్యది కోటివక్త్రో భవేన్నరః క్వాపి విశుద్ధచేతాః ।
స తేగుణామయుతైకదేశం వదేన్న వా దేవవర ప్రసీదః ॥ వరాహ 73-94
(ఎంతోమంది బ్రహ్మల ఆయుష్షు గలవాడై కోటి ముఖములు గలవాడై అత్యంత పరిశుద్ధమైన మనస్సుగల మనుష్యుడుగాని ఉంటే, అతడు నీ యొక్క గుణములలో పదివేలలో ఒకవంతు చెప్పగలడో లేడో తెలియదు. దేవతలలో శ్రేష్టుడా! కటాక్షించవలెను) అనే ప్రమాణములోనూ ఈయన యొక్క గుణాలు లెక్కించ సాధ్యము కానివి అని చెప్పబడినది. ఈ విధముగా లెక్కకు మించినవిగా నుండుట హేయగుణాలతో కలిపా? అంటే (కల్యాణ) వెనుక 153వ ప్రమాణములోను, 140 ప్రమాణంలోనూ,
సమస్త కల్యాణగుణాత్మకోసౌ స్వశక్తిలేశోద్ధృతభూత సర్గః ।
ఇచ్ఛాగృహీతాభిమతోరుదేహస్సంసాధితాశేషజగద్ధితోసౌ ॥ (విపు 6-5-84)
ఈ భగవానుడు సకల కల్యాణగుణములను సహజముగా గలవాడు, తన యొక్క శక్తిలో ఒక చిన్నభాగముచేతనే ధరింపబడిన భూతములను గలవాడు. తన ఇచ్ఛచేతనే ఎత్తుకొనబడినవియు, ఇష్టమైనవిన్నీ అనేక విశేషమైన దేహములను గలవాడు ఇతడు సమస్త జగత్తునకును మంచిని చేయువాడు) అన్న శ్లోకంలోనూ.

154. బహవో నృప కల్యాణగుణాః పుత్రస్య సన్తి తే (రా.అ.2.25)
(ఓ రాజా నీ కుమారునిలో అనేక కల్యాణ గుణములున్నవి) అనే శ్రీరామాయణ శ్లోకములోనూ చెప్పినట్లు హేయగుణాలు ఏమీ లేకుండా, కల్యాణగుణాలు లెక్కలేనన్ని యుండును) (కల్యాణ) వాటికి స్థానమైన ఆయనకీ, వాటిని అనుభవించే వారికీ మంగళములను కలిగించేవై, సుఖాన్ని అందించేవై ఉంటాయి.

155. కల్యాణం మంగళం శుభమ్ (అమరమ్ 1-4-25)
కల్యాణము, మంగళము, శుభము అనునవి పర్యాయపదములు) అని అమరకోశములో చెప్పబడింది గదా! లోకములో గుంపులుగా చేరి యుండే ప్రదేశాల్లో ఇక్కడ ఎంతమంది జనాలో! దుఃఖమో, సుఖమో అని అడగడం వలన దుఃఖానికి ప్రతిభటమైన సుఖాన్ని కల్యాణ శబ్దం చేత ఇక్కడ చెప్పడం జరిగింది (గుణ) విన్న వెంటనే చెవి మూసుకొనవలసి రాకుండా

గుణ్యన్తే ఇతి గుణాః (తిరిగి తిరిగి చెప్పి అనుభవించడం చేత గుణములు అనబడు తున్నాయి) అన్న వ్యుత్పత్తి ప్రకారమ్ ఈఱ్కిన్ఱ గుణఙ్గళైయుడైయాయ్ (తి.వా.మొ 8-1-8) అన్న ద్రవిడవేదము ప్రకారం ఆహా ఆహా అని ఎన్నో సార్లు మళ్ళీ మళ్ళీ చెప్పుకొనేటట్లు ఉన్నవి. ఈ విధంగా కొన్ని గుణాలు మాత్రమే లెక్క హద్దు లేకుండా ఉన్నాయా? అంటే (గణ)

156. తం దృష్ట్వా తే తదా దేవాః శఙ్ఖ చక్ర గదాధరమ్ ।
అపూర్వరూప సంస్థానం తేజసాం రాశిమూర్జితమ్ ॥ వి.పు. 1-9-67

(శంఖ చక్రధరుడై, అపూర్వమైన దివ్యమఙ్గళవిగ్రహం గలవాడై దృఢమైన తేజోరాశియైన వానిని అప్పుడు చూచి దేవతలు స్తుతించిరి) అని శ్రీవిష్ణుపురాణంలోను ఒణ్ శుడర్కత్తై అద్వితీయమైన, ఒకచోట చేర్చిన తేజోరాశుల యొక్క గుత్తి అని తి.వా.మొ 1-7-4లో చెప్పబడినట్లు చెప్పబడినట్లు శూరత్వము, చాతుర్యము, స్థైర్యము, మొదలైన గుణాలు అందరికి నాయకుడుగా ఉన్నటువంటి స్వామిత్వములతో చేరియుండుట శరణ్యుడగుట అనే భవ్యత్వం, కృప, దోషసహిష్ణుత, శ్రమలను దుఃఖాలను సహించగలిగే శక్తి, దోషాలని కూడా గుణాలుగా భావించే స్వభావము, ప్రత్యుపకారాన్ని ఆశించకపోవడం, అనే గుణాలు సౌలభ్యంతో చేరినవి. తన గొప్పతనాన్ని తెలియకపోవటం, ఇతరుల దోషాలని చూడకపోవటం, కపటం లేకుండ ఉండటం మొదలైన గుణాలు సౌశీల్యమనే అందరి తోటీ సులువుగా కలిసిపోవటమనే గుణంతో చేరినవి. ఆశ్రితుల మీద పక్షపాతము కలిగి ఉండటం, దోషభోగ్యత్వము, నిరపేక్షత మొదలైన గుణములు, వాత్సల్యగుణంతో కలిసి ఉండటం, ప్రియత, మోదం, ప్రమోదం, ఆనందం, మొదలైన గుణాలు సంతోష గుణంతో చేరినవి. ఈ విధముగా ప్రతీ గుణంతో చేరి ఉన్నవి ఎన్నో గుణాలు అటువంటి గుణముల సమూహములు. వాటికి అంతు లేదు అని చెప్తున్నది. అటువంటి గుణాలే వేరువేరుగా ఉన్నాయా అంటే (ఓఘ) ఊళ్ళో నుండి వచ్చే పిల్లకాలువ, అడివిలోంచి వచ్చిన ప్రవాహము, కొండలమీంచి వచ్చిన జల ప్రవాహము చెరువులు కొట్టేసి వచ్చిన ప్రవాహము ఇలా అన్ని జలప్రవాహాలు వచ్చి చేరినట్లైతే ఆనకట్టలు, గట్లు తెంచుకొని ఒడ్లు కనబడకుండా అలలతో నిండిన ప్రవాహము వస్తున్నట్లు అన్ని గుణాలు ఒక పెద్ద ప్రవాహం లాగ ఉంటుందంటున్నారు. ఎన్నో జల ప్రవాహాలు కలిసిపోయిన నదీ ప్రవాహము వేరు వేరు నీళ్ళని వేరు చేసి చెప్పటానికి వీలు కాకుండా ఉంటుంది. ఒడ్లు తెంచేసుకొని పెరిగినా ఒకచోట ఉండకుండా పరుగులు పెట్టి పారుతుంది. కొండమీది

నీటి ప్రవాహము క్రిందికి పరుగుపెడితే, ప్రవాహము ఎండిపోతుంది. అలాగ ఈయన దగ్గరున్న గుణాల ప్రవాహాలున్నూ స్థిరంగా ఉండవా, ఎప్పుడో ఒకప్పుడు నశించిపోతాయా? అంటే (అర్ణవమ్) సముద్రంవలె స్థిరమైనదీ, నిత్యమై ఉండేవీ అని చెప్తున్నారు.

మహార్ణవం పరమపురుషం భగవన్తం

157.సర్వదాభిగతస్సద్భిస్సముద్ర ఇవ సింధుభిః (రా.బా 1-16) (నదులు సముద్రాన్ని చేరినట్లే మంచివారి చేత ఎల్లప్పుడు ఆశ్రింపబడేవాడు శ్రీరాముడు) అని శ్రీరామాయణంలో చెప్పినట్లు అన్ని నదుల నీరున్నూ చేరి సముద్రములో పడగా, ఆ నీళ్ళు ఆ సముద్రాన్ని వదలి వెళ్ళక, ఎండిపోకుండా, ఎలా ఉంటాయో అదేవిధంగా ఇక్కడ కూడా అన్ని గుణాలు ఒకటిగా చేరిపోయి నిత్యంగా ఉంటాయి.

(అర్ణవమ్) నీటి సముద్రం. అంటే శుద్ధమైన నీటి సముద్రం, పురాణాల్లో జంబూ, ప్లక్ష, శాక, శాల్మలి, కుశ, క్రౌంచ, పుష్కర అనే ఏడు ద్వీపాలున్నట్టుగను వాటిని చుట్టి వరుసగా ఉప్పునీరు, చెరకురసము సముద్రం, సురాసముద్రం, సర్పి (నెయ్యి) సముద్రం, దధి సముద్రం, క్షీర సముద్రం, శుద్ధజల సముద్రం అనేవి ఉన్నాయని చెప్పబడుతున్నది. వీటిలో మొదటివైన ఆరు సముద్రాల వలె పరిమితమైనవిగా కాకుండా, చివరగా నున్న శుద్ధజలసముద్రం వలె, ఈయన గుణాలు కూడా చాలా ఎక్కువగా మితిమీరి ఉంటాయి అని అర్థం. అలా అయినా, ఆ శుద్ధజలసముద్రం, లోకాలోకాచలమ్ అని చెప్పబడే పర్వతంతోనూ, శ్వేతద్వీపము అనే ద్వీపంచేతను చుట్టబడినదై అంతులేనిదిగా ఉంటుంది, ఈయన గుణాలు కూడా అదేవిధంగా ఉంటాయో అంటే (మహార్ణవమ్)

158.ధాతూనామివ శైలేన్ద్రో గుణానామాకరో మహాన్ (రా.కి. 15-21) (ఒక విశేషమైన కొండ ధాతువులకి స్థానమై ఉన్నట్లు శ్రీరాముడు కూడా గుణాలన్నింటికీ పెద్ద స్థానమై ఉన్నాడు) అని శ్రీరామాయణంలోనూ.

159.వశీ వదాన్యో గుణవాన్ ఋజుశ్శుచిర్మృదుర్దయాళుః మధురస్థిరస్సమః ।
కృతీకృతజ్ఞస్త్వమసి స్వభావత స్సమస్త కల్యాణగుణామృతోదధిః
(ఆశ్రితులకి వశపడినవాడును, తనని తనవారికి ఇచ్చుకునే వదాన్యుడై సౌశీల్యగుణం గలవాడై, ఎప్పుడూ ఒకే విధంగా ఉండేవాడై, నిర్హేతుకంగా ఉపకరించే భావశుద్ధిని గలవైడే, తన దాసులని వదలలేని దయగలవాడై, అందరికీ ప్రీతిపాత్రుడై, ఆశ్రితులను రక్షించే విషయంలో దృఢమైనవాడై, ఆశ్రయించే వారందరిమైన సమానభావము గలవాడై, ఆశ్రితుల కార్యములను తనవిగా భావించి కార్యము చేసేవాడై ఆశ్రితులు చేసిన చిన్న అనుకూల్యాలని కూడా పెద్దవిగా భావించేవాడై, యుండే నీవు స్వభావము చేతనే సమస్త కల్యాణగుణాలకిన్నీ స్థానమైన సముద్రమైనవాడవు) అని స్తోత్రరత్నములో చెప్పబడినట్లు ఈయన గుణములు అమృతమయమైన మహోదధి.

పెరుమ్బులక్కడల్ విశాలమైన సముద్రంలాగ, అంతులేని స్వరూప స్వభావాలు గలవాడు. - పె.తి.మొ 7-10-1 అనబడుతున్న వాడు ఇటువంటి స్వరూపరూప గుణములను గల ఆ వస్తువు ఏదంటే పరమపురుషుడై భగవానుడైన నారాయణుడే అని తరువాతి మూడు పదాలతో చూపుతున్నారు.

ఇటువంటి స్వరూప రూప గుణములుగల ఆ పదార్థం ఏది అంటే పరమపురుషుడై భగవానుడైన నారాయణుడే అని తరువాతి మూడు పదాలతో చూపుతున్నారు. ఆ పరమ పరుషుడు ఎటువంటి వాడు అంటే

పరమపురుషం తన కంటే మీదను మరొకరు లేని పురుషుడిని, పురుష శబ్దం జీవుడికీ, ఈశ్వరుడికీ సామాన్యమైనది గనుక పరమ అనే శబ్దాన్ని విశేషణంగా చేర్చి జీవుడికంటే వేరైనవాడినిగా చూపుతున్నది.

పరో మా అస్మాత్ ఇతి పరమః అనే శబ్దాన్ని విశేషణంగా చేర్చి జీవుడి కంటే వేరైన వాడినిగా చూపుతున్నది. పరో మా అస్మాత్ ఇతి పరమః (తనకు పైన ఒకరు లేనివాడు గనుక పరముడు అనబడుతున్నాడు) అన్నది ఈ శబ్దం వ్యుత్పత్తి. ఇటువంటి అందరి కంటె గొప్పవాడైన పరముడికి పేరేమి? అంటే

భగవన్తం భగవాన్ అనే పేరు గల వానిని, ఈ చూర్ణికలో స్వాధీన త్రివిధ అని ఆరంభించి లోకాన్ని సృష్టించి, రక్షించి, సంహరించటం అనే జగత్కారణత్వం నారాయణం చెప్పటం చేతనున్నూ దానికి కావలసిన జ్ఞానము బలము, మొదలైన ఆరు గుణములను జ్ఞానబలైశ్వర్య అని ఆరంభించి చెప్పడం చేతనున్నూ వెనుక శరణాగతి గద్యలో భగవన్నారాయణ అన్నప్పుడు ఎత్తుకొనబడిన శ్రీవిష్ణుపురాణం 6-5-72-73 శ్లోకాల ప్రకారము ఇతడికి భగవాన్ అనే తిరునామం అని తెలుపబడుతున్నది.

దీనివలన జ్ఞానము, బలము మొదలైన ఆరుగుణాలనీ సంపూర్ణంగా గలవాడు షాడ్గుణ్యపరిపూర్ణుడు అని, జగత్కారణభూతుడనిన్నీ చెప్పబడింది.

ఇంకా పైగా బ్రహ్మాది దేవతలకిన్నీ జ్ఞానాదిగుణాలు కొంత ఉండటంతో భగవాన్ అనే నామం ఉపచారముగా ఉన్నదే అనే సందేహము రాగా, వేరెవరిని చెప్పని శబ్దాన్ని చూపుతున్నారు.

నారాయణం అని వేరెవరిని చెప్పనటువంటి నారాయణానువాకం నుండి స్పష్ట మౌతున్నది అటువంటి వాడై.

160. నారాయణాత్ బ్రహ్మా జాయతే । నారాయణాత్ రుద్రో జాయతే । (నారాయణోపనిషత్)

నారాయణుని నుండి బ్రహ్మ పుట్టుచున్నాడు. నారాయణుని నుండి రుద్రుడు పుట్టుచున్నాడు అని చెప్పినట్లుగా బ్రహ్మ, రుద్రుడు, ఇంద్రుడు మొదలైన వాళ్ళని కూడా సృష్టించినవాడై, వాళ్ళచేత కూడా పొందబడదగినవాడైన నారాయణుడే అని అంటున్నది (నారాయణం) భగవాన్ అనే శబ్దం చేతను, జ్ఞానము, బలము మొదలైన ఆరు గుణాలని మాత్రమే చెప్పటం జరిగింది (ప్రభృత్యసంఖ్యేయ కల్యాణగుణగణౌఘ మహార్ణవమ్) అని ఈ చూర్ణికలో సమస్తకల్యాణ గుణములకున్నూ వాసస్థానము అని చెప్పటం చేత, ఆ అర్థాన్ని చూపించే నారాయణ నామాన్ని చెప్పుతున్నది. పరమపురుషమ్ అనటం చేత పురుషసూక్త ప్రమాణంతో చెప్పబడేవాడు అని చూపబడింది. భగవన్తం అనటం చేత

161-164 భగవాన్ పవిత్రం వాసుదేవః ।పవిత్రం వాసుదేవో భగవాన్ ।

సంకర్షణో భగవాన్। ప్రద్యుమ్నో భగవాన్ ॥ (రహస్యామ్నాయమ్)

పరిశుద్ధుడైన భగవాన్ వాసుదేవుడు, పరిశుద్ధుడై వాసుదేవుడు అనబడే భగవానుడు, సంకర్షణుడైన భగవానుడు, ప్రద్యుమ్నుడైన భగవానుడు) అని పాంచరాత్రానికి మూలవేదమైన రహస్యామ్నాయ బ్రాహ్మణంలో ప్రతిపాదింపబడేవాడు అని చూపబడింది. నారాయణమ్ అనటంతో నారాయణానువాకము చేత ప్రతిపాదింపబడినవాడు అని చూపుతున్నది. ఈ విధంగా దీనితో

165 వేదే రామాయణే చైవ పురాణే భారతే తథా ।
ఆదౌ మధ్యే తథాన్తే చ విష్ణు సర్వత్ర గీయతే ॥

(వేదాల్లోనూ, రామయణ మహాభారతాలనే ఇతిహాసాల్లోనూ పురాణాల్లోనూ మొదట, మధ్యని, చివరనీ కూడా ఇంకా సర్వత్ర (అంతటా) విష్ణువే స్తుతించబడుతున్నాడు.

166. సర్వస్యచాహం హృదిసన్నివిష్టో మత్తస్స్మృతిర్జ్ఞాన మపోహనంచ ।
వేదైశ్చ సర్వై రహమేవ వేద్యో వేదాన్తకృత్ వేదవిదేవ చాహమ్ ॥ గీ. 15-15

(అందరి హృదయాల్లోనూ నేను ఉన్నాను, నావలననే తలంపు, జ్ఞానము, మరుపు కలుగుతున్నాయి, అన్ని వేదాల చేత తెలియబడేవాడిని నేనే. వేదంలో చెప్పబడిన ఫలాలను ఇచ్చే వాడూ, వేదాన్ని తెలిపేవాడు నేనే) అన్న ప్రమాణాల నుండి, వేదాలన్నింటిచేతనూ చెప్పబడేవాడు నారాయణుడే అనే అర్థాన్ని చెప్పుతున్నది.

ఇంతవరకూ పొందబడవలసిన వాడైన పరమాత్ముడి విశేషం (గొప్పదనం చెప్పబడింది. ఇక స్వామిత్వేన అని ప్రారంభించి తత్ప్రాప్తయే అంతవరకూ ఆయనవద్ద చెయ్యబడే కైంకర్యప్రార్థన చెప్పబడుతున్నది (స్వామిత్వేన గురుత్వేన సుహృత్త్వేన చ పరిగృహ్య)

స్వామిత్వేన గురుత్వేన సుహృత్త్వేన చ పరిగృహ్య

నారాయణ శబ్దం చేత చెప్పబడే గుణములను అనుసంధించుకుంటున్నారు.

1. స్వామిత్వము, 2.సౌలభ్యము, 3) సౌశీల్యము, 4) వాత్సల్యము అనే గుణాలు గదా ద్వయంలో పూర్వఖండములో నారాయణ శబ్దం తాలుకూ అర్థంగా చెప్పబడుతున్నది. వీటిలో చివరి మూడు గుణాలు గురుత్వేన సుహృత్త్వేన అనే పదాల చేత తెలుపబడు తున్నాయి. స్వామిత్వేన అన్న పదం చేత తనకు తానే స్వామిగా ఉండటంచేత స్వామిత్వగుణం చెప్పబడుతున్నది. గురుత్వేన అనటం చేత పీతకవాడై ప్పిరానార్ పిరమకురువాకి వన్దు –పీతాంబరధారియైన సర్వేశ్వరుడు బ్రహ్మోదేష్ట అయిన ఆచార్యుడుగా వచ్చి అన్న పెరియాళ్వార్ తిరుమొళి (5-2-8) పాశురంలో సౌలభ్యం అంటే సులువుగా లభించడం చెప్పబడుతున్నది. సుహృత్త్వేన అనడం చేత స్నేహితుడి వలె ఏకతత్త్వం లాగ కలిసిపోయి ఉపకరించే సౌశీల్యం చెప్పబడుతున్నది. చ కారం మిగతా వాత్సల్య గుణాన్ని అనుక్త సముచ్ఛయం ప్రకారముగా చూపుతున్నది. అలా కాకుండా, చకారం ఉక్త సముచ్ఛయంగా తీసుకున్నట్లైతే వాత్సల్యం ఈ రెండు గుణాల చేతను ఉపలక్షణ పద్ధతిలో తెలుపబడుతున్నది. మరొక విధంగా కూడా వీటికి అర్థం చెప్పవచ్చు.

పరమపురుషమ్ అనే పదము చేత తెలుపబడే పురుషసూక్తంలో చెప్పబడిన స్వామిత్వాన్ని స్వామిత్వేన అనే పదం చెప్తున్నది.

భగవన్తం అనే పదము చేత కొంచెం ముందుగా ఎత్తుకొనబడిన 163వ ప్రమాణంలో సంకర్షణో భగవాన్ అనే రహస్యామ్నాయ వాక్య భాగం చేత సంకర్షణుడికి చెందిన జ్ఞానాన్నిచ్చే లక్షణం గురుత్వేన అని చెప్పబడుతున్నది.

నారాయణం అనే పదం చేత తెలుపబడే నారాయణానువాకంలో ఉన్న

167 యచ్చ కించిత్ జగత్యస్మిన్ దృశ్యతే శ్రూయతేపి వా ।
అన్తర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః స్థితః ॥ (తై.నా. 11)

168. తస్య మధ్యే వహ్నిశిఖా అణీయోర్ధ్వా వ్యవస్థితః । నీలతోయదమధ్యస్థా విద్యుల్లేఖేవ భాస్వరా।
నీవారశూకవత్తన్వీ పీతాభా స్యాత్ తనూపమా । తస్యాశ్శిఖాయా మధ్యే పరమాత్మా వ్యవస్థితః।
స బ్రహ్మ స శివస్సేన్ద్ర స్సోక్షర పరమస్స్వరాట్ ॥ (తై.నా. 11)

ఆ హృదయకమలం మధ్యను, మృదువైనదీ మీదివైపు చూసేదీ అని అగ్నిశిఖ (పరమాత్మ యొక్క దివ్య మంగళ విగ్రహం) ఉన్నది. (అది) నీలమేఘాన్ని లోపల పెట్టుకున్న మెరుపు వలె ప్రకాశమున్నదిగను, ధాన్యపు చివర వలె చిన్నదిగాను పసుపుపచ్చని వర్ణము గలదిగను సాటిలేనిదిగను ఉన్నది. ఆ శిఖ మధ్యలో పరమాత్మ ప్రకాశిస్తున్నాను. ఆయనే బ్రహ్మకి, అంతర్యామి, ఆయనే శివుడికి అంతర్యామి, ఆయనే ఇంద్రుడికీ అంతర్యామి, బ్రహ్మ

మొదలైన వాళ్ళ కంటే మీది వాడున్ను, కర్మవశ్యుడు కాని వాడున్ను, నాశం లేనివాడున్నూ అయిన ముక్తాత్మకీ అతడే అంతర్యామి) అనే మంత్రము చేతనున్నూ ఇతడు తన సొత్తులను వదలలేక వారి లోపలనే ప్రవేశించి కలిసి ఉండే స్నేహదశని చెప్పడం ద్వారా సుహృత్త్వేన అనే పదానికి అర్థం చెప్పబడుతున్నది. మరోవిధంగా కూడా అర్థం చెప్పవచ్చు. స్వామిత్వేన అనడం చేత మనం శిష్యుడిగను ఆయన ఆచార్యుడుగను ఉండే మనకీ ఆయనకీ ఉన్న సంబంధాన్ని చెప్పుతున్నది. సుహృత్త్వేన అనడం చేత

99. మాతా పితా భ్రాతా నివాస శ్శరణం సుహృత్ గతిర్నారాయణః అన్న సుబాలోపనిషత్ 16వ మంత్రం చేత చెప్పబడే స్నేహం చేత కలిగే బంధుత్వాలు చెప్పుతున్నది. స్నేహితుడికి చెందిన సౌశీల్యగుణాన్ని చెప్పుతున్నది అని చెప్పవచ్చును. దీని వలన మనకి ఆయనతో సర్వవిధ బంధుత్వమున్నూ ఉన్నదని చూపబడుతున్నది.

ఐకాన్తిక (ఆత్యన్తిక) తత్పాదామ్బుజద్వయ పరిచర్యైకమనోరథః తత్ప్రాప్తయే చ పరిగృహ్య ఏకపక్ష ప్రీతి కాకుండా, అంటే, తాను మాత్రమే తలుచుకొనేవాడిగా ఉండకుండా లోకంలో నున్న గొప్పవాళ్ళందరూ ఈయననే అన్ని విధములైన బంధువుగా గ్రహిస్తున్నారని తెలుపుతున్నది. (పరిగృహ్య) పరితో గృహిత్వా పరి అనే ఉపసర్గ బహువిధాలుగా గ్రహించబడియుండటాన్ని చూపుతున్నది. అంటే శాస్త్రాన్ని పరిశీలించడం చేతను, ఆచార్యుడి ఉపదేశము చేతను పరమాత్ముడు అవతారాల్లో స్వామిగానూ, గురువుగానూ, స్నేహితుడుగాను, వ్యవహరించడం చేత ఆ పరమాత్మను అన్ని విధాలుగాను స్వామిగాను, గురువుగాను, స్నేహితుడిగాను మనసులో భావించి అని అర్థం.

ఈ విధంగా పరమాత్మ యందున్న స్వామిత్వాన్ని అనుసంధానం చేసిన వెంటనే

169. స్వోజ్జీవనేచ్ఛా యది తే స్వసత్తాయాం స్పృహాయది ।
ఆత్మదాస్యం హరేః స్వామ్యం స్వభావంచ సదా స్మర ॥ (విష్ణుతత్త్వం)

నీ ఉజ్జీవనంలో నీకు ఇచ్ఛ ఉన్నట్లైతే, నీ సత్తలో ఆశ ఉన్నట్లైతే, ఆత్మయొక్క దాసుడుగా ఉండే లక్షణాన్ని హరి యొక్క స్వామిగా ఉండే లక్షణాన్నీ (వీటిని) సహజమైనవిగా సర్వదా తలచుకొనవలెను) అన్న దానికి తగినట్లు

(ఐకాన్తిక తత్పాదామ్బుజద్వయ పరిచర్యైక మనోరథః) అనే వాక్యఖండం చేత ఆ స్వామిత్వానికి ప్రతిగా తనకున్న దాస్యమనే కైంకర్య స్వభావానికి కావలసిన కైంకర్యాన్ని ఆశించే ప్రకారాన్ని చెప్పుతున్నది.

(ఐకాన్తిక) ఏకాన్తమైన సంబంధం కలిగి ఉండటం, అంటే, అంతరంగమైన (దగ్గరగానున్న) సంబంధం గలదన్నమాట. ఈ పదాన్ని తత్ అనే పదంతో చేర్చవలెను.

పాదామ్బుజద్వయ అనే పదంతో కూడా చేర్చవచ్చు.

చివరగా నున్న పరిచర్యా అనే పదముతో కూడా చేర్చవచ్చు. తత్ అనే పదంతో చేరినప్పుడు పరమాత్మ సహజమైన బంధుత్వము గలవాడు అని చూపుతుంది. పాదామ్బుజద్వయ పదంతో చేర్చినపుడు

170. త్వత్పాదపంకజపరిగ్రహధన్యజన్మా
భూయాసమిత్యభినివేశకదర్థ్యమానః ।
భ్రామయన్ నృమాంసపణనాయపరేత
భూమావాకర్ణ్య భీరురుదితాని తవాగతోఽస్మి ॥ (మాలతీ మాధవం)

భయపడే స్వభావమున్నవాడా! తామరవంటి నీ పాదాలని ఆశ్రయించినందువల్ల జన్మ ఫలం పొందవచ్చుననే ఆశచేతనే మనస్సు కష్టపెట్టుకొని నరమాంసాన్ని పొందడం కోసం మయానంలో సంసారములో చుట్టుకుపోయిన నేను నీ ఏడుపు శబ్దాన్ని విని వచ్చేను. అనిన్నీ.

171. కిం శీతలైః క్లమవినోదిభిరార్ద్రవాతాన్
సంచారయామినళినీదళతాలవృన్తైః ।
అంకే నిధాయ కరభోరుయథాసుఖం తే
సంవాహయామి చరణావుతపద్మతామ్రౌ ॥ శాకుంతలం 3-18

కరభం వంటి ఊరువులు గల ఓ శకుంతలా! శ్రమని పోగొట్టే చల్లని తామర రేకులనే విసనకఱ్ఱతో చల్లని గాలిని నీమీద విసిరేదా? లేక తామరవలె ఎఱ్ఱని నీ పాదాలని నా ఒడిలో పెట్టుకొని సుఖంగా ఒత్తేదా) అనే ప్రాకృతలైన స్త్రీపురుషుల మధ్యనున్న కోరికవలె, ఆత్మ స్వరూపానికి తగనిదిగా ఉండకుండా, స్వామియొక్క శ్రీపాదాలపై అమరియున్నది అని తెలుపబడుతున్నది. ఐకాంతిక పదం పరిచర్యకి విశేషణమైనప్పుడు ఆంతరంగ కైంకర్యాన్ని చూపుతున్నది. (తత్ పాదాంబుజద్వయ) ఇక్కడ తత్ అనే శబ్దం దగ్గరగా నుండటాన్ని చెప్పడం చేత దగ్గరగానున్న నారాయణం అనే పదం చేత చెప్పబడే వాడిని చూపుతున్నది. దీని చేత నారాయణ చరణౌ అనే ద్వయం తాలూకూ పూర్వఖండంలో ఉన్నదాన్ని జ్ఞాపకం చేస్తోంది. తత్ అని పరమాత్మని గురించి చెప్పబడియున్నప్పటికీ పాద అని శ్రీపాదాలని చెప్పటం చంటిపిల్లకి తల్లి స్తనం వలె దాసుడైన చేతనుడికి పరమాత్ముడి శ్రీపాదాలు స్వరూపానికి తగినవి అని చూపుతున్నవి. తల్లిస్తనంలో ఊరేవి పాలే

172. తదస్య ప్రియమభి పాదో అశ్యామ్
నరో యత్ర దేవయవో మదన్తి ।
ఉరుక్రమస్య స హి బన్ధురిత్థా
విష్ణోః పదే పరమే మధ్వ ఉత్సః ॥ ఋక్ అష్టక 2.2.24.5

ఏ గంగా తీర్థ విషయములో దేవత్త్వమును కోరే మనుష్యులు సంతోషిస్తున్నారో మధురంగా నున్న ఈ భగవానుడి ఆ శ్రీపాదతీర్థాన్ని ఆదరంతో పానము చేయుదును గాక. ఆ విధంగా పానము చేసినవాడు త్రివిక్రముడికి బంధువౌతాడు. ఈ విధముగా విష్ణువు యొక్క గొప్పవైన శ్రీపాదాలలో అమృతపు ప్రవాహము కలుగుతున్నది) అనిన్నీ,

173. తవామృతస్యన్దిని పాదపఙ్కజే నివేశితాత్మా కథమన్యదిచ్ఛతి?
స్థితేరవిన్దే మకరందనిర్భరే, మధువ్రతో నేక్షురకం హి వీక్షతే ॥ స్తో.ర. 27

(అమృతమును ప్రసవించుచున్న నీ పాద పంకజములలో (నీ కృపచేత) ఉంచబడిన మనస్సు, వేరొకదానిని ఎట్లు కోరును? తేనె నిండిన ఎఱ్ఱ తామర యుండగా తుమ్మెద ముళ్ళ పూవును చూడను కూడ చూడదు గదా! అని చెప్పినట్లు ఇతడికి శ్రీపాదములపై ప్రీతి అనే తేనెధార ఎడతెగకుండా ఉంటుంది గదా ! (అంబుజ) తామర, శ్రీపాదాలని ఆశ్రయించడం శాస్త్ర మర్యాద చేత కలిగేదైతే కషాయం తాగినటులగా చేదుగా ఉంటుంది గదా! కాని అలా లేకుండా ఇతడే కావాలని ఆశ్రయించేటట్లు తామర వలె భోగరూపమైనదిగా ఉంటుందని చూపుతున్నది.

(అమ్బుజ) అమరర్ శెన్నిప్పూ నిత్య సూరులు శిరస్సు మీద ధరించే పుష్పము అని తిరుక్కుఱున్దాణ్డకం 6లో చెప్పినట్లుగా, నిత్యసూరుల తలమీద ధరించే శ్రీపాద తామర గనుక, ఈ ద్వంద్వాన్ని ధరించడం భోగరూపంగానే ఉంటుంది. చల్లగా, తలలో పూవులు పెట్టుకున్నప్పుడు తలలో పువ్వులు పెట్టుకోవాలి అని ఒక శాస్త్రవిధి అవసరము లేదు గదా! (ద్వయ) ఉపాయం (రెండై) ద్వయమై (1. ద్వయమంత్రమై 2. రెండు శ్రీపాదాలై) ఉన్నందు వలన పొందదగిన ఉపేయంకూడా ద్వయమై (రెండై) ఉన్నది.

174. దేవానాం దానవానాంచ సామాన్యమధిదైవతమ్ ।
సర్వదా చరణద్వంద్వం వ్రజామి శరణం తవ ॥ జి.స్తో

విష్ణు భక్తి గలవారును, భగవద్భక్తిలేని వారును ఎల్లప్పుడు సమానంగా ఆశ్రయించడానికి ఉన్న నీ శ్రీపాదద్వంద్వాన్ని ఉపాయంగా నిశ్చయించుకొన్నాను) అని జితన్తే లోనూ శ్రీపాద ద్వంద్వమే ఉపాయంగానూ, ఉపేయంగానూ చెప్పబడింది కదా! దీంతో ద్వయంలో నున్న చరణౌ అన్న ద్వివచనాన్ని (జోడీని) చెప్తుతున్నది. (పరిచర్యా) చర్యా అన్నది చరిత్రం అయి అనుష్ఠానాన్ని చూపుతుంది. ఇక్కడ కైంకర్యాన్ని చెప్తుతున్నది. పరిచర్య అంటే అన్నివిధాలైన కైంకర్యాలనీ చూపుతున్నది. ఈవిధంగా శ్రీపాదాలతో

మోక్షాన్ని పొందడమే కాకుండా, పరిచర్య అనే పదము ఋషి అనే వ్యవహారపు పేరై గౌరవించదగినవారి విషయములో కైంకర్యాన్ని చెప్పి ఆ క్రమంలో కైంకర్యము అనే అర్థంగా చెప్పవలెను. అలా కాకుండా పరితః చర్యా పరిచర్యా అనే వ్యుత్పత్తిని తీసుకొని

175.విశ్వతః పర్యేతి

పరమాత్మని చుట్టూ ప్రదక్షిణం చేస్తున్నాడు అని వేదంలోను కొణ్డకోయిలై వలం శెయ్తు పరమాత్ముడు వేంచేసియున్న దేవాలయానికి ప్రదక్షిణం చేసి అని తి.వా.మొ (10x1x5) లో నున్నా వలమ్ శెయ్తు నాళుమ్ మరువుతల్ వళుక్కు ప్రదక్షిణములు మొదలైన వాటిని చేసి నిరంతరము సంశ్లేషించడం న్యాయం అని తి.వా.మొ (2-10-8) అనిన్నీ ద్రావిడ వేదంలో కూడా చెప్పినట్లుగా ప్రదక్షిణాది అనుకూల వృత్తులను చెప్పేదిగానూ తీసుకొనవచ్చు. (ఏకమనోరథః) ఇతర ప్రయోజనాలన్నింటినీ త్యజించి కైంకర్యం ఒక్క దాన్నే ఫలంగా పొందవలెను అన్న ప్రయత్నం చేసేవాడై (తత్ప్రాప్తయే) కొంచెం ముందుగా చెప్పబడిన ప్రయత్నానికి విషయమైన పరిచర్య అనే కైంకర్యాన్ని పొందటానికి (చ) దీనికి ముందు మరొకదాన్ని పొందటాన్ని గురించి చెప్పనందువల్ల ఇది ఇదివరకు చెప్పబడిన దాంటో చేరదు. కనుక ఈ చకారం ఇది వరకు చెప్పబడని (ఇక్కడ చెప్పబడని) ఒక దాన్ని కలుపుతుందనే గ్రహించవలెను. అంటే.

176. సకృత్ త్వదాకారవిలోకనాశయా తృణీకృతానుత్తమభక్తి ముక్తిభిః ।
మహాత్మభి ర్మామవలోక్యతాం నయ క్షణేపి తే యద్విరహోతిదుస్సహః ॥ స్తో.ర. 56

ఏ పెద్దలని విశ్లేషించడం నీకు ఒక క్షణకాలం కూడా సహించలేనిదిగా ఉన్నదో, ఒకసారి నీ విగ్రహాన్ని దర్శించాలనే ఆశ చేత తృణము వలె తలంచబడిన గొప్ప భేదాలనీ, మోక్షాన్నీ గలవారైన ఆ పెద్దల చేత కటాక్షించేవాడిగా ఉండే లక్షణాన్ని (పొందేటట్లుగా నన్ను చేసి కటాక్షించవలెను అనిన్నీ అడియార్క్కు ఎన్నై ఆట్పడుత్త విమలన్ భాగవతులకి నన్ను దాసుడుగా చేసిన పరమపావనుడు (అమలనాదిపిరాన్-1) అనిన్నీ, చెప్పినట్లుగా పరమాత్మని పొందిన ఫలంగా నున్న భాగవత కైంకర్యం కొరకు అని భాగవత పరిచర్యని అనుక్తసముచ్చయ ప్రక్రియలో చేర్చేదిగా గ్రహించాలి.

అలా కాకుండా పరిచర్యైక మనోరథః అని వెనుక చెప్పబడిన మనోరథమైన ప్రయత్నం ఉక్తసముచ్చయపద్ధతిలో చేర్చేదిగానూ చెప్పవచ్చు. అంటే నిన్ పుకలిళ్ వైకుమ్ తమ్ శిన్దైయిలుమ్ మణ్ణినితో ? నీ యవర్క్కు వైకున్ద మెన్ఱరుళుమ్ వాన్ - నీ కల్యాణ గుణాలలో అభినివేశాన్ని పొందే తమ మనస్సు కంటే నువ్వు వాళ్లకి గొప్పగా చెప్పి ఇచ్చే వైకుంఠమనే పరమాకాశం గొప్పదా? అని పెరియతిరువందాది 53లో అనిన్నీ.

177. దుర్గతావపి జాతాయాం త్వద్గతో మే మనోరథః ।
యది నాశం నవిన్దేత తావతాస్మి కృతీ సదా ॥ జి.స్తో 2

(దేవర వారి విషయంలో అభినివేశంతో నున్న నా మనోరథం, నాకు చాలా హీనమైన దశ కలిగినా, నశించకుండా ఉన్నట్లైతే దాంతో సర్వదా కృతజ్ఞుడనై కృత కృత్యుడనై యుంటాను) అనిన్నీ చెప్పినట్లుగా కైంకర్యం చెయ్యాలి అనే ప్రయత్నమే సరిపోతుండగా, అంతకు మించి కైంకర్యాన్ని కూడా పొందాలి అని ఆశించినట్లైతే అని కైంకర్య ప్రాప్తిని కైంకర్య మనోరథంతో బాటు చేర్చుతున్నదన్న మాట.

ఇంతవరకూ పొందదగిన ఉపేయమైన కైంకర్యాన్ని చెప్పడం జరిగింది. ఇక ఈ చూర్ణికలో మిగతా భాగం చేత ఈ ఉపేయాన్ని పొందటానికి తగిన ఉపాయాన్ని నిర్ణయించి దానికి అంగమైన అనుష్ఠానాన్ని చెప్పుతున్నది. (తత్పాదామ్బుజ ప్రపత్తేః) అని ప్రారంబించి (మన్వానః) అన్నంత వరకూ, ఉపాయం నిర్ణయించబడుతున్నది. (తత్పాదామ్బుజ ప్రపత్తేః) అని ప్రారంభించి (మన్వానః) అన్నంత వరకూ, ఉపాయం నిర్ణయించబడుతున్నది. (తస్యైవ) అని ప్రారంభించి (చరణారవిన్దయుగళమ్) అన్నంత వరకూ ఉపేయం ఫలానిది అని చూపిస్తున్నారు. (అనన్యాత్మ) అని ప్రారంబించి (అనుప్రజేత్) అన్నంత వరకూ ఉపాయాన్ని ఆశ్రయించడం అనే స్వీకరించడం చెప్పబడుచున్నది. (తత్పాదామ్బుజద్వయ) ప్రాప్యమైన శ్రీపాద తామర పుష్పముల ద్వంద్వమే (జోడీయే) ప్రాపకంగానూ ఉన్నదని చెప్తున్నది.

ఇక్కడ ఒక ఆక్షేపం వస్తున్నది, ప్రాప్యము, ప్రాపకము ఒకటే అయితే కారణము, కార్యము ఒకటే అవవలసి వస్తుందే! కారణం కార్యాన్ని సాధిస్తుందని చెప్పటం కుదరదు గదా! ఈ దోషాన్ని ఒప్పుకుంటే, కారణమైన ఉపాయములో ఎవరూ కూడా దిగనే దిగరు. ఈ విధంగా అనుష్ఠించేవారు ఎవరూ లేనందున శరణు పొందాలి అనే శాస్త్రం వ్యర్థమైనది గాను, ప్రమాణం కానిది గాను అయిపోతుంది. ఇన్ని అనర్థాలు రాకుండా ఎలా పరిహారం చెయ్యగలం అన్నదే ఆ ఆక్షేపం.

శ్రీపాదకమలాలే ఉపాయంగానూ ఉపేయంగానూ అయినప్పటికీ, శ్రీపాదకమలాలకి కైంకర్యం ప్రాప్యం. ఆ శ్రీపాదకమల ద్వంద్వములనే ప్రపత్త్యుపాయం అని భేదమూ, ఉన్నందు వలన ఏ విరోధము లేదని దీనికి పరిహారం. దీని మీద మరొక ఆక్షేపం. అదేమిటంటే, కైంకర్యము ఉపేయమై, ప్రపత్తి ఉపాయమైతే

178. బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి (ముండ. 3-2-9)
బ్రహ్మాన్ని ఉపాసించేవాడు బ్రహ్మమువలెనే అగును





179. బ్రహ్మవిదాప్నోతి పరమ్ (తై.అ.1)

బ్రహ్మమును తెలిసినవాడు ఉత్తమమైన ఫలమును పొందును) అనిన్నీ వేదవాక్యాల్లోనూ , గీతా చరమశ్లోకములోనూ, 129వ ప్రమాణమైన

అహమస్మ్యపరాధానామాలయో కిఞ్చనోగతిః ।

త్వమేవోపాయభూతో మే భవేతి ప్రార్థనామతిః ॥

శరణాగతిరిత్యుక్తా సా దేవేస్మిన్ ప్రయుజ్యతామ్ ॥ (అహిర్బుధ్న్య సంహిత 37-30)

(నేను అపరాధాలకి స్థానమైనవాడను, నన్ను రక్షించుకొనడానికి ఏ ఉపాయములేనివాడను, నువ్వు తప్ప వేరుగతి లేనివాడను, నువ్వే నాకు ఉపాయముగా నుండవలెను అని ప్రార్థించే బద్ధియే శరణాగతి అనబడుతున్నది. అది ఈ భగవానుడి విషయములో చెయ్యబడుగాక) అని అహిర్బుధ్న్య సంహితా వాక్యంలోనూ ప్రాప్యమూ, ప్రాపకమూ రెండు ఒకటే అనిన్నీ, పరమాత్ముడే ఉపాయంగానూ, ఉపేయంగానూ ఉన్నాడని చెప్పుతున్న ప్రమాణ వాక్యాలకి ఎలా అర్థం చెప్పుకొనడం అంటే, పరిచర్యా అనే కైంకర్యమైన ఉపేయానికి విషయమై యున్నవాడు పరమాత్మే ప్రపత్తి అనే ఉపాయస్వీకారానికి విషయమైయున్నవాడు పరమాత్మే. ఈ విధముగా రెండు విషయాలు ఒకటిగా ఉన్నందున ఉపాయోపేయములు ఒకటే అని చెప్పడానికి అడ్డులేదు గదా! ఇట్లు రెండు ఒకటే అంటే రెండింటికీ భేదం సిద్ధిస్తుందా? అంటే, విశేషణమైన కైంకర్యమూ, స్వీకారము, భేదాన్ని చూపుతున్నాయి. వీటి చేత వేరు చెయ్యబడుతున్న భగవత్స్వరూపము విశేష్యం అని గ్రహించినందువలన కైంకర్యం వల్ల కలిగిన ఆనందంతో నున్న పరమాత్మే ఉపాయస్వీకారమైన ప్రపత్తి చేత కలిగిన కటాక్షంతోనున్న పరమాత్మ. కనుక, పరమాత్మైన వస్తువు ఒక్కడే అయినా, విశేషణముతో భేదం గనుక భేదానికి లోటు లేదు.

అలా అయితే, ఖణ్డో ముణ్డః పూర్ణశృఙ్గః గౌ (విరిగి పోయిన కొమ్ములు గలది, కొమ్ములు లేనిదీ, కొమ్ములు పూర్తిగా వచ్చినదీ, అయిన ఆవు) అనే వాక్యములో సగం కొమ్ము, పూర్ణమైన కొమ్ము మొదలైన విశేషణాల బేదము చేత విశేష్యమైన పశువు వేరు వేరు అని తెలుస్తోందే! అంటే ఒకదానితో మరొకటి వ్యతిరేకంగా నున్న విశేషణం గనుక విశేష్యం ఇక్కడ వేరైనది గనుక దేవదత్తః శ్యామో, యువా, సమ పరిమాణః (దేవదత్తుడు, నల్లనివాడు, యువకుడు, సమపరిమాణములైన అంగములు గలవాడు) అనే వాక్యం లాగ, వ్యతిరేకం కాని విశేషణాలు ఉన్నప్పుడు విశేషణాల భేదము చేత విశేషణ విశిష్టమైన పదార్థం తాలూకా ఆకారములో భేదం ఉన్నప్పటికీ విశేష్య స్వరూపములో భేదము రాలేదు.

180. స ఏవ సృజ్య స్సచ సర్గకర్తా స ఏవ పాత్యత్తి చ పాల్యతే చ ।

బ్రహ్మాద్యవస్థాభి రశేషమూర్తి ర్విష్ణుర్వరిష్ఠో వరదో వరేణ్యః ॥ వి.పు. 1-2-70

(సృష్టి చెయ్యబడేవాడు ఆయనే, బ్రహ్మ మొదలైన దశలతో సృష్టించేవాడు ఆయనే, ఆయనే లోకాన్ని రక్షిస్తున్నాడు. లోకాన్ని సంహరించేవాడు ఆయనే, ఆయనే కాపాడబడేవాడు అన్నింటినీ శరీరంగా గల విష్ణువే గొప్పవాడు.వరాలనిచ్చేవాడు, వరింపబడదగినవాడు) అని శ్రీవిష్ణు పురాణంలో చెప్పినట్లుగా బ్రహ్మం ఒక్కటే కార్యమైన లోకంగానూ, కారణంగానూ అయినప్పుడు సూక్ష్మమైన చేతనా చేతనములతో కూడిన బ్రహ్మం కారణం, స్థూలమైన చేతనాచేతనములతో నున్న బ్రహ్మం కార్యం అని విశేషంలో భేదం ఉన్నా, విశేష్యమైన బ్రహ్మం ఒక్కటే అని వ్యతిరేకత లేకుండా నిర్వహించడంలాగనే దీన్ని కూడా గ్రహించవలెను.

ప్రపత్తేః అన్యత్ నమే కల్పకోటి సహస్రేణాపి సాధనమస్తీతి మన్వానః తస్యైవ భగవతో నారాయణస్య అఖిలసత్త్వదయైకసాగరస్య ॥

ప్రపత్తేః 73వ ప్రమాణం ప్రకారముగా అనుష్ఠించటానికి కష్టమైన ఉపాయాలతో నాకు సంబంధం లేదు. రక్షకుడైన పరమాత్మే ఉపాయం కావాలి అని కలిగిన నిశ్చయమైన ప్రార్థనే ప్రపత్తి అవుతుంది. (అన్యత్) ఈ ప్రపత్తి తప్ప కర్మ జ్ఞాన భక్త్యాది ఇతరోపాయాలు లేవా? అంటే, అన్యత్ అనే పదం నుంచి, మన్వానః అన్నంత వరకు అవన్నీ స్థిరమైన మనస్సు గల వారికి మంచి తీర్థం వలె పునీతములైన ఉపాయాలౌతాయి. మన వంటి చంచలమైన మనస్సు గల వారికి వాటిలో దిగటానికి అర్హత లేదు అని యుండవలెను అంటున్నారు. (అన్యత్) భక్తి, దాని అనేక విధాలైన సద్విద్య, ఉపకోసలవిద్య మొదలైనవి. ఈ భక్తికి అంగమైన జ్ఞానయోగ కర్మయోగాలు మొదలైన ప్రాప్తిలో కూడా వేరైన ఉపాయాలని చెప్పుతున్నది., ఈ విధముగా శాస్త్రాల్లో దృఢంగా విధించబడిన ఇవి ఉపాయాలు కావా? అంటే (నమే) అస్తి అనే పదాన్ని ఇక్కడ చేర్చి నమే అస్తి (నాకు లేదు) అని అర్థం చెప్పుకోవాలి. ఇవన్ని శక్తి గల వాళ్ళే అనుష్ఠించదగినవి. జ్ఞానం లేనివాడై, శక్తిలేని వాడై, కామ్యములలో మునిగి, అదే కారణంగా మాఱి మాఱి పలపిరప్పుమ్ పిఱన్దు అని తి.వా.మొ 2-6-8లో చెప్పినట్లు ఎన్నో జన్మలెత్తి మాతరార్వన మలైప్పయనే పేఱినేన్ అని పెరియతిరుమొళి 1-6-1లో చెప్పినట్లు నీచ విషయాల్లో అభినివేశం పొంది, ఈవిధముగా శాస్త్ర విరుద్ధమైన అనేక కర్మలను చేసి, 9వ ప్రమాణం ప్రకారము 10వ ప్రమాణ ప్రకారమును పరమాత్ముడి నిగ్రహానికి గురియైన నాకు ఇవి ఉపాయములు

కావు అని భావము. ఈ విధముగా మళ్ళీ మళ్ళీ ఎత్తిన అనేక జన్మలలో ఇంతకుముంది వేరు ఉపాయనానుష్ఠానాలకి అర్హతలేకపోయినా, ఇక రాబోయే జన్మలలో ఈ సాధనాలని అనుష్ఠించవచ్చునుగదా! అని పరమాత్మ మనస్సులో తలిచినట్లు చెప్పుతున్నారు. (కల్పకోటి సహస్రేనాపి) వెయ్యికోట్ల కల్పములు అయినా, తాలవిత్తనాన్ని వెయ్యి సంవత్సరాలు నీళ్ళలో ఉంచినా, అది మొలక ఎత్తనట్లే కాలతత్త్వమున్నంతవరకూ జన్మిస్తూ వచ్చినా, నాకు వీటిని అనుష్టింటానికి తగిన అర్హత కలగదు. సాధనమస్తి అనే దాన్ని (నమే) అన్న పదాలతో చేర్చి వెనుక అర్థం చెప్పబడింది. అదే విధంగా, న అన్న దాన్ని దీనితో చేర్చి, సాధనమ్ నాస్తి అని దానికి అర్థాన్ని చెప్పవచ్చు. ఎన్ని ఉపాయాలని అనుష్ఠించినా, నేను చేసిన పాపలకి ప్రాయశ్చిత్తమౌతుందే తప్ప, కోరిన ఫలమైన మోక్షాన్ని అవి సాధించి ఇవ్వలేవు. సాధనం నాస్తి అంటే సాధనం లేదు అనే అర్థం వస్తుంది. అలా చెప్పకుండా, సాధనం న భవతి అని అర్థం తీసుకొని నాకు సాధనం కాలేదు అని (ఇతి మన్వానః) ఈ విధంగా నిశ్చయించి, మన్వానః అనే వర్తమానంతో ఈ అనుకోవడం ఇక్కడ ఇతడు ఉన్నంత వరకూ ఉంటుంది అని చూపుతున్నది.

తస్యైవ భగవతో నారాయణస్య ఈ చూర్ణికలోనే ముందర భగవంతం నారాయణం అని చెప్పబడిన ఆ భగవానుడైన నారాయణుడి అని అర్థం. మొదట చెప్పబడిన భగవన్తం నారాయణం అనే పదాలతో వెనుక శ్రీరంగగద్యలో ఉదాహరించబడిన 112వ ప్రమాణం సోశ్నుతే సర్వాన్ కామాన్ సహ బ్రహ్మణా విపశ్చితా అనే తైత్తీరీయ ఆనందవల్లి వాక్యం ముక్త పురుషుడు సమస్త కల్యాణగుణములను సర్వజ్ఞుడైన బ్రహ్మంతో బాటుగా అనుభవిస్తున్నాడు)లో చెప్పబడిన, ఆయన యొక్క ప్రాప్యత్వానికి అంగములైన గుణములను, ఆ గుణాలకి ఏకైకమైన స్థానమైన స్వరూపాన్నీ చెప్పడం జరిగింది. ఇక్కడ భగవతో నారాయణస్య అని ఆయన యొక్క ప్రాప్యత్వానికి అంగములైన గుణాలనీ, స్వరూపాన్నీ వివరిస్తున్నది. (అఖిలసత్త్వదయైక సాగరస్య) – సమస్తప్రాణుల విషయంలోనూ కరుణాసముద్రుడైన వాని యొక్క అని అర్థం. (అఖిలసత్త్వ) ఫలానావాడు సాటియైన వాడు అని అతడి జన్మ నడువడి, గుణం మొదలైన వాటిలో ఎక్కువ తక్కువలని లెక్కచెయ్యకుండా సమస్త ప్రాణుల విషయంలోనూ దాని భావం. (దయా) తన మంచిని కోరకుండా, ఇతరుల దుఃఖాన్ని చూసి సహించలేకపోవటాన్ని దయ అని అంటారు. తాను ఏ ప్రయోజనాన్ని తలవకుండా, ఇతరుల దుఃఖాన్ని చూస్తే అయ్యో అని ఉండటం అని భావం. ఏకసాగరస్య దయ అనే నీటికి మరొక స్థానమనేది లేకుండా ఈయనే స్థానంగా ఉండటం. ఈ గొప్పదనం ఇతరులు దుఃఖంలో హెచ్చుతగ్గులని చూచి

అనాలోచిత గుణాగుణాఖణ్డజనానుకూలామర్యాదశీలవతః స్వాభావికానవధికాతిశయ గుణవత్తయా (తు) దేవతిర్యఙ్మనుష్యాది అఖిల జనహృదయానన్దనస్య

దాన్ని అనుసరించి చెయ్యబడుతుందా? అంటే (అనాలోచిత గుణానుగుణాఖండ జనాను కూల అమర్యాదశీలవతః) ఈ విధంగా ఇతరుల గుణదోషములను పరిశీలించనియ్యని సౌశీల్య గుణం గలవాడు అని చెప్పుతున్నది. మనసుతో పరిశీలించి చూడని విధమైన మంచి చెడులను గల సమస్త మనుష్యులును ఉజ్జీవించడానికి ఉపకరించే అంతులేని సౌశీల్యగుణము గలవాని యొక్క అని ఈ పదసముచ్చయానికి అర్థం. దోషం వారి మనస్సుకి తట్టలేదు అంటే అది ఒక గొప్పదనమే గదా! ఉన్న గుణాలని చెప్పవలసి యుండగా, అది కూడా మనస్సులో పడలేదు అంటే అది ఎలా గొప్పదనం అవుతుంది? అంటే ఇతనిని త్రోసిరాజనటానికి కారణమైన దోషాలని పరిశీలించకపోవటంవలెనే, ఇతడిని రక్షించటానికి అంగములైన గుణాలనీ ఆశించడు. తాను ఇతడిని రక్షించేటప్పుడు వీడిలో నున్న గుణాలని ఆశించి రక్షించడు అని భావం (అనాలోచిత) ఆలోచిత అంటే ఈ చేతనుడిలో మంచిగుణాలున్నాయా? చెడ్డగుణాలున్నాయా? అని గుణాలని వేరుచేసి పరిశీలించడం అనాలోచిత శబ్దం ఆవిధంగా చెయ్యకపోవడాన్ని చూపుతున్నది. అవి ఏమంటే (గుణాగుణ) మంచిచెడులు, అజ్ఞానియా లేక జ్ఞానియా అని గాని శాస్త్ర విశ్వాసము లేని నాస్తికుడా, లేక శాస్త్ర విశ్వాసమున్న ఆస్తికుడా ధర్మమార్గములో నడిచేవాడా లేక వాటిని పట్టించుకొననివాడా? విధేయుగా లేక విధేయత లేనివాడా? అని పరిశీలించడు అని భావం. (అఖండజన) దేవ, మనుష్య, బ్రాహ్మణ, క్షత్రియాది చాతుర్వర్ణములు. వాటి కలగలుపు వాసనల వల్ల కలిగే అనులోమ ప్రతిలోమ జాతులనే తేడాలు లేకుండా అందరి విషయంగా, (అనుకూల) ఇవి తప్పుదారులను తప్పించుకొని మంచి మార్గాల్లో నడుచుకొని సంసారము నుండి ఆవలి ఒడ్డుకి చేరటానికి ఉపయోగించే విధముగా ఉండటం (అమర్యాద) మర్యాద అంటే హద్దు. అమర్యాద అన్నది హద్దులేని అన్నమాట. హద్దు లేనిది ఏది? అంటే (శీల) పెద్దవాడు అల్పుడితో కలవవలసినప్పుడు తన ఉత్కృష్టతో గర్వం చూపించి వాడికి దూరంగా పోవడం, వాడి అల్పత్వాన్ని చూసి భయపడి దూరంగా పోవడం మొదలైనవి చెయ్యకుండా అంటే అరమరికలు లేకుండా కలసిపోవడాన్ని సౌశీల్యమని అంటారు (శీలవతః). ఈ శీలగుణాన్ని ఎల్లప్పుడూ కలిగియున్నవాడు అని అర్థం.

181. భూమనిందాప్రశంసాసు నిత్యయోగేతిశాయినే ।
సంబంధేస్తి వివక్షాయాం భవతి మతుబాదయః ॥ వార్తికం 5-2-14

(మతుప్ మొదలైన వికృతుల మీద చెప్పబడే అర్థాల్లో వస్తున్నవి.

1. అధికం చెప్పడానికి, ఉదాయ గోమాన్ - అధికమైన గోవులు గలవాడు), 2. నింద (రోగవాన్ వ్యాధిగలవాడు) 3. స్తోత్రం (రూపవతీ అందమైన రూపము గలది 4.నిత్యయోగము -ఎప్పుడూ చేరి ఉండటం. (క్షీరిణో వృక్షాః ఎల్లప్పుడు పాలుకారే చెట్లు.

5. అధిక గుణము గలది (శక్తిమాన్ అధికమైన శక్తి గలవాడు) 6. కలసియుండటం (దండవాన్ దండీ దండము గలవాడు) 7. కలిగియుండటం ఉదాః పర్వతో వహ్నిమాన్ కొండమీద నిప్పు ఉన్నది. అనే అర్థాల్లో ఇక్కడ మతుప్ ప్రత్యయం నిత్యయోగమనే ఎప్పుడూ కలసియుండటాన్నే చెప్పుతున్నది.

ఈవిధంగా అతడు తనయొక్క సౌశీల్యం చేత అందరితో వాళ్ళలో ఒకడుగా కలవడం చేతను, వారు తనని చూస్తే భయపడిపోయి దూరం కావలసి వచ్చేటట్లుగా ఉన్నాడా? అంటే (దేవతిర్యఙ్మనుష్యాది అఖిల జన హృదయానందనస్య) విచక్షణా జ్ఞానం గల దేవతలు, మనుష్యులనే వారు, విచక్షణా జ్ఞానం లేని జంతువులు, పక్షులు అనే తిర్యక్కులు, స్థావరాలు అనే భేదం లేకుండా, అందరి మనస్సులు కరిగేటట్లున్న ప్రీతిని కలిగించే వాడై ఉన్నవాడు. ఈ విధంగా ఉండటానికి కారణమేమిటి? అంటే ఈ పదానికి ముందున్న 'తు' శబ్దం ఒక కారణం ఉన్నదని చూపుతున్నది. అది ఏదంటే దానికి ముందున్న స్వాభావిక అనవధికాతిశయ గుణవత్తయా అనే పదసముచ్ఛయం చూపుతున్నది. సహజంగానే ఉన్నటువంటి అంతులేని అతిశయించిన గుణం గలవాడై ఉండటం చేత, వెనుక పదాల్లో దయ, శీలము, అని ఒక్కొక్క గుణాన్నీ చెప్పినప్పుడు ఈ పదములో సాధారణంగా గుణం అని చెప్పటంలో భావము ఏమిటి?

ఆశ్రితవాత్సల్యైక జలధేః భక్త జన సంశ్లేషైక భోగస్య

అంటే వెనుకటి పదాలన్నింటిలోనూ ఆత్మగుణాలు చెప్పబడ్డాయి. ఇక్కడ

182. రామదాసు నయనాభిరామతామాశయస్య

సదృశం సముద్వహన్, సర్వదేవహృదయజ్ఞమోసి

(రామా! (వారి వారి ఇష్టానుసారముగా కంటికి ప్రియంగా ఉన్నవాడై దేవతలందరి హృదయాలనీ ఆనందింపజేసే వాడును) అనే కంటికి ప్రియమైన కాంతి మృదుత్వం మొదలైన శరీరగుణాలనీ చేర్చి చెప్పుతున్నది. దేవతిర్యఙ్మనుష్యాది అఖిల జన హృదయానందనస్య (దేవ)

183. రామమిన్దీవరశ్యామం కన్దర్పసదృశప్రభం ।

బభూవేన్ద్రోపమం దృష్ట్వా రాక్షసీ కామమోహితా॥ (రా.అ. 17.9)





(నల్ల కలువ పుష్పం వలె నల్లని రంగు గలవాడై, మన్మథుడి వంటి అందం గలవాడై ఇంద్రుడితో సరిసమానమైన రాముడిని చూడగానే రాక్షసియైన ఆమె కామంతో మోహం చెందింది)

184. తరుణౌ రూప సంపన్నౌ సుకుమారౌ మహాబలౌ ।
పుణ్డరీకవిశాలాక్షౌ చీర కృష్ణాజినాంబరౌ ॥ రా.అ.19.14

(రామలక్ష్మణులు) యౌవనవంతులు, అందం నిండుగా ఉన్నవారు, సౌకుమార్యం గలవారు, మంచి జలమున్నవారు, తామరల వంటి విశాలమైన నేత్రములు గలవారు, నార బట్టలను, లేడిచర్మమును ధరించువారు) అని దేవతలకి చెందినవారైన కశ్యపులకీ, దతు అనే ఆమెకీ పుట్టిన దానవ (రాక్షస) వంశంలో పుట్టిన శూర్పణఖ కూడా ఈయనని ఆశపడింది గదా! అలా కాకుండా.

185. అధిజ్యధన్వానమవేక్ష్య రామం చరన్తమేకాన్త విలాసినీభిః ।
నూనం బభూవు ర్వనదేవతాశ్చ మర్త్యాంగజన్మ కుతూహలిన్యః ॥ 152

(అందమైన స్త్రీలతో ఎక్కుపెట్టిన నారిగల వింటిని ధరించి నడిచే రాముడిని చూసిన వన దేవతలు, మనుష్య స్త్రీల రూపాన్ని ధరించాలని ఆశ పడ్డారు) అని చెప్పినట్లుగా వన దేవతలు ఆశ పడటం చెప్పుతున్నట్టుగా చెప్పవచ్చును (తిర్యక్)

186. రామః కమల పత్రాక్షః సర్వసత్త్వమనోహరః ।
రూప దాక్షిణ్య సంపన్నః ప్రసూతో జనకాత్మజే ॥ రా.సుం 35-8

(జనకరాజకుమారీ! తామర రేకుల వంటి నేత్రములు గలవాడును, (వానర జంతువైన నాతో బాటుగా) సమస్త ప్రాణుల మనసును ఆకర్షించిన విగ్రహ సౌందర్యమును, గుణములను గలవాడై రాముడు అవతరించేడు) అని జంతువైన హనుమ కూడా ఈయన యందు అభినివేశం పొందేడు గదా!

వాతమామకన్ మర్కటమ్ విలఙ్గు - వాయుపుత్రుడైన మర్కటమైన జంతువు అని పెరియ తిరుమొళి 5-8-1లో చెప్పినట్లుగా దేవుడైన వాయువుకి పుట్టినవాడు గనుకను మనుష్యుల వలె ఉండటం చేతనూ, జంతువుగా పుట్టడం చేతనూ, దేవ, తిర్యక్, మనుష్యులు అనబడే మూడింటికి ఆంజనేయుడినే ఉదాహరణంగా చెప్పవచ్చును (మనుష్య)

187. రూపసంహననం లక్ష్మీం సౌకుమార్యం సువేషతామ్ ।
దదృశు ర్విస్మితాకారా రామస్య వనవాసినః ॥ రా.అ. 1-13

(రాముడి యొక్క దివ్యరూపాన్ని అందాన్నీ, సౌకుమార్యాన్నీ అందమైన వేషంగల వాడినీ, వనవాసులు ఆశ్చర్యభూతులై దర్శించేరు) అని మనుష్యజాతికి చెందిన ఋషులు కూడా ఈయన మీద అభినివేశం గలవారే అన్నమాట. (అది) శబ్దం చేత స్థావరములను సూచిస్తునది. అంటే

188. పాషాణ గౌతమవధూవపురాప్తి హేతుః (పాషాణంగా నున్న గౌతమపత్నిని స్త్రీగా అవటానికి కారణమైన విగ్రహ సౌందర్యం) అని చెప్పినట్లుగా, రాయి కూడా కరిగిపోయి అహల్య అనే స్త్రీ అయ్యేటట్లు ఉండటం, రాముడు అడవికి వెళ్ళినపుడు వాడిపోవడం, తిరిగి వచ్చినప్పుడు చిగిర్చిన వృక్షాలు కూడా ఆయనంటే అభినివేశాన్ని కలిగినవేనని వాల్మీకి కూడా సూచించేరు (అఖిలజన) ఇతడికి కావలసిన వారని, ఇతడిని ఎదిరించిన వారని తేడా లేకుండా అందరూ ఈయన మీద అభినివేశాన్ని పొందినవారే. (హృదయానన్దనస్య) కంటికి మాత్రమే అందమైన వాడై మనసులో తల్చుకున్నపుడు వ్యగ్రత కలిగించేవాడు కాకుండా.

నిత్యజ్ఞానక్రియైశ్వర్యాది భోగసామగ్రీ సమృద్ధస్య, మహావిభూతేః శ్రీమతః చరణారవిన్ద

82 రూపౌదార్యగుణైః పుంసాం దృష్టిచిత్తాపహారిణం (రా.అ. 3-29)

(విగ్రహసౌందర్యం, ఔదార్యము ఇంకా మిగిలిన గుణాల చేత పురుషుల చూపుని, మనస్సునీ కూడా అపహరించే రాముడిని) అన్నట్లుగా కణ్డవర్ తమ్ మనమ్ వళఙ్గుమ్ దర్శించిన వారి మనస్సు నృత్యం చేస్తుంది అని పెరుమాళ్ తిరుమొళి (8-2)లో సాయించిన ప్రకారంగానూ, అందరి మనస్సులనీ కరిగించి, మనసున్న వాళ్ళ మనసులని కదల్చివేసి కరిగి నీరై పోయేటట్లు చేస్తుంది. ఇదే విషయాన్ని ఎన్ నెఞ్జినారై కణ్డాల్ నా మనసు గారిని అక్కడ, (ఆ స్వామి వద్ద చూసినట్లైతే అని నమ్మాళ్వారు తిరువిరుత్తం (30)లో సాయించినట్లుగను తమ మనస్సుని పోగొట్టుకుంటారు అన్నంతగా ఉన్న అందంతో ఉన్నాడు.

ఈ విధంగా అందరికీ సాధారణమై యున్నది మాత్రమే భాగవతులపై పక్షపాతం లేదా? అంటే (ఆశ్రితవాత్సల్యైక జలధేః) వారి విషయములో దోషాన్నే గుణంగా భావించి ఉంటాడు. గోవు తాలూకు గుణమైన వాత్సల్యగుణం గలవాడు అని భావం

(ఆశ్రిత) ఆశ్రయించడానికి వచ్చిన దాసులు.

189 తే వయం భవతా రక్ష్యా భవద్విషయవాసినః ।

నగరస్థో వనస్థోవా త్వం నో రాజా జనేశ్వరః ॥ (రా.అ 1-20)

మీ దేశములో నివసించే మేము మీచేత రక్షింపబడవలసిన వారము. నరపతియైన మీరే నగరములో ఉన్నా, అడవిలో ఉన్నా మాకు రాజుగారు) అని తన దేశములో ఉన్నవారు రామ చరమ శ్లోకం ప్రకారము ఒకసారి శరణు పొందిన వారు.

190 పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి ।

తదహం భక్త్యుపహృతం అశ్నామి ప్రయతాత్మనః గీ.9-26)

(ఒక ఆకు గాని, పుష్పం గాని పండుగాని నీరు గాని ఎవరు భక్తితో నాకు ఉపహారంగా సమర్పిస్తారో, మనస్సుకి హత్తుకొనే ఆ భక్తుడిచేత ఇయ్యబడిన వాటిని (అలభ్యమైనవి లభించినట్లుగా) తింటాను అని ఒక పచ్చటి ఆకు, ఒక పుష్పం, ఒక ఫలం, ఏమీ లేకపోతే తీర్థం అనే వాటిని స్వీకరించవలెను అనే మాటతో శ్రీపాదాల మీద సమర్పించిన వాళ్ళందరూ దాసులే అవుతారు. (వాత్సల్య) అప్పుడే పుట్టిన దూడ శరీరము మీద నున్న మురికిని, తల్లి పశువు ప్రీతితో నాకి తినివేసినట్లుగా కున్ఱైయ కుణ్ణమ్ శెయినుమ్ కొళ్ళుమ్ కొండవలె పెద్దదైన పాపాలని చేసినా, వాటిని చూడకుండా పరమాత్ముడు గుణాలనే భావిస్తాడు అని ము.తిరువం.41లో చెప్పినట్లు భక్తిని (ప్రేమని) వర్షిస్తుంది. అంటే మిత్రభావేన సంప్రాప్తం న త్యజేయం కథంచన । దోషో యద్యపి స్యాత్ సతామేత దగర్హితమ్ అనే 57వ ప్రమాణం ప్రకారము, దోషమున్నప్పటికీ దాన్నే గుణంగా స్వీకరించి దాని కారణముగా వాడిని వదలకుండా ఉండటం (ఏకజలధేః) ఈ గుణం కూడా ఈయన ఒకరి వద్దనే ఉన్నదన్నట్టుగా ఉండటం. ఈ విధంగా చేతనుడు తనని పొందితే, అతడికి ఫలం ఇయ్యటమే తప్ప, దీన్ని తన ప్రయోజనమని తలంచలేదా? అంటే భక్త జన సంశ్లేషైకభోగస్య తన మీద ఆశగలవాళ్ళతో చేరటమే తనకి గొప్ప ప్రయోజనంగా గలవాడుగా ఉండటం (భక్తజన)

191. స్నేహపూర్వమనుధ్యానం భక్తిరిత్యభిధీయతే ।

భజ ఇత్యేషధాతుర్వై సేవాయాం పరికీర్తితః ॥

తస్మాత్ సేవా బుధైః ప్రోక్తా భక్తిశబ్దేన భూయసీ ॥ లైంగపురాణోత్తర బాగమ్

(స్నేహముతో కూడుకొన్న ధ్యానం భక్తి అనబడుతున్నది. భజ అనే ధాతువు సేవ అనే అర్థంలో చెప్పబడుతున్నది కనుక ఉత్తమమైన సేవయే పెద్దలచేత భక్తి శబ్దం చేత చెప్పబడుతున్నది) అని చెప్పినట్లుగా, ఇక్కడ భక్తి అనేది ప్రేమని చెప్పేదై, భక్తజనాలని భక్తి నిష్ఠులు, ప్రపన్నులు మొదలైన ప్రేమగల వాళ్ళనీ అర్థంగా చెప్తున్నది (సంశ్లేషైక భోగస్య) 176వ ప్రమాణమైన సకృత్త్వదాకారవిలోకనాశయా, తృణీకృతానుత్తమభుక్తి ముక్తిభిః ॥ మహాత్మభి ర్మామవలోక్యతాం నయ క్షణేపి తే యద్విరహోతిదుస్సహః అనే స్తోత్ర

రత్న శ్లోకం ప్రకారమున్నూ ఒరుమానొడియుమ్ పిరియాన్ ఒక క్షణ కాలము కూడా నిన్ను విడవను అనే తి.వా.మొ. 10-7-8 పాశురం

యుగళం అనన్యాత్మసంజీవనేన తద్గతసర్వభావేన శరణం అనువ్రజేత్ ॥

ప్రకారమున్నూ, ఇతర ప్రయోజనాన్ని కోరనట్టి వారితో ఒక క్షణం పాటు విశ్లేషాన్ని సహించలేక కలిసే ఉండటమే తనకి ధారకము. పోషకము భోగ్యము మొదలైన సమస్తమని తలిచేవాడని భావం.

ఈ విధంగా లెక్కకు మించిన ఆత్మలతో బాటు అనుభవించేటప్పుడు, అనుభవించటానికి కావలసిన జ్ఞానాదులైన తప్పక కావలసినవి ఈయన వద్ద తక్కువై యుంటాయేమో అంటే (నిత్య జ్ఞానక్రియైశ్వర్యాది భోగసామగ్రీవసమృద్ధస్య) ఎల్లప్పుడు ఉన్నదై, కొన్ని సమయాల్లో ఉపయోగించకపోవటం అనేది లేనిదీ, ఇష్టమైన సమస్త పదార్థాల స్వరూప, రూప, గుణ, క్రియారహితమై, కాలాదులని గురించిన జ్ఞాన క్రియలు, ఆ ప్రియమైన వాటిని తలుచుకొనినప్పుడు తన చేతిలోనే అనే ప్రభుత్వం, కాకపోతే సంపద అనే ఐశ్వర్యాది భోగసామాగ్రులు (అనుభవించడానికి తప్పక అవసరమైనవి) సమృద్ధిగా పొందియున్న వారి యొక్క ఈ విధముగా అనుభవమూ (అనుభవించుటకు అవసరమైన సామాగ్రులను ఉన్నను, ఉండి అనుభవించుటకు కావలసిన భోగస్థానము లేనిచో అనుభవించుట కుదరదు గదా! అన్నచో (మహావిభూతేః) పాదోస్య విశ్వా భూతాని త్రిపాదస్యామృతం దివి (పు.సూ. 3) అని పురుష సూక్తంలో చెప్పబడినట్లు లీలా విభూతివలెనే ఒక నాలుగవ వంతు అని చెప్పదగినట్లుగా పరిచ్ఛిన్నము గాకుండ, దానికి మూడు రెట్లు అని చెప్పినట్లు ఈయన అనుభవము కొఱకే ఏర్పడిన నిత్యవిభూతిని గల వాని యొక్క ఇటువంటి స్థానములో ఉండి అపరిమితమైన ఆనందమును అనుభవించునపుడు వేరొక సహాయము లేకనే బ్రహ్మచారి నారాయణునిగనే ఉన్నాడే? అంటే (శ్రీమతః) అనుభవ ప్రవాహములో తీరాన్ని చూడటానికి సహాయముగా ఉండే సాక్షాల్లక్ష్మిని తనకు పట్టపురాణిగా గలవాని యొక్క.

దీనిపై ఒక ఆక్షేపము వస్తున్నది. ఈయన అనుభవము సంసారుల అనుభవము వంటిదై ఉంటే, సహాయము కావలెను. అన్ని కోరికలు తీరినవాడు. (అవాప్తసమస్తకాముడు) ఆనందమే రూపు దాల్చినవాడైయున్న ఈయనకు పిరాట్టితో చేరియుండటం చేత కలిగిన ఆనందం అంటే అది యేమి? అందులో సహాయము ఏమి? అంటే ఈయనకు అనుభవమనేది దాసులను ఉజ్జీవింపజేసి వారితో కలిసియుండటమే. దానికి ఈ పిరాట్టి పురుషకారభూతురాలై యుండి దాసులను





ఈయనతో చేర్చడం చేత ఈయనకి సహాయముగా నున్నది. ఈవిధంగా నున్న ఈయన స్వరూపాన్నా ఆశ్రయించడం? అంటే, (చరణారవిందయుగళం) చేత నుండి పారతంత్ర్య స్వరూపానికి తగియున్నవై, అనంతమైన మాధుర్యం గలవియై, తాము అందంగా చేరియున్నట్లే అందరిని చేర్చుకొనగలవియై యున్న ఆయన శ్రీపాదపద్మముల జోడీని (ద్వంద్వమును), ఆ శ్రీపాదకమల ద్వంద్వమును ఆశ్రయించడం ఎట్లా ? అంటే (అనన్యాత్మసఞ్జీవనేన) ఆత్మను ఉజ్జీవింపచేయడానికి ఈ ద్వంద్వం తప్ప వేరొకటి లేదు అనే నిశ్చయముతో (తద్గతసర్వభావేన) ఉజ్జీవింపజేసేది వేరొకటి ఏదీ లేనందున, ఈ ద్వంద్వమే రక్షించును అనే నిశ్చయభావంతో, ఈ భావముతో కలసి చేయబోయే కార్యమేమిటి? అంటే, (శరణం అనువ్రజేత్) పరమపురుషార్థానికి సాధనము పరమపురుషుడైన ఈయనే అని నిశ్చయించుకొనినవాడు. వ్రజ ధాతువు గతిని చెప్పేదై ఇక్కడ మనోగతియైన నిశ్చయాన్ని చెప్పుతున్నది. అలా అయితే వ్రజేత్ అన్న దానితో సరిపోతుంది గదా! అను వ్రజేత్ అను ప్రయోగమెందుకు? అంటే వ్రజ-గతౌ అను ధాతువు జ్ఞానాన్ని మాత్రం చెప్పుతూ అను వ్రజేత్ అనడం చేత ఆ జ్ఞానంలో నిశ్చయాన్ని చూపడానికి అని చెప్పవచ్చును. లేదా అనుస్యూతం వ్రజేత్ (తలచుచునే యుండవలెను) అని వీరే శ్రీరంగ గద్యలో ద్వయమును అర్థానుసంధానముతో సర్వదా చెప్పుచుండుము అని ప్రసాదించిన ప్రకారమే సర్వకాలముల యందును చెప్పడాన్ని సూచించేదిగా చెప్పవచ్చును. అలాగాక, శరణమంటే ఉపాయాన్ని చెప్పేదై శరణమను వ్రజేత్ అని విడదీసి ఉపాయమను భావనతో ఆశ్రయించువాడు అని చెప్పవచ్చును.

2. తతశ్చ ప్రత్యహం ఆత్మోజ్జీవనాయ, 3. చతుర్దశభువనాత్మకం అండం దశగుణితోత్తరం చ ఆవరణ సప్తకం సమస్తం

రెండవ చూర్ణికకి అవతారికః ఈ విధంగా ఒకసారి శరణుపొంది దానితో వదలి వేయటమేనా? అంటే తతశ్చ ప్రత్యహం ఆత్మోజ్జీవనాయ ఏవం అనుస్మరేత్ అని ఫలమును పొందడానికి ఒకసారి శరణాగతి చేసినా సరిపోయినప్పటికీ, తాను సత్తపొందడానికి, ధరించి నిలబడటానికీ ప్రతిరోజూ ఈ విధంగా అనుసంధించుకొనవలెను అని అంటున్నారు ఈ చూర్ణికలో.

వ్యా. తతశ్చ

192.తత్ ద్వయం సకృదుచ్చారో భవతి (ద్వయోపనిషత్)

ఆ ద్వయమును ఒకసారి ఉచ్చరించినచో సరిపోవును) అని ద్వయోపనిషత్తులోనూ, శరణాగతి గద్య ప్రవేశములోనూ ఎత్తుకొనబడిన అయిదవ ప్రమాణమైన రామ చరమశ్లోకములోనూ చెప్పినట్లు సర్వేశ్వరుడు ఉపాయమవడానికి ఒకసారి శరణాగతి చేస్తే సరిపోతూండగా, తరువాత కూడా ఇంతా చేస్తూండవలెను అంటున్నది ఎంతవరకు చేయాలి అనే ప్రశ్న వస్తే (ప్రత్యహం) ఒకసారి శరణు పొంది యున్నామే అని వదలివేయకుండా ప్రతి దినము దీనిని అనుసంధించవలెను. ఈ విధంగా ప్రతిదిటనము అనుసంధించడం, ఒకసారి శరణాగతి చేస్తే శరణాగతి పూర్తి అవకనా? అంటే (ఆత్మోజ్జీవనాయ)

193.యన్ముహూర్తం క్షణం వాపి వాసుదేవో న చిన్త్యతే ।
సాహానిస్తన్మహచ్ఛిద్రం సా భ్రాన్తి స్సా చ విక్రియా ॥ గారుడ పూర్వ 222-22

(ఏ ముహూర్తంలో క్షణంలో వాసుదేవుడు తలంచబడటం లేదో, ఆముహూర్తమే, ఆ క్షణమే హాని. అదే మహాదుఃఖం అదే భ్రాంతి (మైకం) అన్న ప్రకారము ఒక క్షణ కాలము కూడా సర్వేశ్వరుడిని అనుసంధించకుండా ఉండడం ఆత్మ ఉజ్జీవించడానికి అనుసంధించేటప్పుడు ఏదో ఒకలాగ అనుసంధిస్తే సరిపోవునా అంటే (ఏవం) మొదటి సారి అనుసంధించినపుడు ఎంత ఆర్తితో, ఏ ప్రకారముగా అనుసంధించేడో వాటిలో ఏమి తగ్గకుండా (అనుస్మరేత్) ప్రత్యహం అంటే ప్రతిదినము అని అర్థము. అందులో ఒకరోజుకి ఒకసారి అనుసంధిస్తే సరిపోతుంది అని భావించకుండా ప్రతిరోజు ఎల్లవేళలా అనుసంధించవలెను అని అనుస్మరేత్ అనే పదము చూపుతున్నది. (ద్వయం అర్థానుసన్ధానేన సహసదైవం వక్తా) అని శరణాగతి గద్యలో 19వ చూర్ణికలో చెప్పిన ప్రకారముగా మేలుకొనియున్నప్పుడు విచ్ఛేదం లేకుండా అనుసంధించవలెను అని భావం.

3. మూడవ చూర్ణికకి అవతారికః

శరణాగతి నిష్ఠ పొందినవాడు అర్చిరాది మార్గంలో పోయి పొందే నిత్యవిభూతిని, అక్కడున్న విశేషాలనీ ఈ చూర్ణిక చెప్పుతున్నది.

వ్యా. చతుర్ధశభువనాత్మకమ్ భూః, భువః., సువః, మహః, జనః, తపః సత్యమ్ అనే ఊర్ధ్వలోకాలు ఏడున్ను, అతల, వితల, సుతల, రసాతల, తలాతల, మహాతల, పాతాల అనే అధోలోకములు ఏడున్ను మొత్తము పద్నాలుగు లోకాలుగా ఉండటం. ఈ విధంగా ఉండేది ఏది? అంటే (అణ్డమ్) అటువంటి లోకాలన్నింటికీ స్థానమై యాభైకోట్ల విస్తీర్ణం గల అండము (దశగుణితోత్తరం చ ఆవరణ సప్తకమ్) దశగుణితోత్తరమ్ అనే దాన్ని ఉత్తరోత్తర దశగుణితమ్ అని చెప్పుకోవాలి. ఒక ఆవరణానికి తరువాతి ఆవరణం పదింతలు (పదిరెట్లు) అయి, ఈ విధంగా పదింతలుగానున్న ఈ ఆవరణానికి దాని తరువాతి ఆవరణం దానికి పదింతలుగా ఉండి, ఇదే క్రమములో తరువాతి తరువాతి ఆవరణములు పదింతలు పదింతలుగా ఏడు ఆవరణములు గలదై. ఇది కార్య కారణ జాతం అతీత్య అన్న పదాలతో అన్వయిస్తుంది. ఏడు ఆవరణలు ఏవి అంటే జల, అగ్ని, వాయు, ఆకాశ, అహంకారం, మహాన్, అవ్యక్తం అనే ప్రకృతియైన ఇవి (సమస్తమ్) ఇంతవరకు చెప్పినది ఆవరణలతో

కార్యకారణజాత మతీత్య పరమవ్యోమశబ్దాభిదేయే బ్రహ్మాదీనాం వాఙ్మనస – అగోచరే శ్రీమతి వైకుంఠే దివ్యలోకే, సనక, విధి, శివాదిభిరపి అచిన్త్యస్వభావైశ్వర్యైః నిత్యసిద్ధైః

కూడిన ఒక అండం గురించినది.

194 అణ్డానాంతు సహస్రాణాం సహస్రాణ్యయుతాని చ ।
ఈదృశానాం తథా తత్ర కోటి కోటిశతాని చ ॥ వి.పు 2-7-27

ఆ ప్రకృతిలో ఇటువంటివి ఎన్నో కోటి లక్షల అండాలు ఉన్నవి అని సారార్థం) అని శ్రీ విష్ణు పురాణంలోను ఎణ్మీదియన్ల పుఱవణ్డమ్ అసంఖ్యేయమైన బాహ్యమైన అండములు అని (తి.వా.మొ 6-9-5) తిరువాయ్‌మొళిలో కూడా చెప్పినట్లు అనేకములైన కోటానుకోట్ల అండాలలో ఉన్న సమస్త లోకాలనూ (కార్య కారణ జాతమ్) వీటిలో ఒక్కొక్క తత్త్వము మరొక దానిచేత సృష్టించబడే కార్యవస్తువై, అదేవిధంగా ప్రతితత్త్వము మరొక దాని చేత సృష్టింపబడిన కార్యవస్తువులై ఉండే లెక్కకి మించిన (అసంఖ్యేయమైన) వస్తువుల సంఘాతమును (అతీత్య)

195 ఆబ్రహ్మభువనాల్లోకాః పునరావర్తినోర్జున ।

మాముపేత్య తు కౌన్తేయ పునర్జన్మ న విద్యతే ॥ గీ. 8-16

(కుంతీ పుత్రుడవైన అర్జునా! బ్రహ్మలోకము వరకు ఉన్న లోకాలన్నీ నశించేవే. నన్ను పొందిన పిదప మాత్రం తిరిగి జన్మ లేదు) అని గీతలో చెప్పిన ప్రకారము పుణ్య పాప కర్మలు తొలగనంత వరకూ జన్మ మరణాలు తిరిగి తిరిగి కలుగుతూండే ప్రకృతి కార్యమైన ఈ లీలా విభూతికి మరొకసారి తిరిగి రాకుండా దాటిపోయి.

దీనిని దాటిపోయి పొందే దేశం ఎలా ఉంటుంది? అంటే (పరమ) దీని తరువాత ఏమియు లేదు అని చెప్పదగి ఉన్నది ఈ దేశము (వ్యోమ శబ్దాభిధేయే)

104. సైషా భార్గవీ, వారుణీ విద్యా పరమే వ్యోమన్ ప్రతిష్ఠితా । తై.భృ. 6

వరుణుని చేత భృగువునకు చెప్పబడిన ఈ వారుణీవిద్య అన్నమయాదులను దాటి పరమాత్మ యందు ప్రతిష్ఠితమైనది) అని కర్మవశమైన ఈ లీలా విభూతి వలె ఇరుళ్ తరు మాఞాలమ్ అజ్ఞానమునే కలిగించు మహాలోకంలో మహాసంసారములో అని తి.వా.మొ. 10-6-1లో చెప్పినట్లు కాకుండా తెళి విశుమ్బు నిర్మలమైన ఆకాశములో అని (తి.వా.మొ 9-7-5)లో చెప్పినట్లు ఎల్లవేళలా జ్ఞానమనే తేజస్సును వృద్ధి పొందించేదిగా ఉంటుంది. ఈ విధంగా ఉన్నటువంటి ఈ దేశము పరిచ్ఛిన్నంగా ఉంటుందా అంటే (బ్రహ్మాదీనాం వాఙ్మనసాగోచరే) అల్ప జ్ఞానము గలవారము, అశక్తులమూ అయిన మనవలె కాక, జ్ఞానములోనైె, శక్తిలోనూ కూడా చాల గొప్పవారైన బ్రహ్మ రుద్రాది దేవతలకి కూడా వాక్కుకి గాని మనస్సుకి గాని అందనిదై ఉంటుంది. ఈ విధమైన దేశానికి పేరేమి? అంటే (శ్రీమతి వైకుణ్ఠే దివ్యలోకే) శ్రీవైకుంఠమని పేరు కర్మవశ్యమైన లీలా విభూతిలోలాగ (విభవ, అర్చావతారాల్లో) కైంకర్యైశ్వర్యం ఉన్నప్పటికీ, దానికి విచ్ఛేదాలు కలుగుతూండటం లేని కైంకర్యైశ్వర్యమును ఎల్లవేళలా పొందుతున్న దేశము. కుంఠ శబ్దం విచ్ఛేదాలని చెప్తూంటుంది. వైకుణ్ఠ శబ్దం విచ్ఛేదాలు లేని దేశం అని అర్థాన్నిస్తుంది. ఈ లీలా విభూతి వలె జీవుడు కర్మ చేత కప్పబడకపోవటంతో అతడి జ్ఞానం, శక్తి మొదలైన గుణాలకు అవిచ్ఛిన్నత గల దేశం అని భావం. (దివ్యలోకే) లీలావిభూతివలె కర్మవశ్యులైన మనుష్యులతో నిండిన లోకం గాకుండా, కర్మవశ్యులు కాని వారితో నిండిన దేశంగా ఉన్నది. ఇంతవరకూ దేశం తాలూకూ గొప్పదనం చెప్పబడింది. ఇక వానవర్ నాడు - నిత్యసూరుల పరవిభూతి (శ్రీవైకుంఠం) అని తి.వా.మొ 3-9-9లో ఆళ్వారు సాధించినట్లుగా, ఈ దేశపు అధిపతులుగా ఉండడే నిత్యసూరులను ఆపూరితే అన్నంత వరకూ ఉన్న వాక్యము చేత చెప్పుతున్నది (సనకవిధి శివాదిభిరపి అచిన్త్యస్వభావైశ్వర్యైః) బ్రహ్మ ధ్యానముక్క దానిలో



మునిగియుండి సృష్టి, స్థితి సంహారములైన కర్మలో అభినివేశం లేనివారు గనుక, బ్రహ్మ భావనానిష్ఠులు అని చెప్పబడే సనకులు, సనందనులు, సనత్కుమారులు అనబడే మునులు, సృష్టి, స్థితి సంహారములనే కర్మలలో పూర్తిగా అభినివేశమున్న వారు గనుక, కర్మ భావనా నిష్ఠులైన బ్రహ్మ, శివుడు మొదలైన దైవాలు కూడా తలుచుకొనటానికి (ఇలా ఉంటుంది అని అనుకోవడానికి) కూడా సాధ్యంకాని మహాత్మ్యములు గలవారు ఈ నిత్య సూరులు (నిత్యసిద్ధైః) ఈ లోకములో కర్మ బంధములు గలవారై

అనన్తైః భగవదానుకూల్యైకభోగైః దివ్యపురుషైః మహాత్మభిః ఆపూరితే, తేషామపి ఇయత్పరిమాణం, ఇయదైశ్వర్యం ఈదృశస్వభావమితి పరిచ్ఛేతుమ్ అయోగ్యే దివ్య

ఒకప్పుడు ముక్తిని పొందిన ముక్తుల వలె ఏదో ఒకప్పుడు పరమాత్ముడిని పొందిన వారు కాక, సర్వకాలాల్లోనూ ఎప్పుడూ కూడా సర్వేశ్వరుడి అనుభవాన్ని పొందుతున్నవారు గనుక నిత్యసూరులని పేరు పొందినవారు (అనన్తైః). ఈ విధంగా ఉండే నిత్యసూరులకు ఇంతమంది అని ఒక సంఖ్య లేదు అంటే లెక్కలేనంత మంది అని అర్థం. అన్తమ్ అనే పదము నాశాన్ని కూడా సూచిస్తుంది గనుక వీరికి నాశము లేదు అని చెప్పుతున్నట్టుగా కూడ చెప్పవచ్చు. (భగవదానుకూల్యైకభోగైః) ఎల్లప్పుడును భగవదనుభవమే తమకి సమస్తముగా గలవారు ఈ నిత్యసూరులు. (దివ్యపురుషైః) కర్మభూమియైన ఈలోకములో ఎప్పటికిని కర్మ వశ్యులై జన్మించని వారు వీరు అని అర్థం. (మహాత్మభి) మొదటి చూర్ణికలో తత్ప్రాప్తయే అనే పదాన్ని వివరించినపుడు 14వ పేజిలో ఉట్టంకించబడిన 176వ ప్రమాణమైన స్తోత్రరత్న శ్లోకము ప్రకారమును ఒరు మానొడియుమ్ పిరియాన్ ఒక క్షణ కాలములో ఒక భాగమైనా విడిచి ఉండడు. అని తి.వా.మొ. 10-7-8లో చెప్పినట్లుగను, సర్వేశ్వరుడు కూడా వీరితో క్షణకాల విశ్లేషాన్ని కూడా సహించలేని గొప్పదనం గలవారు వీరందరూ (ఆపూరితే) శూన్యంగా ఏ మాత్రపు స్థలభాగము కూడా ఉండకుండా పూర్తిగా వీరిచేత నిండియున్న దేశమే శ్రీవైకుంఠం. ఈ దేశం బ్రహ్మ మొదలైన వారి చేత ఇంతమాత్రము అని దాని విస్తీర్ణత గాని మాహాత్మ్యంగాని చెప్పబడటానికి తగినట్లుగా ఉంటుందా? అంటే వారి చేత కూడా పరిమితి చెప్పబడటం సాధ్యం కాదు అంటున్నారు. తరువాత (తేషామపి) తమని ఇతరులు ఇటువంటి వారు, ఇంత గొప్పవారు అని పరిమితితో చెప్పడానికి సాధ్యం కాని విధంగా నున్న వీరికి కూడా (తేషామపి) అసంఖ్యాకంగా ఉన్న వారిలో ఎవరైనా ఒకరి చేత ఇంతది, ఇటువంటిది అని చెప్పటానికి సాధ్యమౌతుందా అంటే, వారిలో ఎవరిచేతా కూడా పరిమితులతో





చెప్పబడటానికి సాధ్యం కాకుండా ఉంటుంది. ఈ పదం " పరిచ్ఛేత్తుం అయోగ్యే " (పరిచ్ఛేదించటానికి సాధ్యం కాని లోకంలో) అన్న పదాలతో అన్వయిస్తున్నది. ఈ విధంగా పరిచ్ఛేదించటానికి సాధ్యం కాకుండా ఉన్న అంశాలు ఏవి? అంటే (ఇయత్ పరిమాణం) పొడవు, వెడల్పు, ఎత్తు, వైశాల్యం మొదలైన మితులు ఇంత, ఇంత అని చెప్పటానికి సాధ్యం కాకుండా ఉన్నది అని అర్థం. (ఇయదైశ్వర్యమ్) ఇందులో నున్న సంపద ఇంత అని గాని ఇంతమాత్రం అని గాని చెప్పటానికి సాధ్యం కాదు అని భావం. (ఈదృశస్వభావం) దీని గొప్పదనాలు ఇటువంటివి అని చెప్పసాధ్యం కానివి అని భావం. (ఇతి పరిచ్ఛేత్తుం అయోగ్యే) పొడవు, వెడల్పులు, సంపద, గొప్పదనం మొదలైన వాటిలో ఇటువంటిది అని ఏవిధంగానూ పరిచ్ఛేదించి చెప్పటానికి సాధ్యం కాదు అని అర్థం (దివ్యావరణశతసహస్రావృతే) ఈ లోకంలో కనబడే ప్రాకారాల కంటే చాల విశేషమైనవై, అప్రాకృతమైన నూరువేల ప్రాకారాలు గలది ఆ దేశం. ఏ విధమైన దుఃఖం గాని కష్టంగాని లేనటువంటి ఈ దేశములో ప్రాకారాలెందుకు? అంటే

196.పురం హిరణ్మయీం బ్రహ్మ వివేశా పరాజితా (మ్) తై.ఆర.1-28

(అపరాజిత అని పేరు గల సువర్ణమయమైన నగరంలో బ్రహ్మం ప్రవేశించినది) అని వేదములో చెప్పబడినట్లుగా సావలోక చక్రవర్తిలైన పరమాత్మ వేంచేసి యున్న రాజదాని గనుక, నగరానికి తగిన లక్షణాలన్నీ దీనికి కావాలి అంతే కాక.

197.తతస్త్వహం చోత్తమచాపబాణధృక్సిద్ధో ఽభవం తత్ర స యత్ర లక్ష్మణః ।

అతద్భిభిర్ జ్ఞాతిభిరాత్తకార్ముకై ర్మహేన్ద్ర కల్పం పరిపాలయం స్తదా ॥ రా.అ. 87-23

(ఆ తరువాత (లక్ష్మణుడి మీద అతి శంకగల గుహుడనే) నేను మించి వింటిని బాణాలను ధరించి, (నా మీద కూడా అతిశంకతో) సావధానులై, ధనుర్ధారులైన నా వారితో కలసి మహేంద్రుడి వంటి రాముడిని లక్ష్మణుడికి దగ్గరగా నిలిచి రక్షిస్తున్నాను) అని శ్రీరామాయణంలోనూ, మల్లాణ్డ తిణ్తోళ్ మణివణ్ణా ఉన్ శేవడి శెవ్వి తిరుక్కాప్పు - చాణూరాది మల్లులను జయించిన దృఢమైన భుజములు గలవాడా! నీ ఎఱ్ఱని శ్రీపాదాల సౌందర్యానికి, తిరుక్కాప్పు -

ఆవరణశతసహస్ర ఆవృతే, దివ్యకల్పకతరు – ఉపశోభితే, దివ్యోద్యానశతసహస్రకోటిభిః ఆవృతే, అతి ప్రమాణే, దివ్యాయతనే, కస్మింశ్చిత్ విచిత్ర (దివ్య) రత్నమయే దివ్యాస్థాన మణ్డపే, దివ్యరత్న స్తంభశత సహస్రకోటిభిః ఉపశోభితే దివ్యనానారత్న కృత స్థల విచిత్రితే, దివ్యాలంకారాలంకృతే, పరితః పతితైః పతమైనైః పాదపస్థైశ్చ నానాగంధవర్ణైః దివ్యపుష్పైః శోభమానైః దివ్యపుష్పోపవనై రుపశోభితే, సంకీర్ణ పారిజాతాది కల్పద్రుమోపశోభితైః అసంకీర్ణైశ్చ కైశ్చిత్ అన్తస్థపుష్పరత్నాదినిర్మిత దివ్యలీలామణ్డప శతసహస్రకోటిశోభితైః సర్వదా అనుభూయమానై రపి అపూర్వ వదాశ్చర్యమావహద్భిః క్రీడాశైల శతసహస్రైరలంకృతైః కైశ్చిత్ నారాయణ రక్షణ పల్లాణ్డుమ్ పరమాత్మనై చ్చూక్న్దిరున్దేత్తువర్ పల్లాణ్డే – ఎన్నో సంవత్సరాలు భగవానుడిని చుట్టూచేరి మంగళాశాసనం చేసే భాగ్యాన్ని పొందుతారు అని తిరుప్పల్లాణ్డులోనూ చెప్పినట్లు సేన మొదలైనవి లేకపోయినప్పటికీ, అమితమైన ప్రేమ చేత అతిశంకిస్తున్నవారై, రక్షించేవాడైన సర్వేశ్వరుడినే రక్షించుకొనేవారు గదా, అక్కడున్న నిత్యసూరులు, అందుచేతనే అక్కడ ఎన్నో ప్రాకారాలుండటంలో దోషమేమీ లేదు గదా! ఈ విధంగా రక్షించటానికి ఎన్నో ప్రాకారాలున్నా, భోగ్యతలేకుండానే ఉంటుందా? అంటే (దివ్యకల్పకతరూపశోభితే) ఈ లీలా విభూతిలో నున్న స్వర్గాది ప్రదేశాల్లో ఉన్న కల్పక వృక్షంలాగ కాకుండా, అప్రాకృతమైన కల్పకవనములతో చాల భోగ్యంగా ఉంటుంది. (దివ్యోద్యాన శతసహస్రకోటిభిరావృతే) పిరాట్టిమారులకున్నూ, శ్రీవైకుంఠనాథుడికిన్నీ క్రీడించటానికి తగిన అనేకమైన నందనవనములతో పరివృతమైనది. (అతి ప్రమాణే) ఇంత వెడల్పు, పొడవు, ఎత్తు అని చెప్పటానికి సాధ్యంకాని విధంగా ఉంటుంది (దివ్యాయతనే) ఈవిధంగా నున్న శ్రీవైకుంఠమనే భగవానుడి రాజధాని.

(కస్మింశ్చిత్) ఆ నగరంలో ఒకచోట (విచిత్ర రత్నమయే) పలురకాలైన ఆశ్చర్యకరమైన, రత్నాలు పొదగబడిన (దివ్యాస్థానమణ్డపే) అందరికీ దర్శనమిచ్చే దివ్య మణిమంటపంలో, (దివ్య రత్న స్తంభ శత సహస్ర కోటిభిరుపశోభితే) ఎన్నో వేల మాణిక్యములతో చేసిన స్తంభాళతో అలంకరించబడినదై, (దివ్య నానారత్నకృత స్థల విచిత్రితే) పలువిధములైన అప్రాకృత మాణిక్యముల చేత నిండిన ఆశ్చర్యకరమైన ప్రదేశములు గలదియై దివ్యాలంకారాలంకృతే దివ్యమైన చాందినీ, దానిని నిలబెట్టే సాధనము, స్తంభముల చేత నిలబెట్టబడిన శయ్యాది అలంకారముల చేత





అలంకరించబడినదై, (పరితఃపతితైః) నాలుగు దిశలలోనూ విస్తరించి (పతమానైః) పడుచున్నటువంటి (పాదపస్థైశ్చ) చెట్లపైగల (నానాగంధవర్ణై) పలు విధములైన సుగంధములతో, వర్ణములలో నున్న (దివ్యపుష్పైః శోభమానైః) ఇటువంటి అప్రాకృతమైన పుష్పముల చేత శోభించుచున్న ప్రకాశించుచున్న (దివ్య పుష్పోపవనైః ఉపశోభితే) నగరములో నాలుగు ప్రక్కలా నిండుగా నిలచియున్న వృక్ష సంఘాతముల చేత (సంకీర్ణ పారిజాతాది కల్పద్రుమోపశోభితైః) పారిజాతము, సంతానము, హరిచందనము మొదలైన నిండుగా నున్న వృక్షములతో కూడిన సామాన్యమైన కల్పకవృక్షములచేత ప్రకాశిస్తున్నది. (అసంకీర్ణైశ్చ కైశ్చిత్) ఒకదానితో ఒకటి కలసిపోయి విడదీయటానికి సాధ్యం కాని విధంగా లేని అనగా విడి విడిగా నున్న కొన్ని వృక్షముల చేత (అంతస్థ పుష్పరత్నాది నిర్మిత దివ్య లీలా మణ్డప శత సహస్రకోటి శోభితైః) వృక్షముల వరుసలలో అమరియున్న పుష్పమండపములు, మాణిక్యమండపములు మొదలైన అనేక క్రీడా స్థలములచే అలంకరింపబడిన (సర్వదా అనుభూయమానైరపి అపూర్వ వదాశ్చర్యమావహద్భిః) సర్వదా అనుభవించి యున్నను, ఎప్పటికప్పుడే నిత్య నూతనముగా అనుభవించినట్లు ఆశ్చర్యకరమైయున్నట్టి (క్రీడాశైల శతసహస్రాలంకృతైః) అనేక సహస్రములైన క్రీడాపర్వతములచే అలంకరించబడినదై (కైశ్చిత్ నారాయణ దివ్యలీలా అసాధారణైః) కొన్ని నందన వనములు పెరియపిరాట్టి (లక్ష్మీదేవి) మొదలైన

దివ్యలీలా సాధారణైః సాధారణైశ్చ కైశ్చిత్ శుకశారికామయూరకోకిలాదిభిః కోమలకూజితైః ఆకులైః దివ్యోద్యాన శతసహస్రకోటిభిః ఆవృతే. మణిముక్త ప్రవాళకృతసోపానైః దివ్యామలామృతరసోదకైః దివ్యాండజవరైః అతిరమణీయదర్శనైః అతిమనోహర మధుర స్వరైః (ఆకులైః) అన్తస్థముక్తామయ దివ్యక్రీడాస్థానోపశోభితైః దివ్య సౌగంధికవాపీ శత సహస్రైః దివ్యరాజహంసావళీవిరాజితైః ఆవృతే నిరస్తాతిశయ ఆనందైకరసతయా చ ఆనన్త్యాచ్చ ప్రవిష్టాన్ ఉన్మాదయద్భిః క్రీడోద్దేశైః విరాజితే తత్ర తత్ర కృత దివ్య పుష్ప పర్యంకోపశోభితే, నానా

పిరాట్టిమారుల అందమైన క్రీడలకే తగినదైయుండును.

పద్మవనాలయా తామరల తటాకమును వాసస్థానముగా గలది అని లక్ష్మీదేవిని ఇచ్చట చెప్పుట మిగతా పిరాట్టి మారులకును ఉపలక్షణము.

(సాధారణైశ్చ కైశ్చిత్) ఇంకా మరికొన్ని నందవనాలు పెరుమాళ్ళు పిరాట్టిమారులు ఇద్దరికిని సాధారణమైనవిగా ఉంటాయి.

(శుకశారికా-మయూరకోకిలాదిభిః) చిలుకలు, శారికలు, (కోకిలలో ఒక రకమైన చిన్న పక్షులు. వీటిని పూవై అని తమిళంలో అంటారు) నెమళ్ళు, కోకిలలు మొదలైన పక్షుల చేత, వీటిలో శుకం అనే పదం పచ్చటి చిలుకలని చెప్తుంది. శారిక అంటే పూవై అనబడే ఒకరకమైన కోకిలని చెప్తుంది. ఆది శబ్దం చేత హంసలు, కురుగుపక్షులు మొదలైన నానారకములైన పక్షులను చెప్తున్నది.

(కోమలకూజితైః ఆకులైః) మధురమైన స్వరము గల పక్షులతో నిండియున్న

(దివ్యోద్యాన శతసహస్రకోటిభిః ఆవృతే) ఇటువంటి నూరు వేల కోట్ల తోటలచేత పరివేష్ఠితమైనదై.

(మణిముక్తా ప్రవాళ కృతసోపానైః) ముత్యములు, రత్నములు, పగడములు మొదలైన వాటి చేత ఏర్పాటు చేయబడిన అందమైన సోపానములతో నున్న

(దివ్యామల అమృత రస ఉదకైః) అప్రాకృతములు, దోషరహితములును అమృతమువలె నిండుగా నున్న జలములతో నున్న జల ప్రదేశములు చుట్టును గల, ఈ లీలావిభూతిలో మనము చూచు పదార్థములు దోషములు గలవి. నశించు స్వభావము గలవిగను

ఉండును. అచ్చట నున్న సమస్తమును అప్రాకృతములు గనుక, దోషరహితములును నాశము లేనివగను ఉండునని దివ్య శబ్దము చెప్పుచుండుటచే పలుసారులు ఈ దివ్య అను పదము ప్రయోగించబడుచున్నది.

దివ్యాణ్డ జవరైః అప్రాకృతమైన విశేషమైన పక్షుల చేత

అతిరమణీయ దర్శనైః కంటికి అందంగా కనబడేవి

అతిమనోహర మధుర్స్వరైః చాల మనస్సుకు ఆహ్లాదకరమైన స్వరముల మాధుర్యముగల. ఈ రెండును పక్షులకు విశేషణము. ఇక జల ప్రదేశము వలన వర్ణిస్తున్నారు.

అన్తస్థముక్తామయదివ్యక్రీడాస్థానుపశోభితైః లోపలయున్న ముత్యముల చేత కట్టబడిన క్రీడా స్థలములతో ప్రకాశించుచున్నవై

దివ్యసౌగంధికవాపీ శతసహస్రైః అప్రాకృతమైన ఎఱ్ఱకలువగల జలములతో నిండియున్న నూరువేల కొలనులతో

దివ్యరాజహంసావలీ విరాజితైః ఆవృతే చుట్టును వెనుక చెప్పబడిన కొలనులు శుద్ధసత్త్వము గల రాజహంసల వరుసలతో ప్రకాశించుచున్న

నిరస్తాతిశయ ఆనందైకరసతయా చ ఇంతకంటె ఎక్కువైనది మరొకటి లేని ఆనందమై, అంతులేని భోగ్యతగలదియై యుండుటచే

అనన్త్యాచ్చ అనంతమగుట చేతను

ప్రవిష్టానున్మాదయద్భిః అచటికి ప్రవేశించిన వారిని భోగ్యతచే చాల అభినివేశము పొందునట్లు చేయు,

క్రీడోద్దేశైః విరాజితే ఇటువంటి క్రీడా ప్రదేశములతో ప్రకాశించుచున్నదై

తత్ర తత్ర కృత దివ్య పుష్ప పర్యంకోపశోభితే ఆయా స్థలములలో చేయబడిన పుష్ప శయ్యల చేత అలంకరింపబడినదై

నానాపుష్పాసవాస్వాదమత్తభృంగావళీభి రుద్గీయమాన దివ్య గాంధర్వేణ ఆపూరితే పలు రకములైన పుష్పములలో నున్న తేనెను త్రాగి, దానిచే మత్తెక్కియున్న తుమ్మెదల గుంపుల చేత పాడబడుచున్న మంచి గాను చేత నిండియున్నదై

(చందనాగరు కర్పూర దివ్య పుష్పావగాహి మందానిలా సేవ్యమానే) చందనము, అగరు, కర్పూరము అందమైన పూవులు వీటిలో ప్రవేశించి అక్కడి సువాసనలను తోడ్కొని వస్తున్న చల్లని మలయ మారుతము చేత విశేషించబడి

పుష్పాసవాస్వాదమత్తభృంగావలీభి రుద్గీయమాన దివ్య గాంధర్వేణ ఆపూరితే, చందనాగరు కర్పూర దివ్య పుష్పావగాహిమందానిలా సేవ్యమానే, మధ్యే (దివ్య) పుష్ప సంచయవిచిత్రితే మహతి దివ్యయోగపర్యంకే అనంతభోగిని, శ్రీమద్వైకుంఠైశ్వర్యాది దివ్యలోకం ఆత్మకాన్త్యా విశ్వం ఆప్యాయయన్త్యా, శేషశేషాశనాది సర్వపరిజనం భగవతః తత్తదవస్థోచిత పరిచర్యాయాం ఆజ్ఞాపయన్త్యా శీలరూపగుణవిలాసాదిభిః ఆత్మానురూపయా శ్రియాసహ ఆసీనం ప్రత్యగ్రోన్మీలితసరసిజసదృశనయన యుగళం, స్వచ్ఛ నీలజీమూత సంకాశం అత్యుజ్జ్వల పీతవాససం, స్వయాప్రభయా అతినిర్మలయా అతిశీతలయా స్వచ్ఛయా మాణిక్యాభయా

మధ్యే పుష్ప సంచయ విచిత్రితే మధ్యన చెదరిన పూవులతో ఆశ్చర్యకరమైనదై యున్న వెనుకటి భోగశబ్దము పాము శరీరాన్ని చెప్తుంది. భోగీ అంటే పాము. శ్రీశేషుడనే పాముమీద అని అర్థం. ఈవిధంగా నున్న శయ్యమీద పెరియపిరాట్టియైన లక్ష్మీదేవితో కూడి ఎలా వేంచేసి యున్నాడో తరువాత చెప్తున్నారు.

శ్రీమద్వైకుంఠైశ్వర్యాది దివ్యలోకం ఇటువంటి ఐశ్వర్యంగల వైకుంఠమనే దివ్య లోకాన్ని ఆత్మకాన్త్యా తన తేజస్సుతో

విశ్వం ఆప్యాయయన్త్యా అంతటితో అందాన్ని తెచ్చి

శేషశేషాశనాది సర్వ పరిజనం అనంతుడనే ఆదిశేషుడు, సర్వేశ్వరుడి శేష ప్రసాదాన్ని ఆరగించేవారు గనుక శేషాశనులు అని పేరు పొందిన సేనేశులు అని చెప్పబడే విష్వక్సేనులు మొదలైన దాసులందరిని.

భగవతస్తత్తదవస్థోచిత పరిచర్యాయాం ఆజ్ఞాపయన్త్యా సర్వేశ్వరుడికి ఆయా అవస్థలకి తగిన కైంకర్యాలతో నియమిస్తూన్నటువంటిదై

తేవిమారావార్ తిరుమకళ్ పూవియే మణ్ణమరర్ ఆట్చ్రెయ్‌వార్ తన అందానికీ గొప్పతనానికీ తగియున్న దేవేరియైన లక్ష్మీదేవియు, సమస్తమైన విభూతికిని అభిమానియైన భూదేవిన్నీ, ఆపైన నప్పిన్నపిరాట్టిన్నీ నియోగిస్తూండగా కైంకర్యం చేసేటటువంటి నిత్యసూరులు అని తి.వా.మొ. 8-1-1లో ఆళ్వారు సాధించారు గదా!

(శీలరూపగుణ విలాసాదిభిః ఆత్మానరూపయా) శీల గుణం చేత ఉపలక్షణ పద్ధతిలో చెప్పబడిన సౌందర్యాది దివ్యాత్మగుణాలు, రూపగుణ అని చెప్పబడిన సౌందర్యాది రూప గుణాలు, విలాసం అనబడే కోమలత్వాదుల చేత సర్వేశ్వరుడికి చాల చక్కగా అమరిన

(శ్రియాసహాసీనమ్) లక్ష్మీదేవితో కలసి వేంచేసియున్న

(సర్వేశ్వరుడిని) లక్ష్మీదేవితో కలసి వేంచేసి ఉన్న (సర్వేశ్వరుడిని)

ప్రత్యగ్రోన్మీలిత సరజిసదృశనయనయుగళం) అప్పుడే వికసించుతున్న తామరపుష్పం వలె ఉన్న

దివ్యనేత్ర ద్వయం గల స్వచ్ఛనీలజీమూత సంకాశం) స్వచ్ఛమైన వర్షాకాల మేఘం వలె ఉన్నటువంటి వానిని.

(అత్యుజ్జ్వలసీతవాససం) చాలా స్వచ్ఛంగా ఎట్టి మాలిన్యమూ లేకుండానునన్న (మాణిక్యాభయా) మాణిక్యం వంటి కాంతి గలది ఆ ప్రభ.

(కృత్స్నం జగత్ భాసయంతం) అటువంటి కాంతి చేత లోకాన్నంతటినీ ప్రకాశింపజేస్తున్న సర్వేశ్వరుడిని. తరువాతి పదము సర్వేశ్వరుడి లావణ్యమనే తిరుమేని సౌందర్యాన్ని వర్ణిస్తున్నది.

అచింత్య దివ్యాద్భుత ఆ లావణ్యం ఎవరిచేతనూ ఊహించటానికి కూడా అందనిదీ, అప్రాకృతమైనదీ, అత్యాశ్చర్యకరమైనదీ.

నిత్యయౌవన స్వభావలావణ్యమయ అమృత సాగరం ప్రాకృత శరీరాలకి ఉన్న ముసలితనం వంటి అవస్థలు లేనిదై, ఎల్లప్పుడు యౌవన ప్రాయంలోనే ఉండి సహజమైన లావణ్యంతో నున్న తిరుమేని సౌందర్యమైన అమృతసాగరం అయినవాడిని.

అతిసౌకుమార్యాత్ ఈషత్ప్రసిననవదాలక్ష్మవణ లలాలటఫలకదివ్యాలకావళీ విరాజితం చాల మృదువైనది గనుక చిగురు వలె ఉండే నుదురు మీద దోబూచులాడుతున్న ముంగురులతో

(కేశపాశాలచేత) వెలిగి పోతున్నాడు ఆయన తరువాత ఉన్న ఏడు పదాలతో ఎనిమిదవ వాక్య ఖండం యామునులు ప్రసాదించిన స్తోత్రరత్నం 33,34,35 శ్లోకాలలో ఉన్నదే. వాటి అర్థాన్ని స్తోత్ర భాష్యంలో చూడవలెను అని పెరియవాచ్చాన్ పిళ్ళై సాయించారు. వారి స్తోత్ర రత్న భాష్యాన్ని అనుసరించి వాటి అర్థం ఇక్కడ వ్రాయబడుతున్నది.

కృత్స్నం జగత్ భాస్యన్తం అచిన్త్యదివ్య అద్భుత నిత్యయౌవనస్వభావలావణ్యమయామృత ప్రబుద్ధ ముగ్ధాంబుజచారులోచనం అని ఆరంభించి (ఉన్నసం) అనే పదంవరకు కోళితామరై (తి.వా.మొ 9-10-9) అనే పాశురంలో నమ్మాళ్వారులు వర్ణించినట్లు తిరుముఖంలో నున్న అవయవాల సౌందర్యపు చేర్తిని అనుభవిస్తున్నారు.

ప్రబుద్ధ దాసులతో కలిసి ఉండటం వలన వికసించినవి ఆ దివ్య నేత్రాలు (ముగ్ధ) కళ్ళలో ఒక అసాధారణమైన కొత్తనాన్ని చెప్తున్నది. తిరుప్పావైలో కిణ్కిణియై చ్చెయ్త తామరై ప్పూప్పోలే అజ్ఞణిరణ్డుమ్ కొణ్డు అని చెప్పినట్లుగా అప్పుడే వికసించడం ప్రారంభమైన తామర వంటి కొత్తదనం చెప్పబడుతున్నదని చెప్పవచ్చు.

పోదుఱు ముకమ్ చెయ్తు తనకి కలిగిన ప్రీతిని ముఖంలో కనిపించుతూ అని తి.వా.మొ. 9-9-9లో చెప్పినట్లు దాసులతో చేరటం చేత కలిగిన ఆనందాతిశయం వల్ల కలిగిన క్రొత్త అందాన్ని చెప్పుతున్నదని అనవచ్చు.

అంబుజచారులోచనం తామరవంటి అందమైన దివ్య నేత్రాలు గలవాడిని. ఇటువంటి తామరని ఉపమానంగా చెప్పడం కుదరకపోవడం చేత ఆ తామరకంటె అందంగా ఉండే ఉపమేయమైన నేత్రాలనే చెప్తున్నారు.

పాపం హరతి యత్ పుంసాం స్మృతం సంకల్పనామయమ్ ।

తత్ పుణ్డరీక నయనం విష్ణోర్ద్రక్ష్యామ్యహం ముఖమ్ ॥ వి.పు. 5-17-4

ఏ తిరుముఖమండలము తలచుకొనగానే మనుష్యుల పాపాన్ని తొలగించుతుందో, ఆశ్రితుల సంకల్పానుసారముగా ఏర్పాటు అవటం, తామరల వంటి దివ్యనేత్రాలు గలదిన్నీ అయిన విష్ణువు యొక్క ఆ తిరుముఖ మండలాన్ని నేను దర్శించబోతున్నాను. అని దాసులు ఆశించే దివ్యనేత్రాలు గదా!

సవిభ్రమభ్రూలతమ్ దగ్గరగా ఉండే లత వంటి కనుబొమ్మలు గలవాడిని.

మన్నియ శీర్ మదనన్ కరుప్పుచ్చిలైకొల్ సౌందర్యాది గుణములు గల మదనుడి చెరుకల విల్లుగదా! అని తి.వా.మొ. 7-7-4 లో చెప్పినట్లుగా, దాసుల విషయములో ప్రేమంతా కనబడే విధంగా దగ్గరగా చేరియున్న భ్రువములు గలవాడిని.

తన్ కైచ్చార్ఙ్గమతువే పోల్ పురువమట్టమళకియ - ఈ కనుబొమలను చూస్తుంటే ముఖం మీద ఉండవలసిన ఈ కనుబొమలు శార్ఙ్గమనేవిల్లుగా చేతిలో ఉన్నాయే అనిపిస్తున్నదట అని నాచ్చియార్ తిరుమొళి 14-6లో ఆండాల్ తల్లి సర్వేశ్వరుడి శార్ఙ్గాన్ని ఆయన భ్రువములకు ఉపమానంగా సాధించినది గదా!

ఉజ్జ్వల అధరం చాల అందమైన తిరువధరములు గలవాడిని. స్వామి యొక్క అధరాలని వర్ణిస్తూ నమ్మాళ్వార్ తి.వా.మొ. 7-7-3లో ఇలా అంటున్నారు.

వాలియతోర్ కనికొల్ ? విన్నైయాట్టియేన వల్వినైకొల్? కోలన్తిరళ్ పవళక్కొళున్తుణ్డఙ్గొలో? అఱియేన్, నీలనెడు ముకిల్పోల్ తిరుమేనియమ్మాన్ తొణ్డైవాయ్ ఏలుమ్ తిశైయుళెల్లామ్ వన్దు తోన్లుమ్ ఎన్ ఉయిర్క్కే

విలక్షణమైయున్న ఒక (దొండ) పండా? అయ్యో దాన్ని అనుభవించలేని పాపం చేసిన నా అనుభవాన్ని ప్రక్కకి త్రోసివేసేవిధంగా రూపుదాల్చి వచ్చిందా నా పాపం?

లేక అందమైన పగడాల తుండమా? తెలియటం లేదు! నీలంగా ఉన్న పెద్ద మేఘం వంటి తిరుమేని గల ఆ స్వామి యొక్క దొండపండు రంగులో నున్న అధరాలు చూసిన దిక్కులన్నీ నా బ్రతుకునే నశింపజేయటానికి వచ్చినట్లు కనబడుతున్నదే అని ఈ అధరాలకి ఉపమానంగా ఏదీ లేదు గనుక వేటివేటినో చెప్పారు.

శుచిస్మితం పరిశుద్ధమైన చిరునవ్వుతో నున్న వాడిని. ఈ చిరునవ్వునే

కోలనఱుమ్ పవళచ్చెన్దువర్ వాయినిడైకోమళవెళ్ళి ముళైపోల్ శిల పల్లిలక అందమైన మంచి పగడం వంటి ఎఱ్ఱగా నున్న అధరాలలో సుకుమారమైన వెండి దంతాల వలె మెరిసిపోతున్న కొన్ని దంతాలు ప్రకాశిస్తూండగా అని పెరియాళ్వారు పెరియ తి.మొ 7-7-5లోనూ అత్యభినివేశంలో సాధించారు గదా.

(కోమలగణ్డమ్) అందమైన కపోలాలు గలవాడిని. అనుభవించేవారి మనస్సులను అర్ధపరుస్తూ అతిమృదువైనవి ఆ కపోలాలు (బుగ్గలు)

సాగరం అతిసౌకుమార్యాత్ ఈషత్ప్రస్విన్నవత్ ఆలక్ష్యమాణలలాట ఫలకదివ్యాలక - అవలీ విరాజితం. ప్రబుద్ధముగ్ధాంబుజచారులోచనం సవిభ్రమభ్రూలతం. ఉజ్జ్వలాధరం, శుచిస్మితం కోమలగణ్డం ఉన్నసం ఉదగ్ర పీన అంస విలంబి కుండల అలకావలీ బంధుర కంబు కంధరం, ప్రియా అవతంస ఉత్పల కర్ణభూషణ శ్లథ అలకాబంధ విమర్ద శంసిభిః ఆజానువిలంబిభిర్భుజైః విరాజితం, అతి కోమల దివ్యరేఖా అలంకృత ఆతామ్రకరతలం దివ్యాఙ్గుళీయక విరాజితం, అతికోమల నఖావలీ విరాజితం అతి(ను)రక్తాంగుళీభిః అలంకృతం తత్క్షణోన్మీలిత పుణ్డరీక సదృశ చరణయుగళం, అతిమనోహర కిరీట మకుట

ఉన్నసం ఎత్తుగానున్న ముక్కుగలవాడిని. ఈ నాసికనే

మాట్టుయర్ కఱ్పకత్తిన్ వల్లియో కొళున్దో మొలిచి చుట్టుపక్కల బాగా పెరిగిన అతికోమలమైన కల్పకవల్లియా? లేక దాని చిగురా? ఏమి తెలియటం లేదు అంటూ నమ్మాళ్వారు ఈ నాసికతో తమ అనుభవాన్ని తి.వా.మొ. 7-7-2లో సాధించారు.

ఉదగ్ర పీన అంస విలంబి కుండల అలకావలీ బంధుర కంబుకంధరం బాగుగా పెరిగి బలముగానున్న భుజముల వరకును వ్రేలాడు కుండలముచేతను, ముంగురుల చేతను సౌందర్యమును పొందినదిగను, మూడు మడతలతో నున్న కంఠముగలవానిని

ఆజాను విలంబిభిః మోకాలు వరకును వ్రేలాడునవి. ఇది పురుషోత్తమ లక్షణం కదా!

ప్రియా అవతంస ఉత్పల కర్ణభూషణ శ్లథ అలకాబంధ విమర్ద శంసిభిః లక్ష్మీదేవి యొక్క చెవులనెడి నీలోత్పలపుష్పము, కర్ణభూషణములు సర్వేశ్వరుడి కొంచెముగా కదులుతున్న ముంగురులైనవి తాకుతున్న

చతుర్భిః భుజైః విరాజితం నాలుగు దివ్యభుజాలతో ప్రకాశిస్తున్న వానిని.

అతికోమల దివ్యరేఖాలంకృత ఆతామ్ర కరతలమ్ కోమలములై, చాల అందంగా ఉండే అప్రాకృతమైన కలిగియున్నవాడిని.

దివ్యాఙ్గుళీయకవిరాజితం దివ్యమైన చేతివ్రేళ్లకు అలంకరించబడిన ఉంగరములతో ప్రకాశిస్తున్న వాడిని.

అతికోమలనఖావళీ విరాజితం చాలమృదువైన నఖముల వరుసగల వాడిని.

అనురక్తాం గుళీభిః అలంకృతం ఎఱ్ఱగా నున్న దివ్యమైన వ్రేళ్ళతో అందంగా మెరిసిపోతున్న వాడిని.

తత్క్షణోన్మీలిత పుండరీకసదృశ చరణయుగళమ్ అప్పుడే వికసిస్తున్న తామర పుష్పం వంటి రెండు శ్రీపాదాలు గలవాడిని.

(అతిమనోహర ..... భూషణైః భూషితం) చూసేవారికి మనస్సుకి ఆహ్లాదాన్ని కలిగించే కిరీటం, మొదలైన తిరువాభవరణాలతో అలంకరింపబడినవాడిని.

కిరీట మకుట కిరీట మకుటం అనే ఈ రెండు శిరోభూషణాలలో ఉన్న రెండు వేరు వేరు భాగాలని చెప్పవచ్చు. కిరీటానికి మీది భాగంలో విరాజిల్లుతున్న మణి, పింఛము మొదలైనవి ఉండి కిరీటానికే ఒక శోభని తెచ్చే మకుటం అనే పేరు గల ఆభరణ విశేషం. లేదా కిరీటం అనే పేరు గల శిరోభూషణం అని కూడా చెప్పవచ్చు.

చూడా ఆ శిరోభూషణం మీద పొదిగిన చుట్టు.

అవతంస శ్రీకర్ణపుష్పం

మకర కుండల చెవులకి వ్రేలాడే కుండలముల మకరాకారంలో ఉన్నవి.

గ్రైవేయక కంఠాభరణం

హార దివ్యమైన వక్షస్థలం మీద అలంకరించబడే పలురకాలైన హారాలు - ముత్యాల హారం, పగడాల హారం, మాణిక్యాల హారం మొదలైనవి (కేయూర) భుజాలకి అలంకరించే కంకణాభరణం

కటక ముంజేతులకు అలంకరించే కంకణం

శ్రీవత్స మరెవరికీ లేనిదీ ఈయనకే చెందినదీ అయిన వక్షస్థలం మీది పుట్టుమచ్చ

కౌస్తుభ వక్షస్థలం మీద ఉన్న నీలమాణిక్య పతాకం

ముక్తాదామ ముత్యాలహారం

ఉదరబంధన నడుము మీది భాగానికి అలంకరించే ఆభరణం

పీతాంబర బంగారు రంగులో నున్న పట్టు వస్త్రం

కాఞ్చీగుణ నడుముకు అలంకరించే మొలత్రాడు అనే ఆభరణం నూపుర గజ్జెలు

అదిభిః ఇటువంటి ఇంకా ఎన్నో ఆభరణాల చేత (అలంకరించబడినవాడు)

పలపలవే ఆభరణం అని తిరువాయమ్ మొళి 2-5-6లో ఆళ్వారు చేత వర్ణించబడినట్లుగా ఉన్న ఆభరణాలు

అత్యన్త సుఖస్పర్శైః ఈ ఆభరణాలన్నీ తిరుమేనిని నొక్కేవీ, గీసుకునేవి కాకుండా అతి మృదువుగా ఉండి సుఖంగా ఉంచేవి. తిరుమేనికి పూవుల అలంకరణ వలె ఉండేవి సుఖాన్ని ఆనందాన్నీ కలిగించేవి.

దివ్యగంధైః అప్రాకృతమైన సుగంధాలు గలవిగా ఉండే

చూడా అవతంస మకరకుండల గ్రైవేయక హారకేయూర కటక శ్రీవత్స కౌస్తుభ ముక్తాదామ ఉదరబంధన పీతాంబర కాఞ్చీగుణ నూపురాదిభిః

అత్యన్త సుఖస్పర్శైః దివ్యగంధైః భూషణైః భూషితం, శ్రీమత్యా, వైజయన్త్యా వనమాలయా విరాజితం, శంఖ చక్ర గదాసి శార్ఙ్గాది దివ్యాయుధైః సేవ్యమానం, స్వసంకల్పమాత్ర అవక్లుప్త జగజ్జన్మస్థితి ధ్వంసాదికే శ్రీమతి విష్వక్సేనే న్యస్తసమస్త ఆత్మైశ్వర్యం వైనతేయాదిభిః భూషణైః భూషితమ్ ఇటువంటి దివ్యాభరణాలుగా రూపుదాల్చినవారు గనకు వీరందరిని దివ్యాభరణాళ్వారులు అని చెప్పడం ఉన్నది.

శ్రీమత్యా వైజయంత్యా వనమాలయా విరాజితం సుందరమైన వైజయంతీ అను పేరు గల వనమాలతో ప్రకాశిస్తున్న వాడిని

శంఖ చక్ర గదాసి శార్ఙ్గాది దివ్యాయుధైః సేవ్యమానం పెల్లుబికే ప్రేమ చేత, చెరుపే దగ్గరకు రాలేకుండా ఉన్నటువంటి పరమపదంలో కూడా ఎప్పుడు ఏ ప్రమాదకరమైన చెరువు ఎదురౌతుందో అనే భయంతో ఎల్లవేళలా యుద్ధసన్నద్ధములై ఉండిన శంఖము, చక్రం నందకమనే ఖడ్గం, శార్ఙ్గమనే ధనుస్సు, గద ఈ పంచాయుధాది దివ్యాయుధాలై ఉన్న నిత్యసూరుల చేత పరివేష్ఠించబడి మంగళాశాసనం చేయబడుతున్నవానిని తరువాతి వాక్యఖండంతో నిత్యసూరులలో శ్రేష్ఠులైన విష్వక్సేనలనబడే సేనముదలియారులు వైలక్షణ్యాలని సాధిస్తున్నారు.

స్వసంకల్ప మాత్ర అవక్లుప్త జగజ్జన్మ స్థితి ధ్వంసాదికే తలచుకున్నంత మాత్రము చేతనే స్థావర జంగమరూపమైన సమస్తపదార్థాలనీ సృష్టించడం, రక్షించడం, సంహరించడం మొదలైన సమస్త కారాయలనీ చేయగలవారిని. జగత్ అని స్థావర (కదలని) జంగమ (కదులుతూండే) పదార్థాలలో నిండిన అండములో ఉండే వస్తువులు ఇక్కడ ఈ పదము చేత చెప్పబడుతున్నాయి. అండం, దాని కంటే ముందరిదైన ప్రకృతి, మహత్తు మొదలైన వాటిని సృష్టించే సమష్టి సృష్టి సర్వేశ్వరుడు ఒక్కడికే చెందినది గనుక నిత్యముక్తులకి జగద్వ్యాపారం లభించదు అని చెప్పే బ్రహ్మ సూత్రంతో వైరుధ్యం లేదు. వ్యష్టి సృష్టులని బ్రహ్మాదుల చేత వీరు చేస్తారని భావం. వీరి (విష్వక్సేనుల) మంత్రంలో కూడా విశ్వసృజే (లోకాన్ని సృష్టించేవారికి) అనే పదం ఉన్నది.

శ్రీమతి విష్వక్సేనే కైంకర్యైశ్వర్యానికి పెట్టి పుట్టిన సేనముదలియారుల మీద

న్యస్త సమస్త ఆత్మైశ్వర్యం తమ యొక్క సమస్తమైన నియమనైశ్వర్యాన్ని ఉంచినటువంటి వాడిని, స్తోత్ర రత్నం 42వ శ్లోకములో ఆళవందారు కూడా వీరి మహత్వాన్ని ఈవిధంగానే సాయించారు.

పెరియతిరువడి అనే గరుత్మంతుడు మొదలైన నిత్యసూరి సమూహం చేత సేవించబడిన ప్రకారము తరువాతి వాక్యఖండము చేత చూపుతున్నారు.

వైనతేయాదిభిః వైనతేయుడు అని చెప్పబడే గరుత్మంతుడు మొదలైన నిత్యసూరి జనాల చేత, ఆది శబ్దంతో ఏనుగు ముఖంగల గజముఖులు (గజాననులు) సింహ ముఖం గల సింహాననులు మొదలైన పారిషదాద్యులు, కుముదులు, చండులు మొదలైన గణనాయకులు మొదలైనవారు చెప్పబడుతున్నారు. ఇకపైనున్న పదాలు వీరందరి మహత్తులనీ వర్ణిస్తున్నాయి.

స్వభావతో నిరస్త సమస్త సాంసారిక స్వభావైః ముక్తులవలె ఒకనాటి నుంచి కాకుండా నిత్యులైన వాళ్లు తామున్నంత కాలమంతా కూడా సంసారులకి ఉన్న అన్ని హేయతలలో ఏవీ లేనివాళ్ళు.

భగవత్ పరిచర్యాకరణయోగ్యైః సర్వేశ్వరుడి తిరువడిగళుల కైంకర్యం చెయ్యటానికి పెట్టి పుట్టినవాళ్ళయి.

భగవత్ పరిచర్యైకభోగైః భగవత్కైంకర్యం తప్ప తమని నిలబెట్టగలిగినది వేరొకటి లేని వారైన

నిత్యసిద్ధైః ఎప్పుడూ ఉండే నిత్యసూరుల చేత

అనన్తైః వీళ్లు ఇంతవరకు అని లెక్కతో పూర్తిచేయ్యాలనుకున్నా కైంకర్యం చెయ్యటం ఆపలేని వారు అని భావం

యథాయోగం సేవ్యమానం సర్వేశ్వరుడు ఉన్న దశలన్నింటిలోనై వాటికి తగిన విధంగా ఈ నిత్యసూరుల చేత సేవింపబడే ఆయనను.

ఆత్మభోగేన అనుసంహిత పరాదికాల దివ్యామల కోమలావలోకనేన విశ్వం ఆహ్లాదయన్తం తన కటాక్షం చేత సమస్త చేతనులను ఆనందింపజేస్తున్న అతడిని అని అర్థం.

ఆత్మభోగేన అనుసంహిత అని సమస్త వస్తువులనూ ఆనందింపచేయటం స్వామియైన తన ప్రయోజనంగా భావించేవాడని చూపుతున్నది.

పరాది కాల అని ఈ అనుసంధానం కాలతత్త్వమున్నంతవరకూ నడుస్తుందని చూపుతున్నది. ఇక తరువాత కటాక్షం గొప్పతనాన్ని మహత్తుని చెప్తున్నది.

స్వభావతో నిరస్త సమస్త సాంసారిక స్వభావై భగవత్ పరిచర్యాకరణ యోగ్యైః భగవత్ పరిచర్యైకభోగైః నిత్యసిద్ధైః అనన్తైః యథాయోగం సేవ్యమానం

ఆత్మభోగేన అనుసంహిత పరాతికాల దివ్యామల కోమల అవలోకనేన విశ్వం ఆహ్లాదయన్తం ఈషత్ ఉన్మీలిత ముఖామ్బుజ – ఉదర వినిర్గతేన దివ్యాననారవిన్ద శోభాజనకేన దివ్య గాంభీర్య ఔదార్య (సౌందర్య) మాధుర్యాది అనవధిక గుణగణ విభూషితేన అతిమనోహర దివ్య భావగర్భేణ దివ్యలీలాలాప అమృతేన అఖిల జన హృదయాన్తరాణి ఆపూరయన్తం భగవన్తం

అనుసంధానం కాలతత్త్వమున్నంతవరకూ నడుస్తుందని చూపుతున్నది. ఇక తరువాత కటాక్షం గొప్పతనాన్ని మహత్తుని చెప్తున్నది.

దివ్య చాల విశేషమైన కటాక్షం

అమల చేతనులు చేసే దోషాలని తలచుకొని కూడా కలతచెందని కటాక్షం. అవలోకన శబ్దం కటాక్షాన్ని చెప్తుంది.

విశ్వం ఆహ్లాదయంతం సమస్త వస్తువులనీ వెనుక చెప్పిన కటాక్షంతో ఆనందింపజేస్తున్న వానిని తరువాత ఆపూరయన్తం అన్నంత వరకూ సర్వేశ్వరుడి వాగమృతాన్ని వర్ణిస్తున్నారు.

ఈషదున్మీలిత ముఖాంబుజోదర వినిర్గతేన మొదట వాగమృతం బయటపడే స్థలాన్ని వర్ణిస్తున్నారు. కొంచెం కొంచెంగా విచ్చుకొంటున్న ముఖపద్మం మధ్యనుంచి బయటికి వస్తున్నటువంటి

దివ్యాననారవింద శోభాజనకేన అందమైన తిరుముఖ పద్మానికి, ముఖ్యమైనదిగా ఉన్న తిరువధరములకు ఆభరణంతో అలంకరించినట్లుగా ఆందంగా ఉండేటట్లున్న మధురమైన ఈ వాగమృతం

దివ్యగాంభీర్య ఔదార్య మాధుర్యాది అనవధిక గుణగణవిభూషితేన అందమైన, గంభీరమైనదీ పెద్ద స్వరం, సంపదలని ఉదారంగా ప్రసాదించే స్వభావం, మాధుర్యం మొదలైన దయాది అనంతములైన గుణగణాలచేత అలంకరించబడినదిగా ఉన్న వాగమృతం.

అతిమనోహర దివ్య భావగర్భేణ మనసును చాలా ఆర్ద్రపరిచేది, అందమైన భావాలు గలదీ అయిన వాగమృతం

దివ్యలీలాపామృతేన ఇటువంటి మహదానందాన్ని కలిగించే వాక్కులనే అమృతం చేత

అఖిల జన హృదయాన్తరాణి ఆపూరయన్తం అందరి యొక్క మనస్సులను పూర్తిగా నింపేటటువంటి

భగవన్తం నారాయణం ఈ విధంగా హేయతలకి ప్రత్యనీకుడై కల్యాణగుణాలకి ఏకైకమైన స్థానమైనవాడు గనుక భగవాన్ అనబడే నారాయణుని

ధ్యానయోగేన దృష్ట్వా మనసుతో చూచి సేవించి, ధ్యానయోగేన దృష్ట్వా అని యోగశబ్దాన్ని చెప్పటం చేత భక్తియోగాన్ని అనుష్ఠించి దాని ప్రయోజనంగా మనస్సులో కలిగే ప్రత్యక్ష సమానాకారదర్శనాన్ని చెప్పినట్లుగా ఉన్నది. మొదటి చూర్ణికలో శరణం అనుప్రజేత్ అని ప్రపత్తి చేసినట్లు చెప్పినదానికి ప్రయోజనం లేదా? అంటే అలా కాదు, ప్రపత్తి చేసిన వారికి కూడ సర్వేశ్వరుడు ఆ విధంగా మానసికంగా ప్రత్యక్షసమానాకారమైన దర్శనాన్ని ప్రసాదిస్తాడు. దాన్నే చెప్తున్నది అని గ్రహించవలెను.

ధ్యానయోగేన అన్నది భక్తియోగం చేత మనస్సులో ప్రత్యక్షసమానాకారదర్శనం వలెనే అని అర్థం వస్తున్నది. అలా కాకపోతే రెండవచూర్ణికలో, తన ఆత్మోజ్జీవనానికి ప్రతిదినమూ ఈ విధంగా అనుసంధించవలెను అని చెప్పిన అనుసంధానం పక్వమైన రూపుదాల్చి ప్రకాశించే సేవని "ధ్యానయోగేన దృష్ట్వా" అని చెప్పినట్లుగా గ్రహించవలెను.

ఆశాం వర్ధయిత్వా అన్నంత వరకూ ఇతడు సర్వేశ్వరుడికి కైంకర్యం సర్వదా చేయాలనే ఆశను వృద్ధిపరిచే ప్రకారము చెప్పబడుతున్నది.

భగవతో నిత్యస్వామ్యం ఆత్మనో నిత్యదాస్యం చ యథావస్థితం అనుసంధాయ వెనుక 169వ ప్రమాణమైన విష్ణుతత్వశ్లోకం ప్రకారము సర్వేశ్వరుడు ఎల్లవేళలా స్వామిగానూ జీవాత్మ ఎల్లప్పటికీ ఆయనకి దాసుడుగానూ స్వభావసిద్ధంగానే ఉన్నటువంటి సంబంధాన్ని తెలిసికొని, ఇక ఈ సంబంధ జ్ఞానం చేతనూ, వెనుక చెప్పిన సాక్షాత్కారం చేతనూ కైంకర్యం చెయ్యటానికి కలిగే మనోరథాన్ని వర్ణించబడుతున్నది. (కదా) ఆరోజు ఎప్పుడు వస్తోందో అని తొందరతో ఎదురుచూస్తున్నారు.

అహం తప్పిపోని ఉపాయమైన సర్వేశ్వరుడు వశపడియున్నందున లాభమైన కైంకర్యం చెయ్యటంలో తొందరపడుతున్న నేను.

భగవంతం నారాయణం నేను నాలస్యాన్ని ఓర్చుకొనలేని విధంగా ఉన్న కల్యాణగుణాలు గల భగవానుడిగను నాతో సర్వవిధ సంబంధములూ గల నారాయణుడు గదా ఆయన మమనాథం నాకు ప్రాప్యమైన స్వామియైన వాడు గదా!

మమ కులదైవతం సర్వస్వామిగా కాకుండా ఎంద్రై, తన్దై, తంద్రై అని తిరుప్పల్లాండులో చెప్పినట్లు మా కులానికే పరంపరగా వస్తున్న దైవమైయున్నవాడు గదా ఆయన!

మమ కులధనం నావంశానికే ఆపదలో ఉపకరించే పెట్టుబడిగానున్న వాడు ఆయన




మమ భోగ్యం నాకు అతి ప్రియమైన భోగ్యమైనవాడు

మమ మాతరం నన్ను కడుపులో పెట్టుకొని నాకు ప్రియమైన దాన్ని చేసేవాడు గదా!

మమ పితరం సృష్టించిన తండ్రిగా నన్ను పుట్టించినవాడై నాకు హితాన్ని చేసేవాడాయన!

మమ సర్వం 99వ ప్రమాణమైన సుబాలోపనిషద్వాక్యంలో చెప్పబడినట్లుగానున్నూ, శరణాగతిగద్య 7వ చూర్ణికలో చెప్పినట్లుగను

శేలేయ్ కన్నియరుమ్ పెరుఞ్జెల్వముమ్ నన్మక్కళుమ్ మేలాత్తాయ్‌తందైయుమ్ అవరే ఇనియవారే విలక్షణమైన నేత్రములు గల భోగ్యములైన స్త్రీలున్ను దానికి ఉపకరించే అపరిమితమైన సంపదయు, గుణవంతులైన సంతానమున్ను, ప్రేమించే తల్లిదండ్రులును ఇంకా సమస్తము అయిన వారు వారే అని తి.వా.మొ 5-1-8లో నమ్మాళ్వారు సాధించి నట్లుగా ఇక్కడ అనుక్తములైన సమస్తమూ నాకు తానే అయియున్నవాడు ఆయనే గదా!

సాక్షాత్కరవాణి చక్షుషా కొంచెం ముందుగా చెప్పిన ప్రత్యక్ష సమానాకార మానసిక సాక్షాత్కారం వలె కాకుండా.

198 తద్విష్ణోః పరమం పదంసదా పశ్యన్తి సూరయః ।దివీవ చక్షురాతతమ్॥ ఋ.అష్ట 1-2-7

తద్విప్రాసో విపన్యవో జాగృవాంస స్సమింధతే। విష్ణోర్యత్ పరమం పదమ్॥

సామ.3-18-2-4

(విష్ణువు యొక్క ఆ పరమపదాన్ని నిత్యసూరులు సర్వదా సేవిస్తూంటారు. ఆ పరమపదం సమస్తాన్నీ ప్రకాశింపజేసేవాడును, పరమాకాశంలో ఉండేవాడున్నూ లోకానికంతటికీ చక్షుస్సైన వాడున్ను అయిన సూర్యుడివలె ప్రకాశమున్నది. విష్ణువు యొక్క ఏ పరమ పదం ఉన్నదో, అందులో మేధావులున్ను, స్తుతించటమే స్వభావంగా గలవారును, జాగృతులగానున్న వారును అయిన నిత్యసూరులు ప్రకాశించుచున్నారు) అనే వేద వాక్యం ప్రకారమున్ను కణ్ణు కొణ్డు ఎన్ కణ్ణిణైకళ్ ఎన్రుకొలో కళిక్కుం నాళ్ నా రెండుకళ్ళూ విచ్ఛేదం లేకుండా సేవించుకుంటూ ఆనందించే రోజు ఎప్పుడో గదా! అని పెరుమాళ్ తిరుమొళి 1-1లో సాధించినట్లుగా నేను పరమపదానికి వెళ్ళి ఆయనని ప్రత్యక్షంగా సేవించటమెప్పుడో

కదాహం భగవత్ పాదాంబుజద్వయం శిరసా ధారయిష్యామి

199 కదా పునశ్శంఖరథాఙ్గకల్పక ధ్వజారవిందాంకుశవజ్రలాంఛనం ।

త్రివిక్రమ! త్వచ్చరణాంబుజద్వయం మదీయమూర్ధానమలంకరిష్యతి ॥ స్తో.ర. 31

(త్రివిక్రముడిగా అవతరించిన స్వామీ! శంఖం, చక్రం కల్పకవృక్షం, ధ్వజం, పద్మం, అంకుశం, వజ్రాయుధం -వీటిని చిహ్నాలుగా గల నీ శ్రీపాదతామరల ద్వంద్వం నా తలని ఎప్పుడు అలంకరించబోతున్నాయో ?) అనిన్నీ తళిర్పురైయుమ్ తిరువడి ఎన్ తలైమేలవే - చిగురులాగ అతికోమలమైన నీ శ్రీపాదాలు నా శిరస్సుని అలంకరించే వేంచేసి యున్నాయి, చూడండి ఎంత ఆశ్చర్యంగా ఉన్నది. (తి.నె.ఆం.1) అనిన్నీ చెప్పినట్లుగా నా స్వరూపానికి తగిన స్వామియొక్క అంతులేని మాధుర్యం గల శ్రీపాదతామరలను నేను శిరసా ధరించటం ఎప్పుడో గదా!

కదాహం భగవత్ పాదాంబుజద్వయ పరిచర్యాశయా నిరస్త సమస్తేతర భోగాశః అపగత సమస్త సాంసారిక స్వభావః త్వత్పాదామ్బుజద్వయం ప్రవేష్యామి

సర్వేశ్వరుడి శ్రీపాదాలకి కైంకర్యం చేయాలనే రుచిచేత ఇతరవిషయాలని అనుభవించాలనే గాఢమైన కోరిక తొలగినవాడనై, రాగం (హేయమైన విషయాలమీది ఆశ) ద్వేషం (మంచి విషయాల మీద వ్యగ్రత) మొదలైన సమస్త లోక వ్యవహారపు అలవాట్లు తమంతట తాముగా నశించిపోయి, నేను ఎప్పుడు ఆ శ్రీపాదద్వంద్వాన్ని పొందుతానో?

కదా మాం భగవాన్ స్వకీయయాతిశీతలయా దృశా అవలోక్య స్నిగ్ధ గంభీర మధురయా గిరా పరిచర్యాయాం ఆజ్ఞాపయిష్యతి పరమపురుషుడు తన అతి చల్లని నేత్రములతో కటాక్షించి ప్రీతిగల, గంభీరమైన, మధురమైన వాక్కులతో ముకప్పే కూవి పృణికొళ్ళాయ్ నీ సమక్షానికి పిలచి నాచేత కైంకర్యాన్ని స్వీకరించు అని తి.వా.మొ 8-5-7లో ఆళ్వారులు సాయించినట్లుగా కైంకర్యములో నన్ను నియమించటం ఎప్పుడు?

ఇతి భగవత్పరిచర్యాయాం ఆశాం వర్ధయిత్వా అని ఈవిధంగా భగవత్కైంకర్యం మీద ఆశని పెంచి.

మమ భోగ్యం మమ మాతరం మమ పితరం మమ సర్వం సాక్షాత్కరవాణి చక్షుషా, కదాహం భగవత్ పాదాంబుజద్వయం శిరసా ధారయిష్యామి (సంగ్రహిష్యామి)

కదా అహం భగవత్పాదాంబుజద్వయ పరిచర్యాచరణయోగ్యః (తదేకభోగః) తత్పాదౌ పరిచరిష్యామి) కదా అహం భగవత్ పాదామ్బుజద్వయ పరిచర్యాశయా నిరస్త సమస్తేతర భోగాశః అపగత సమస్త సాంసారిక స్వభావః తత్పాదాంబుజద్వయం ప్రవేష్యామి. కదా మాం భగవాన్ స్వకీయయా అతిశీతలయా దృశా అవలోక్య స్నిగ్ధ గంభీర మధురయా గిరా పరిచర్యాయాం ఆజ్ఞాపయిష్యతి – ఇతి భగవత్పరిచర్యాయాం ఆశాం వర్ధయిత్వా, తయైవ ఆశయా తత్ప్రసాద – ఉపబృంహితయా భగవంతం ఉపేత్య, దూరాత్ ఏవ – భగవంతం శేషభోగే శ్రియాసహాసీనం వైనతేయాదిభిః సేవ్యమానం సమస్త పరివారాయ శ్రీమతే నారాయణాయ నమః ఇతి ప్రణమ్య ఉత్థాయ, ఉత్థాయ పునః పునః ప్రణమ్య అత్యన్త సాధ్వసవినయావనతః భూత్వా

తయైవ ఆశయా తత్ ప్రసాదోపబృంహితయా భగవంతం ఉపేత్య సర్వేశ్వరుడి యొక్క కృపచేత మున్ముందు ఒడ్లు తెంచుకొని పెరుగుతున్న ఆ ఆశతో ఆయనను సమీపించి,

దూరాదేవ భగవంతం శేషభోగే శ్రియా సహాసీనం ప్రణమ్య దూరాదేవ అనే పదం ఈ వాక్యం చివరనున్న ప్రణమ్య అన్న పదంతో అన్వయించుతున్నది. దూరం నుంచే ప్రణమిల్లి అని అర్థం. ఎవరిని ఎలా నమస్కరించటం? అన్న విషయాన్ని మిగతా పదాలు తెలుపుతున్నాయి ఎవరికి ప్రణామం చెయ్యటం అంటే

భగవన్తం శేషభోగే శ్రియా సహాసీనం తిరువనంతాళ్వానులు ఒడితో లక్ష్మీదేవితో కలసి వేంచేసియున్నవాడిని, పెరియ తిరువడి అనే గరుత్మంతుడు మొదలైన నిత్యసూరుల చేత ఎల్లప్పుడు సేవించబడే భగవానుడిని. ఎలా ప్రణామం చెయ్యాలి? అంటే

సమస్త పరివారాయ శ్రీమతే నారాయణాయ నమః ఇతి ప్రణమ్య, ఉత్థాయ, ఉత్థాయ పునః పునః ప్రణమ్య) పరివారమంతటితో చేరియున్న శ్రీమన్నారాయణుడికి నమస్కారం అని దూరంగానే దండం పెట్టి. ఆ తరువాత కూడా సర్వేశ్వరుడి దగ్గరికి చేరేంత వరకూ అత్యార్తి చేత మళ్ళీ మళ్ళీ ప్రణామం చేస్తూ వెళ్ళి.

అత్యన్త సాధ్వసవినయావనతో భూత్వా, భగవత్ పారిషదగణనాయకైః ద్వారపాలైః కృపయా స్నేహగర్భయా దృశావలోకితః భూత్వా మిక్కిలిగా నున్న మనోభయం చేత బట్టలను దగ్గరగా ముడుచుకొనటం, నోటిని కప్పుకొనటం మొదలైనవి చేస్తూ తలని వంచి నమస్కరించి సర్వేశ్వరుడి పారిషదగణాలకి చెందినవారు. గణనాయకులైన సేనానాయకులు, ద్వారపాలకులైన వారిచేత ప్రేమగా, కరుణాపూరితాలైన నేత్రాలతో కటాక్షించబడి.

సమ్యక్ అభివందితైః తైరేవానుమతో భూత్వా భగవంతం ఉపేత్య, శ్రీమతా మూలమంత్రేణ భగవన్! మాం ఐకాంతిక ఆత్యంతిక పరిచర్యాకరణాయ పరిగృహ్ణీష్వ ఇతి యాచమానః ప్రణమ్య ఆత్మానం భగవతే నివేదయత్ మనః పూర్వకంగా ప్రణమిల్లిన వారి చేత అనుమతించబడి శ్రీవైకుంఠనాథుడికి దగ్గరగా వెళ్ళి మూలమంత్రమైన తిరువష్టాక్షరాన్ని అనుసంధానం చేసుకుంటూ సర్వేశ్వరా! దాసుడిని వేరొకదానిలో అభినివేశం చెందకుండా చేసి, కాలమంతా కూడా అంతులేని కైంకర్యం చేయటానికి కటాక్షించవలెను అని ప్రార్థించే వాడై నమస్కరించి తనను సర్వేశ్వరుడికి సమర్పించుకొనవలెను.

సమ్యక్ అభివందితైః తైరేవ అనుమతః భూత్వా భగవంతం ఉపేత్య, శ్రీమతా మూలమంత్రేణ భగవన్ మాం ఐకాంతిక ఆత్యన్తిక పరిచర్యా కరణాయ పరిగృహ్ణీష్వ ఇతి యాచమానః ప్రణమ్య ఆత్మానం భగవతే నివేదయత్

4. తతో భగవతా స్వయమేవ ఆత్మ సఞ్జీవనేన (అమర్యాదశీలవతా అతిప్రేమాన్వితేన) అవలోకనేన అవలోక్య సర్వదేశ, సర్వకాల, సర్వావస్థోచితాత్యన్త శేషభావాయ స్వీకృతః

4. నాలుగవ చూర్ణికకి అవతారికః వెనుక చెప్పిన రీతిలో ప్రార్థించిన ప్రకారము సర్వేశ్వరుడి చేత స్వీకరించబడిన వాడై కైంకర్యము చేస్తూన్నాడు అంటున్నది ఈ చూర్ణిక.

వ్యా. (తతః) వెనుకటి చూర్ణికలో చెప్పబడినట్లుగా తనని సమర్పించుకొన్న తరువాత (భగవతా) పరమపురుషుడిచేత,

స్వయమేవ ఇతడు కోరుకొన్నట్లుగనే

ఆత్మసంజీవనేన అవలోకనేన ఆత్మని ఉజ్జీవింపజేసే దృష్టితో, ఈ రెండు పదాలకీ మధ్యన అమర్యాద శీలవతా అతి ప్రేమాన్వితేన (అంతులేని సౌశీల్యము చేతను, చాల ప్రేమతో కూడిన) అనే రెండు పదాలు పాఠాంతరముగా కనబడుతున్నాయి. అవి వ్యాఖ్యానంలో చెప్పబడలేదు.

అవలోక్య కటాక్షించి

సర్వదేశ సర్వకాల సర్వావస్థోచిత అత్యన్త శేషభావాయ అన్ని దేశాల్లో, అన్నికాలాల్లోనూ అన్ని దశలలోనూ తగినట్లుగా అంతులేని కైంకర్యము కొరకు

స్వీకృతః అనుజ్ఞాతశ్చ స్వీకరించబడినవాడును అనుమతించబడినవాడును అయి

అత్యన్త సాధ్వస వినయావనతః ఎక్కువగా కలిగిన భయము చేత, వినయంతో దించుకొనిన, ఇది వరకే వచ్చిన ఈ రెండు పదాలున్నూ తిరిగి వ్యాఖ్యానించబడలేదు.

కింకుర్వాణః కృతాఞ్జలిపుటః స్వరూపానికి తగినట్టుగా చేతులు రెండు జోడించి అంజలి చేసినవాడై భగవన్తం ఉపాసీత

112 సోశ్నుతే సర్వాన్ కామాన్ సహ బ్రహ్మణా విపశ్చితా (తై.ఆ. 1-2)

ముక్తుడు సమస్త కల్యాణగుణాలనూ, సర్వజ్ఞుడైన బ్రహ్మముతో కూడా అనుభవించుచున్నాడు అని చెప్పినట్లుగా శ్రీవైకుంఠనాథుడి జ్ఞానము, శక్తి మొదలైన గుణాలను అనుసంధానము చేసి.

70 ఏతత్ సామగాయన్నాస్తే । హా వుహా వుహా వు । అహమన్నమహమన్నమహమన్నమ్ । అహమన్నాదో అహమన్నాదో అహమన్నాదః ॥ (తై.భృ 10-6)

(ముక్తాత్మ (పరమాత్మని పొంది) ఈ సామను పాడుతున్నాడు - హా వుహా వుహా వు, నేను పరమాత్మకు అన్నమై యున్న వాడిని, అన్నమైయున్న వాడిని, అన్నమైయున్నవాడిని. నేను (పరమాత్మ యొక్క ఆనందమనే) అన్నమును తినువాడను, అన్నమును తినువాడను) అనే సామగానం చేస్తూ అన్దమిల్ పేరిన్బత్తు అడియరోడు ఇరున్దమై అనంతమైన మహానందంతో దాసులతో కూడి ఉండటం అని తి.వా.మొ. 10-9-11లో నమ్మాళ్వారు సాయించినట్లుగా సర్వేశ్వరుడిని సేవిస్తూన్నాడు అంటున్నారు.

5 అయిదవ చూర్ణికకు అవతారికః ముక్తుడికి వెనుకటి చూర్ణికలో చెప్పబడిన అనుభవం కలిగిన ఆనంద వెల్లువ చేత, మరొక దానిలో దేనిలోనూ ఆసక్తి లేకుండా సర్వేశ్వరుడిని సర్వదా సేవిస్తున్నాడు అంటున్నది ఈ చూర్ణిక.

వ్యా - తతశ్చ ఆ పైన (అనుభూయమాన భావవిశేషః సర్వేశ్వరుడి రక్షకత్వం (రక్షించే స్వభావం) మొదలైన గుణాలను అనుభవించినవాడై యుండి.

200 తద్భావభావమాపన్నస్తతో సౌ పరమాత్మనా ।

భవత్యభేదీ భేదశ్చ తస్యాజ్ఞానకృతో భవేత్॥ వి.పు 6.7.95

పరమాత్మ యొక్క స్వభావముల వంటి స్వభావములను పొందిన ఈ ముక్తుడు పరమాత్మలో (గుణాల విషయములో) భేదము లేని వాడైనాడు (ఇప్పుడు కనబడే) భేదం జ్ఞానము కంటే వేరైన కర్మ చేత కలిగినది) అని చెప్పినట్లుగా సర్వేశ్వరుడి స్వభావాలైన

అపహత పాప్మత్వం (పాపములు లేని వాడుగా ఉండటం)

విజరత్వం (ముసలితనం లేని వాడుగా ఉండటం)

విమృత్యుత్వం (మరణం లేని వాడుగా ఉండటం)

విశోకత్వం దుఃఖం లేనివాడుగా ఉండటం

విజిఘత్సత్వం ఆకలి లేని వాడుగా ఉండటం

అపిపాసత్వం దాహం లేనివాడుగా ఉండటం

సత్యకామత్వం స్థిరమైన కల్యాణగుణాలు కలిగిన వాడుగా ఉండుట

అనుజ్ఞాతశ్చ అత్యన్తసాధ్వసవినయావనతః కిఙ్కుర్వాణః

కృతాఞ్జలిపుటః భగవన్తం ఉపాసీత

5. తతశ్చ అనుభూయమాన భావ విశేషః

నిరతిశయ ప్రీత్యా అన్యత్కిఞ్చిత్ కర్తుం ద్రష్టుం

స్మర్తుం అశక్తః పునరపి శేషభావమేవ

సత్యసంకల్పత్వం విఘ్నములు లేని సంకల్పము గలవాడుగా ఉండటం అనే ఎనిమిది గుణాలను అనుభవిస్తున్నవాడై అనే అర్థం చెప్పుకోవాలి.

నిరతిశయ ప్రీత్యా సాటిలేని ఇంతకంటె గొప్పతనంగాని మరొకదానికి దేనికీ లేని ఆనందము చేత

అన్యత్ కించిత్ కర్తుం (దష్టుంసమర్తుం అశక్తః)

201 ఏవముక్తా సముత్పద్య సీతా శశినిభాననా ।

ప్రహర్షేణా వరుద్ధా సా వ్యాజహార న కిఞ్చన ॥ రా.యు. 116-14

చంద్రుడితో సమానమైన ముఖము గల సీతాదేవి, హనుమ చేత ఈ విధముగా చెప్పబడినదై, మహానందముతో

అవరుద్ధయై గంతులో అడుపడినట్లుగా ఏ మాటయు చెప్పిలేదు అని చెప్పినట్లుగా, సీతాదేవి రాముడి విజయవార్తని విన్నవెంటనే ఉన్మస్తకమైన ఆనంద వెల్లువలో మునిగిపోయి నోటమాటరాక ఉండిపోయినట్లుగా. ఈ ముక్తుడు కూడ అతిశయించిన ఆనందము చేత మరొకటి ఏమీ చేయడంగాని మరొక దాన్ని చూడటంగాని, తలుచుకొనటం గాని చేయలేనివాడై, అలాగ కాకుండా.

202 నోపజనం స్మరన్నిదం శరీరం (చాం.8-12-3)

జనాలకు దగ్గరగా నుండే ఈ శరీరాన్ని అతను చూచుట (తలచుకొనుట) (లేదు) అని చెప్పినట్లు ఈ లోకములో జీవితంలో ఎప్పుడు చేసే చేతలు, చూపు, తలంపు అనే వాటిని వదలినవాడై, అని అర్థం చెప్పుకోవాలి.

పునరపి శేషభావమేవ యాచమానః దాసత్వాన్ని ఇదివరకే పొందియున్నప్పటికీ, దాని ప్రీతి చేత అది స్థిరంగా ఉంటుందా అనే సందేహము చేత మళ్ళా మళ్ళా ఈ కైంకర్యభాగ్యం నశించకుండా స్థిరంగా ఉండవలెను అని కోరి

భగవన్త మేవ శ్రీవైకుంఠ నాథుడినే

అవిచ్ఛిన్న స్రోతోరూపేణ అవలోకనేన విచ్ఛేదం లేని ధారవలె ఉండే దృష్టిచేత

అవలోకయన్ ఆసీత చూస్తూనే ఉండాలి.దర్శిస్తూనే ఉండవలెను.

అన్యత్ కించిత్ కర్తుం ద్రష్టుం స్మర్తుం అశక్తః అనే వాక్య ఖండానికి

203 నాశ్నన్తి న పిబన్తి ఏతదేవామృతం దృష్ట్వా తృప్యన్తి (ఛాం.3-10)

వారు తినుటయే లేదు, త్రాగను లేదు. అమృతమైన ఈ పరమాత్మని దర్శించి ఆనందించుచున్నారు అని చెప్పినట్లుగా ఈ లోకములో నున్న అన్నం, పానం మొదలైన వాటిని లెక్కచేయకనే ఎల్లప్పటికిని దర్శించుతూనే ఉన్నాడు అనే అర్థం చెప్పాలి.

6 ఆరవ చూర్ణికకు అవతారికః చివరి చూర్ణిక అయిన ఈ ఆరవ చూర్ణికలో కైంకర్య సామ్రాజ్యానికి పట్టాభిషిక్తుడయ్యే రాజై ప్రీతిగా జీవిస్తున్నాడు అని చెప్పి పూర్తి చేస్తున్నారు.

వ్యా. తతో భగవతా స్వయమేవ ఆత్మ సఞ్జీవనేన అవలోకనేన అవలోక్య సస్మితం ఆహూయ అమ్మాన్ అళిప్పిరాన్ అవనెవ్విదత్తాన్ యానార్ చక్రధారియై ఆశ్రితులను అనుభవింపచేసే మహోపకారకుడును, నిరుపాధిక స్వామిన్నీ అయిన ఆయన, అపరిచ్ఛిన్నమైన జ్ఞానం గల నిత్య సూరులు కూడా ఇంత అని ఒక పరిమితితో ఆయనను అనుభవించడానికి లేని విధంగా దగ్గరకి చేరలేనంత విలక్షణుడు, నేనైతే - ఈ విషయములో కృత్రిమమైన మాటలు మొదలైనవి చెప్పే అతి క్షుద్రుడినైన నేను అని తి.వా.మొ.5-1-7లో చెప్పినట్లుగా ఈ చేతనుడు తనకు అనాదికాలంగా ఉంటూ వస్తున్న క్షుద్రత్వాన్ని తలుచుకొని దూరంగా తొలగుతుండగా, సర్వేశ్వరుడు ఏం చేశాడో చెప్తున్నది ఈ వాక్యం. అంటే, అందమైన దివ్య నేత్రాలతో చూసిన చూపుతో ఈ యుక్తుడు పరవశుడైయేటట్లుగా చల్లని చూపుతో నేనే నాకు ఈశ్వరుడు అని అనాదికాలంగా బావిస్తున్నవాడిని. నేను దేవరవారికి దాసుడిని అని విన్నవించి, ఆశ్చర్యకరంగా నానీడలో చేరిపోవటమైందే అని అత్యానందం చేత చిరునవ్వుతో. (రాముడు మళ్ళీ పిలుస్తాడేమో అనే ఆశతో గుహుడితో బాటుగా అక్కడే ఎన్నోరోజులు ఉన్నాను అని సుమంత్రుడు వినాలని ఆశించిన అందమైన గంభీరమైన వాక్కుతో ఈ ముక్తుడిని పిలచి, ఇక రాబోయే వాక్యాలు సర్వేశ్వరుడి శ్రీపాదకమలాల శ్లాఘ్యతని భోగ్యత్వాన్నీ చెప్తున్నాయి).

204 గుహేన సార్థం తత్రైవ స్థితోస్మి దివసాన్ బహూన్ ।

అశయా యదివా రామః పునః శబ్దాపయేదితి ॥ రా.అ.59.3

యాచమానః భగవన్తమేవ అవిచ్ఛిన్న స్రోతోరూపేణ అవలోకనేన అవలోకయన్ ఆసీత॥

6. తతో భగవతా స్వయమేవ ఆత్మ సఞ్జీవనేన అవలోకనేన అవలోక్య, సస్మిత మాహూయ, సమస్త క్లేశాపహం నిరతిశయ సుఖావహం ఆత్మీయం శ్రీమత్పాదారవిందయుగళం శిరసి కృతం ధ్యాత్వా అమృతసాగరాన్తర్నిమగ్నసర్వావయవః సుఖమాసీత ॥

ఇతి వైకుంఠగద్యం సమాప్తమ్

భగవద్రామానుజ మునిభిరనుగృహీతం

గద్య త్రయం సమాప్తమ్

సమస్త క్లేశాపహం సంసారంలో ఈ జీవుడు అనుభవించిన సమస్తమైన దుఃఖాలనీ తొలగించేది ఈ శ్రీపాదద్వంద్వం.

నిరతిశయసుఖావహం అంతులేని ఆనందాన్ని ఇవ్వగలది ఈ శ్రీపాదద్వంద్వం

ఆత్మీయం పరమపురుషుడైన తనది

శ్రీమత్ అనంతమైన మాధుర్యం గలది (పాదారవిందయుగళం) శ్రీపాదకమలద్వంద్వాన్ని

శిరసీకృతం ధ్యాత్వా తన శిరస్సుమీద సర్వేశ్వరుడు పెట్టినట్లుగా ధ్యానం చేసి

అమృతసాగరాన్తర్నిమగ్న సర్వావయవః సుఖం ఆసీత ఆనందమనే అమృతసాగరంలో పూర్తిగా మునిగిన సమస్తమైన అవయవములు గలవాడై సుఖంగా ఉంటాడు. ఈ గద్యం అంతటిలోనూ చెప్పబడిన.

తాత్పర్యం సర్వేశ్వరుడినే ఉపాయంగా నిశ్చయించుకొనటమనే ప్రపత్తిని రక్షకంగా స్వీకరించి త్రిగుణమయమైన ప్రకృతిమండలాన్ని వదలి అప్రాకృతమై శుద్ధసత్వమయమైన పరమపదానికి వెళ్ళి నిత్యసూరుల సమూహం చేత సేవించబడుతున్న శ్రీవైకుంఠనాథుడిని పొంది, ఆయనని ప్రార్థించి కైంకర్యాన్ని పొంది ఆత్మ ఉన్నంతవరకూ అంటే నిత్యము బ్రహ్మానందం గలవాడై యుంటాడు ముక్తుడైన చేతనుడు.

ఇతి వైకుంఠగద్య వివరణం సమాప్తమ్

పెరియవాచ్చాన్పిళ్ళై గారు వ్యాఖ్యానించిన

గద్యత్రయం వివరణం